# అభ్యుదయ



కాళిదాస సంచిక

# అభ్యుదయ

కాళిదాస సంచిక

శరది కుముద సఙ్గా ద్వాయవో వాన్తి శీతా
విగత జలద బృందా దిగ్విభాగా మనోజ్ఞాః,
విగతకలుషమమ్భః శ్యానపఙ్కా ధరిత్రీ
విమలకిరణచన్ద్రం వ్యోమ తారావిచిత్రమ్

— దుర్ముఖి శరత్తు

**1956 అక్టోబర్**




ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం
**విజయవాడ**

వెల : రూపాయి

# విషయసూచిక





## సంపాదకవర్గం

★

శ్రీరంగం శ్రీనివాసరావు, కొడవటిగంటి కుటుంబరావు, అనిసెట్టి సుబ్బారావు,
తుమ్మల వెంకటరామయ్య, కె. వి. రమణారెడ్డి.

---


స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ - 2.

# అభ్యుదయ

'కవికులగురువు', మహాకవి కాళిదాస జయంతి సంచికగా 'అభ్యుదయ'ను సమర్పించుతున్నాం. భారతీయ సంస్కృతీ చరిత్రలో ఉజ్వలతారగా వెలుగొందినది వ్యాస, వాల్మీకుల తర్వాత కాళిదాసే అనవచ్చు. ఒకజాతి మహోన్నతదశకు ప్రతిబింబంగా జాతీయ మహాకవిని పేర్కొనవలసినపుడు, కాళిదాసుకన్న అర్హుడు మరొకడు లేడేమో! కాళిదాసుని కవితా ప్రతిభ, రచనా చాతుర్యం, ఏదోఒక కాలానికి, దేశానికి మాత్రం పరిమితమై ఉండక నేటికీ ప్రపంచమంతటా మహత్తర గౌరవాన్ని పొందుతున్నదంటే, ఆ కవి అమరుడు కాడా? కాళిదాసుని కులమతాలు మనకు తెలియక పోవచ్చు. అతని జనన మరణాల వివరాలు మనకు అందకపోవచ్చు. అతని జీవిత విశేషాలపై చరిత్రకారులు వాద ప్రతివాదాలు జరుపుతూ వుండవచ్చు. కాని రసజ్ఞులైన పాఠకలోకానికి ఈ వివరాలతో పనిలేదు. భారతీయ సంస్కృతీ చరిత్రలోనేగాక విశ్వ సాహిత్యంలోనే ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్న మహాకవి కాళిదాసు.

ప్రపంచమంతటా ఈ యేడు కాళిదాసు జయంతి ఉత్సవాలను అత్యంత ఉత్సాహంగా జరుపుతున్నారు. ఆయనరచన లిదివరకే ప్రపంచంలోని ముఖ్యభాషలలోకి అనువదింపబడ్డాయి. ఒక్క శకుంతల నాటకానికే జర్మనీ భాషలో 18కి పైగా అనువాదా లున్నాయి. ఇంగ్లీష్, జర్మనీ, ఇటాలియన్, రష్యన్, డేనిష్, స్వీడిష్, డచ్, స్పానిష్, పోలిష్, హంగేరియన్, బొహెమియన్, ఐస్‌లాండిక్, చీనా భాషలలో శాకుంతల మిదివరకే అనువదింపబడింది. ఈ సంవత్సరం కాళిదాస నాటకానువాదాల సంపుటిని, మేఘసందేశఅనువాదాన్ని సోవియట్ యూనియన్ ప్రకటించనున్నది. చైనాలో కూడ సరికొ్త్త అనువాదాలు ప్రచురింప నున్నారు. మన దేశంలో వివిధ భాషలలో వెలువడిన అనువాదాల విషయం చెప్పనవసరంలేదు. ఇంతేకాదు. దేశ కాలాల ఎల్లలకు అతీతుడై శతాబ్దాల తరబడి తన కవితా యశశ్చంద్రికలు విరజిమ్ముతున్న మహాకవి కాళిదాస కవితా ప్రాగల్భ్యాన్ని పఠితల కందీయడానికి మేము చేసిన ఈ స్వల్ప ప్రయత్నాన్ని పాఠకలోకం ఆదరించుతుందని ఆశిస్తున్నాం.

## కాళిదాసు



చైనా చిత్రకారుడు టుంగ్-యూ-చీ గీసిన ఊహా చిత్రం

★

ఆంధ్ర - తెలంగాణలనే కృత్రిమ విభేదాలంతరించి విశాలాంధ్రావనియంతా ఏకమై

'ఆంధ్రప్రదేశ్'గా రూపొందుతున్న శుభ సమయం ఇది. ముక్కోటి తెలుగు బిడ్డల చిరకాల తపోవాంఛ, ప్రజలు గావించిన ఎన్నో త్యాగాల ఫలితంగా, ఎందరో అమర వీరుల ఆత్మార్పణఫలితంగా నెరవేరి తెలుగు జాతి చరిత్రలో ఒక సువర్ణఘట్టం ప్రారంభం కానున్నది.

ఆంధ్రప్రదేశ్ అవతరణతో, సాహితీ పరులకర్తవ్యం మరింత బాధ్యతాయుత మౌతుంది. నూతన రాష్ట్రాన్ని సౌష్ఠవఆర్థిక ప్రాతిపాదికపై సుఖసంపదలతో తులతూగే టట్లు నిర్మించాలని వాంఛిస్తున్నట్లే, తెలుగు భాషామతల్లి కీర్తిని ఇనుమడింప చేయ వలసిన విధి సాహితీ సంస్థల, కళాసంస్థల, సాహిత్య ప్రియు లందరిపైనా వుంది.

విశాలాంధ్రావనిలో సాహిత్యసేవచేస్తున్న సారస్వత సంస్థలెన్నో వున్నాయి. ఇవన్నీ కలిసి "అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు"గా ఏర్పడాలని ఇటీవల తెలంగాణా రచయితల సంఘం తీర్మానించింది. 'అఖిలాంధ్ర సాహిత్య పరిషన్నిర్మాణం'అవసరమనేభావం ఈనాటిది కాదు. 1949 నుండీ ఈమాట వినవొస్తూ వుంది. అయితే 1952 లో భారత ప్రభుత్వం అఖిలభారత జాతీయ పరిషత్తును నెలకొల్ప డంతో, దీనికి మరింత ప్రోద్బలం లభించింది. ఇటీవల ఆంధ్ర, హైద్రాబాద్ ముఖ్య మంత్రులు ఈ భావాన్ని బలపరచారు. ప్రభుత్వ సమాచార శాఖలోని ఒక ప్రముఖ ఉద్యోగి దీని నిర్మాణం విషయంలో శ్రద్ధ కన్పించుతున్నట్లు తెలుస్తూంది. ఇది కొంత అపోహాలకు దారితీసిన మాట నిజం. ఇంతే గాక అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు నిర్మా ణానికై ఇదివరకు జరిగిన ప్రయత్నాలలో సంకుచితతత్వాలు ప్రబలిన కారణంగా విఫల మయ్యాయి. అలంపురంలో ఏర్పడిన "ఆంధ్ర కళాపరిషత్తు" పని చేయలేక పోయింది. అందుచే ఇపుడు "ఆంధ్ర సాహిత్య పరిషత్" నిర్మాణాభిలాషులంతా గత చరిత్రలోని గుణ పాఠాలను గ్రహించాలి. ప్రభుత్వ సహకారం అవసరమే కాని, దాని జోక్యం పరోక్షంగా గాని, ప్రత్యక్షంగాగాని ఇందులో ఏమాత్రం పనికిరాదు. పరిషన్నిర్మాణం ప్రజాతంత్ర పద్ధతులపై జరగాలి. ఆయా సారస్వత సంఘాలు తమ వ్యక్తిత్వం నశింపజేసుకోన కుండానే అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తులో చేరి సమిష్టి సాహిత్య కృషిలో ముక్కోటి తెలుగు ప్రజల మధ్య సామరస్య, సహ కారాలను పెంపొందించాలి. ఆనాడే మన తెలుగు సాహిత్య పరిపూర్ణ వికాసానికి మార్గ మేర్పడుతుంది.

★

**అ**క్టోబర్ 8 వ తేదీ సుప్రసిద్ధ హిందీ, ఉర్దూరచయితప్రేమచంద్ ఇరవయ్యోవర్ధంతి. ప్రేమచంద్ అభ్యుదయ రచయితల సంఘ సంస్థాపకులలో ముఖ్యుడు. ప్రేమచంద్ రచనలు నేడు భారతదేశంలోని వివిధ భాషల లోకి అనువదింప బడటమేగాక, సోవియట్ మొదలుగాగల విదేశాలలో సైతం సాహిత్య ప్రియుల మన్ననలందుకొన్నాయి.

రెండు వందల కథలు, ఒకడజను నవలలు, రెండు నాటకాలు, అనేక వ్యాసాలురచించి, సాహిత్య విషయాలపై పలు ఉపన్యాసాలు ఇవ్వడంలోనే కాదు ప్రేమచంద్ ప్రతిభ వుంది. భారత జాతీయతను, సామాజికజీవిత వాస్తవికతను చక్కగా ప్రతిబింబించినవి ఆయన రచనలు. అభ్యుదయమార్గదర్శకుడై అమరుడైన ప్రేమచంద్ కిదే మా ప్రణా మాంజలి.

— తుమ్మల వెంకటరామయ్య.

# గురజాడ - శాకుంతలమ్

[శ్రీ గురజాడ అప్పారావుగారు తమ డైరీలో కాళిదాస రచనలను గురించి ప్రస్తావించిన భాగాలను "గురజాడ రచనలు 3 – మహాకవి డైరీలు" నుండి ఉల్లేఖించి ప్రకటిస్తున్నాం.]

**1895 ఏప్రియల్ 16, మంగళవారం :**

శ్రీనివాసాచారిగారితో కలిసి 'అభిజ్ఞాన శాకుంతలము' చదవడాని కుపక్రమించితిని. నాటకారంభమున తపస్వి కన్యల సంభాషణము అభ్యంతరకరము కాదా? కాళిదాసునకు అనాఘ్రాత పుష్పములవంటి కన్యల సౌందర్యమును వర్ణించుట ప్రీతి. 1 వల్కలములను ధరించిన శకుంతల, పుష్పాలంకృత పార్వతి వర్ణనములు.

2 వనజ్యోత్స్న; నవమాలిక! ఈ రంగము మహాసౌందర్యమైన కవితా రూపకల్పనతో అలరారుతున్నది! కథానాయకుడు మాటున దాగి ఇతరుల మాటలను వినడమనేది నాటకాలలో తరుచు కనిపిస్తూ వుంటుంది. ఇది సాధారణమైన కల్పనే.

3 "ఉపభోగక్షమ" అనే ప్రయోగము అర్థవంతమైనది. సాభిప్రాయము.

4 క్షత్ర పరిగ్రహ క్షమా; యదార్య మస్యా మభిలాషి మే మనః.

5 "తుమ్మెద నిన్ను బాధిస్తూవుంటే మేమేం చేయగలం? నిన్ను రక్షించడానికి మేమెవరిమి? ఈ తపోవనాలు రాజుచేత సంరక్షించబడుతున్నాయి. నిన్ను రక్షించడానికి దుష్యంతుణ్ణి పిలు."

ఎంత చక్కగా వుంది!

---

1 దుష్యంతుడు వల్కలధారిణి అగు శకుంతలను చూసి :

"నలినము శైవలంబునఁ బెనంగొని యుండియు రమ్యమే యగున్
మలిన కళంకముం గలిగి మంజులత న్వహియించుఁ జంద్రుడున్
చెలువున మించె నీ జలజనేత్రయు వల్కల ధారణంబునన్
తలఁపఁగ సుందరాంగులకుఁ దాను విభూషణ మేది గా దిలన్?"

(వీరేశలింగంగారి అనువాదం)

2 శకుంతల ఆశ్రమములో నున్న ఒక మాధవీలతకు 'వనజ్యోత్స్న' అని పేరుపెట్టుకొని తన తోబుట్టువువలె దానిని పెంచుతున్నది. గున్నమామిడిచెట్టునకు అల్లుకున్న 'వనజ్యోత్స్న'వలె శకుంతల తగినవరుని పొందునని ధ్వని.

3 'భోగార్హమైన'దని అర్థం. "'వనజ్యోత్స్న' అని నువ్వు పేరుపెట్టుకొని పిలుచుకొంటున్న ఈ వనమాలిక యిప్పుడు గున్నమామిడిచెట్టుకు స్వయంవర వధువు అయింది. శకుంతలా! దీన్ని చూశావా మరి" అని అనసూయ పిలిచి చెప్పగా, శకుంతల లతదగ్గరకు వెళ్ళి చూస్తూ అంటున్న మాటలు: "చెలియా! ఆహా! ఈ రమణీయకాలంలో ఈ లతాపాదపమిథునమునకు ఒకరినొకరు కలియడం తటస్థించింది! నవయౌవన ఈ వనజ్యోత్స్న! పల్లవరాగంతో అలరారుతూ భోగార్హమైనది ఈ క్రొమ్మావిగున్న."

4 శకుంతల సౌందర్యాన్ని చూసి ముగ్ధుడై దుష్యంతుడు "నా కోరిక దుర్లభమేమో! ఈమె కులపతి కణ్వునకు స్వజాతియైన భార్యయందు పుట్టినది కాకపోవచ్చునా? పుట్టి వుండకపోవచ్చును. సందేహించ నక్కరలేదు.

నృపపరిగ్రహయోగ్య యీ నెలఁత నిజము;
కాక, నా మది నిర్దోష మాపె నెట్లు
దవులు? నెందు సందేహవస్తువుల యందు
నాత్మగతులె ప్రమాణంబు లార్యులకును."

5 నవమాలికా కుసుమముమీద వ్రాలిన తుమ్మెద నీళ్ళుపోస్తున్న శకుంతల మోముమీద పడుతుంది. మోహం మీద వాలుతూ, చికాకుకల్గిస్తున్న భ్రమరపీడనుంచి తనను కాపాడవలసినదిగా శకుంతల తన చెలులను కోరుతుంది. అపుడు అనసూయ, ప్రియంవద లిద్దరూ పై విధంగా అంటారు.

6 రాజు అడిగిన ప్రశ్నకు శకుంతల ప్రత్యుత్తర మీయకపోవడం ఎంతో స్వాభావికముగానూ, సహజము గానూ వుంది.

ఈ కథలోని సంఘటనలు జరుగుతుండగా విశ్వామిత్రుడు యేమి చేస్తున్నట్టు? 7 "పురాకిల" అంటే యెన్ని సంవత్సరాలు? "దేవతల కీ పరతపోభయశీలత యెప్పుడూ వున్నదే" అనే రాజు మాటలు అనవసరం. ఇలా అనడంవలన ఆ పిల్లలకు తనమీద విశ్వాసం యేర్పడుతుందని దుష్యంతుడి ఉద్దేశం.

'వైఖానసం' దీనికి వివిధ విధములగు అర్థములు, అన్వయములు కలవు.

శకుంతల: 8 "అసంబద్ధ ప్రలాపినీ!"...ఎంత సొగసుగా వున్నది. వృక్షములకు కలశముతో నీరు పోయుటవలన శకుంతల అలసిపోయింది. 9 అలసిన శకుంతలావర్ణనం మనోహరం.

అనసూయా ప్రియంవదలకు చదువు వచ్చును. ప్రియంవద తెలివైన పిల్ల.

అబ్బో! "మేము మేము" అని ఏమి రాచఠీవి!

## 19 ఏప్రిల్, శుక్రవారం:

శాకుంతల నాటక పఠనము తిరిగి సాగించితిని.

విదూషకుడు తక్కువజాతి బ్రాహ్మణుడనుట స్పష్టం. మాటాడే భాష ప్రాకృతము. మాంసం భుజిస్తాడు. 10 'కిం మోదక ఖాదనే?'

"శరీర వ్యాయామమును కాళిదాసు కీర్తిస్తాడు. వేట దోషమే అయినా అది శరీరాని కొక వ్యాయామ మంటారు.

తపోవనాన్ని విడిచి తన సైనికులను దూరముగా వుండేటట్లు కట్టుదిట్టం చేయమని దుష్యంతుడు సేనాపతికి ఆజ్ఞ యివ్వడం; ఇది తపోజనులపై రాజునకుగల గౌరవం తెలుపుతుంది.

ద్వితీయాంక ప్రారంభంవలన, శకుంతల యెడల రాజునకు కలిగిన ప్రేమాతిశయంవల్ల అతనికి వేటయందు విముఖత కల్గిందని చెప్పడంతప్ప మరొక ప్రయోజనం కనిపించదు.

---

6 తుమ్మెదను తరిమివేసే నెపంతో దుష్యంతుడు చెట్లచాటునుంచి వారి మధ్యకు వస్తాడు. శకుంతలను ప్రశ్నిస్తాడు: "చక్కగా తపస్సు సాగుతున్నది కదా!" రాజు ప్రశ్నకు మౌనయై శకుంతల సిగ్గుతో తలవంచు కొంటుంది.

7 శకుంతలా వృత్తాంతాన్ని అనసూయ దుష్యంతునకు చెబుతూ ఇలా అంది: "ఆర్యులు వినవలెను, పూర్వము కౌశికుడనే రాజర్షి ఉగ్రతపస్సు చేస్తున్నపుడు, దేవతలు భయపడి, ఆ నియమమును విఘ్నంచేయాలని మేనక అనే అప్సరసను పంపారు."

8 ప్రియంవదపై కొంచెం కినుకవహించి శకుంతల రోషంతో "అనసూయా నేను వెళ్ళిపోతాను" అన్నది. అనసూయ "ఎందువలన" అని ప్రశ్నించింది. అపుడు శకుంతల: "ఈ అసంబద్ధ ప్రలాపాలను ప్రేలుతున్న ప్రియంవద కథ పూజ్యురాలయిన గౌతమితో చెప్పడానికి" అని జవాబిచ్చింది.

9 "కుండను బూన మూఁపు లవి క్రుంగెను, హస్తతలంబు నెఱ్ఱనై
యుండె, వడంకఁ జొచ్చెనుఁ గుచయుగ్మము, మిక్కిలి యగ్యె శ్వాసముల్
నిండెను మోమునందుఁ జెవి నిడ్డ శిరీషము వాడెఁ జెమ్మటల్
వెంద్రుకలుం గలంగె ముడివీడఁగ దా నొక చేతఁ జెర్వటన్."

10 దుష్యంతుడికి వేట అంటే విముఖత కలిగింది. శకుంతలమీదనే మనసు. విదూషకునితో "నా కింకా నీతో మాట్లాడవలసిన పనివుంది. ఒక అనాయాస కార్యంలో నీ తోడ్పాటు అవసరమ"ని దుష్యంతుడు అనగా, విదూషకుడు" "కుడుములు తినుటయందా?" అని ప్రశ్నిస్తాడు. విదూషకుడి కిది మామూలే. హాస్య మేమంత గొప్పగా చెప్పుకోతగింది కాదు.

11 " సఖే న పరిహార్యేవస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే"

ఈ మనోభావము వాస్తవిక విషయాలను నిజంగా తెలుపుతున్నదా ? అలాగున తెలుపకపోయినప్పటికీ, కాళిదాసు తన కాలంలో వున్న రాజులకీ ఆదర్శం వుండవలెనని అభిలషించడం అర్థమే. గతకాలపు రాజుల ఆదర్శాన్ని తన కాలపురాజులకు కాళిదాసు ఆపాదిస్తున్నాడు కాబోలును !

12 " వశినాం హి పరపరిగ్రహ సంశ్లేష పరాఙ్ముఖీ వృత్తిః"

13 "ఇంగుదీ తైల చిక్కణ శీర్షస్య". తెలుగున 'చిక్క' అనే శబ్దము "చిక్కణ" అనే సంస్కృత శబ్దమునుండి పుట్టినదా ? 'చిక్క' సంస్కృత భవమా ? గురువులు కాశ్యపులు ఆశ్రమంలో లేరు కనుకనే, బహుశా దుష్యంతుడు తనను వివాహం చేసుకోవలసినదిగా శకుంతలను అడిగివుంటాడు.

14 రాజు నీవారధాన్యములలో ఆరవవంతు భాగము యిమ్మని వొత్తిడి తేవచ్చును. రాజుకు పుష్కలంగా ధనం వస్తోంది. కోశాగారం నిండుగానే వుంది. దుష్యంతునిలో కొంత హాస్య చమత్కారము లున్నవి. "తపములో ఆరవవంతు."

15 "అహో దీప్తిమతోఽపి విశ్వసనీయతా వపుషః ।
అథవా ఉపపన్న మేత దృషిభ్యో నాతి భిన్నే రాజని."

ఇటువంటి గుణములుకల రాజులను కాళిదాసు శ్లాఘిస్తాడు. తనకు ఆశ్రయమిచ్చిన కవిపోషకుడైన యేలిక నుద్దేశించి కాళిదాసు యీ పొగడ్తలను బహుశా చేసి వుంటాడు.

---

11 దుష్యంతుణ్ణి విదూషకుడు, "మిత్రుడా! ఇపుడు తాపసకన్యనుసైతం కామిస్తున్నట్టు కనబడుతున్నావే" అని ప్రశ్నించగా, దుష్యంతుని సమాధానం : "సఖా ! పరిహార్యవస్తువుమీదికి పౌరవుల మనస్సు పోదు".

12 పంచమాంకంలో శకుంతలను దుష్యంతుడు తిరస్కరించుతాడు. తిరస్కృత శకుంతలను దుష్యంతునిచెంత వదలి గౌతమీ శార్ఙ్గరవుడు వెళ్ళిపోతున్నపుడు శకుంతల వారివెంట బయలుదేరుతుంది. తమతో వస్తున్న శకుంతలను శార్ఙ్గరవుడు "కులము చెడిన నీవు కణ్వునిచెంతకు రావలదు; పతియింట దాస్యమే నీకు మంచి"దని పరుషంగా మాట్లాడగా దుష్యంతుడు శకుంతలను దూషించవద్దని చెబుతూ:

" కుముదంబులకే శశియును
కమలంబులకే రవియు వికాస మొసంగున్
స్వమన మటు జితేంద్రియులకు
విముఖం బగుఁ బరవధువుల బిగికౌఁగిలికిన్."

అని అంటాడు.

13 శకుంతలను ఎవరు పరిణయమాడి అనుభవించగలరో కదా అని దుష్యంతుడు విదూషకునిచెంత వాపోవు చున్నపుడు, విదూషకుడు "యింగుదీ తైలంతో చిక్కనైన అరణ్యవాసి చేతిలో శకుంతల పడకముందే, నువ్వామెను చేతికి చిక్కించుకో"మని సలహా యిచ్చాడు. చిక్కణ అనగా చిక్కనైన అని అర్థం.

14 ఆశ్రమంలోని కొందరు తపసులు తనను గుర్తుపట్టారని, శకుంతలను చూడ్డానికి యే మిషమీద వెడితే బాగుంటుందని దుష్యంతుడు, విదూషకుణ్ణి ఆలోచన అడగగా "నీవారధాన్యములలో ఆరవభాగం, రాజువు కనుక నీకు రావలసింది కదా. ఆ మిషమీద వెళదాం" అని విదూషకుడు రాజుకు సలహా చెప్పాడు. ఇది విని దుష్యంతుడు "తాపసేంద్రు లిచ్చు తపముల యాఱవభాగ మక్షయముగ బరఁగు మాకు" అని చమత్కరించాడు.

15 ఆశ్రమారణ్యంలో వున్న దుష్యంతుణ్ణి ఆశ్రమాన్ని రక్షించడానికై కొన్నిరోజులపాటు వుండవలసిందిగా ఋషికుమారులు కోరతారు. అపుడు ఒక ఋషికుమారుడు దుష్యంతుణ్ణి చూసి ఆశ్చర్యంతో "ఆహా ! ఈయన మూర్తి తేజోవంతమయినా విశ్వసనీయంగా వుంది. ఋషులకునూ, యితనికినీ అట్టే భేదం లేదు. కనుక యిలాగ రాజనంద నుడు వుండడమనేది యుక్తంగానే వుంది" అంటాడు.

16 "కతిపయ రాత్రం సారథి ద్వితీయే నాయుధ సధ్రీచా
భవతా సనాథీ క్రియతా మాశ్రమ ఇతి" సరే; అందుకని, రాజు ఆశ్రమంలో కొన్ని రోజులు వున్నాడు.

17 "మొదట్లైతే కుతూహలం పైకుబికినమాట నిజమే కాని, ఇప్పుడీ రాక్షసుల కథ వినగానే ఒక్క పిసరంత మిగల్లేదు." హాస్య సంభాషణము!

18 రాజధానినుండి కరభకుడు రాణి ఆజ్ఞను దుష్యంతునికి తెలిపాడు.

"ఆగామిని చతుర్థే దివసే నిర్వృత్తపారణ ఉపవాసో మమ భవిష్యతి।
తస్మిన్ దివసే దీర్ఘాయుషాఽవశ్యం సన్నిహితేన భవితవ్య మితి."

19 "త్రిశంకు రివాంతరాళే తిష్ఠ" త్రిశంకుని కథ యెప్పుడు జరిగింది? శకుంతలా వృత్తాంతానికి పూర్వమా కాక తరువాతనా? ఇది ఎనక్రానిజమ్ కాదా?

ముందుకాలంలో ఎప్పుడో జరిగిన త్రిశంకువృత్తాంతాన్ని శకుంతలావృత్తాంతానికి పూర్వమే జరిగినట్టు ఇక్కడ కవి చెబుతున్నాడేమో?

20 "మా ఖలు మాం రక్షో భీరుకం గణయసి?"
"మహాబ్రాహ్మణ కథమేతద్భవతి సంభావ్యతే?" హాస్య సంభాషణము!

21 రెండో అంకంలో చివరి శ్లోకంవలన దుష్యంతుడు భయంతోనూ, గౌరవంతోనూ శకుంతలను చేపడుతున్నట్లు తెలుస్తున్నది.

---

16 పూజ్యులైన కణ్వమహర్షి దగ్గర లేరు కనక రాక్షసులు యజ్ఞాన్ని విఘ్నం చేస్తారు. "అందువల్ల కొన్ని రాత్రిళ్లు మీరు సారథి ద్వితీయులగై ఆయుధాలు చేతపూని, యీ ఆశ్రమాన్ని రక్షించవలసినది"గా ఆశ్రమవాసుల కోరికను రాజునకు ఋషికుమారులు తెలియజేస్తారు.

17 ఋషికుమారుల కబురు విని రాజు ఆశ్రమంవైపు వెడుతూ, విదూషకుణ్ణి "శకుంతల్ని చూడాలని కుతూహల పడుతున్నావా?" అని ప్రశ్నించాడు. అపుడు విదూషకుడు చమత్కారంగా అన్న మాట లివి.

18 ఇవ్వాళ్టికి నాలగవ దినంనాడు పారణ మానివేసి ఉపవాసం ఉండబోతున్నాను. కనుక దీర్ఘాయుష్మంతుడవగు నువ్వు దగ్గర వుండవలెను.

19 తన తల్లి పిలుపునందుకొన్న తర్వాత, రాజధానికి వెళ్ళవలెనా, లేక ఆశ్రమంలో యజ్ఞాన్ని రక్షించేందుకు వుండిపోవలెనా అనే మీమాంస దుష్యంతుణ్ణి ఎదుర్కొంది. "రెండూ దాటకూడని ఆజ్ఞలే. ఏమిటి చేయడమంటే" విదూషకుడు అన్న మాట లివి: "త్రిశంకునిలా అంతరాళంలో నిల్చిపో."

20 రాణి కబురు విని దుష్యంతుడు విదూషకుణ్ణి పుత్రకృత్యాన్ని నిర్వహించేటందుకు రాజధానికి వెళ్ళమని చెప్పాడు. నే నలాగే వెడతాను కాని "రాక్షసులకు భయపడిపోయి వెళ్ళిపోతున్నా ననుకుంటావు సుమీ!" అని విదూషకుడు అంటాడు. అపుడు "అబ్బో! నువ్వు మహాబ్రహ్మణుడివి. నీకు భయమనేది వుందని నే నెలా అనుకోగలను?" అని దుష్యంతుడు వేళాకోళం చేస్తాడు.

21 "కనఁగ మన మేడ! యజ్ఞాత కామ యగుచు
సరిగ మృగ శాబకములతోడఁ బెరిగి నట్టి
ముగుద యిది యేడ? పరిహాసమునకు నేను
బలుకు మాటలు నిజమని తలఁపవలదు."

తాను శకుంతలానురక్తుడ నైతినని విదూషకుడు అంతఃపురంలో ఒకవేళ చెబుతాడేమో అనే శంకతో దుష్యంతుడు విదూషకునితో పలికిన పలుకులు: "ఋషులమీద నాకున్న గౌరవంవల్ల ఆశ్రమానికి వెడుతున్నాను. కాని తాపసకన్య శకుంతలమీద నా కేమీ మనసులేదు సుమీ" అంటూ విదూషకునకు పై విధంగా తెలియజేశాడు.

# కాళిదాస మహాకవి

గుప్త సామ్రాజ్య మహోచ్ఛ్రదశలో సాహిత్యాకాశమందు దివ్యకాంతితో ప్రకాశించిన కాళిదాసు సంస్కృత వాఙ్మయమునంతటినీ వెలుగొందచేసిన ఉజ్వల తార. భారతదేశ కవులందరిలోనూ, నాటకకర్తలందరిలోనూ ఆయన అగ్రగణ్యుడని సర్వులు ఆమోదించినారు. అతని కృతులు సమస్త కాలాలలోను అశేష ప్రజాభిమానాన్ని, వున్నత ప్రతిష్ఠనూ ఆర్జించుకొన్నవి. కాని, చిత్రమేమిటంటే, ఆయన జీవిత కథ గురించిగాని, ఆయన బ్రతికియుండిన కాలాన్ని గురించిగాని, మనకు నికరంగా యేమీ యెక్కువ తెలియదు. ఆయన పేరుచుట్టూ యెన్నో కథలు గాథలు అల్లుకొని పోయినవి. కాని వాటికి వున్న చారిత్రక మూల్యం వీటినిబట్టి చూస్తే, కాళిదాసు మొదట శుంఠాగ్రేసరుడై వుండి, కాళీ వర ప్రభావం చేత మహాకవిగా రూపొంది, చివరకు సింహళ ద్వీపంలో ఒకానొక వేశ్యయింట పరమపదించినాడని విశ్వసించాలి. విక్రమాదిత్యుని ఆస్థానమందో, ధారానగరాధిపతియైన భోజుని ఆస్థానమందో విలసిల్లిన "నవరత్నాల"లో కాళిదాసు ఒకడట. అతని సమకాలికులని పేర్కొనబడిన కవు లనేకులు భిన్న యుగాలకు చెందినవారని దాదాపు నిశ్చయించి చెప్పవచ్చును. ఉజ్జయినీ నాథుడైన విక్రమాదిత్యునితో కాళిదాసు సంబంధం చారిత్రకంగా యథార్థమని అనేక చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. "విక్రమోర్వశీయ"మందలి నాయకుడు పురూరవుడై వుండగా, పురూరవుని పేరుకు మారు విక్రముని పేరును కాళిదాసు చేర్చినందుచేత, యీ విశ్వాసానికి బలం కలుగుతున్నది. ఈ విక్రమాదిత్యుడు క్రీస్తు పూర్వము 58 వ ఏట శకులను ఓడించి, విక్రమశకాన్ని ప్రారంభించిన వాడే అయివుండవచ్చునని కొద్దిమంది చరిత్రకారులు అంటున్నారు. కాని ఆధునికులు దీనిని శంకిస్తున్నారు. క్రీస్తు పూర్వము 58 వ సంవత్సర ప్రాంతమందు విక్రమాదిత్యుడనే రాజు ఒకడు వుండినాడని, కాళిదాసు అంతప్రాచీనుడని, వీరికి నమ్మికలేదు. అధిక సంఖ్యాకుల అభిప్రాయమేమిటంటే, విక్రమాదిత్యుడనే బిరుద నామంతాల్చిన గుప్తచక్రవర్తి రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో కాళిదాసు వుండినాడని, శకక్షాత్రపులను నిర్జించి చంద్రగుప్త సార్వభౌముడు "శకారి" బిరుదము తాల్చినాడని. కాళిదాసు జీవితకాలం గురించి నిస్సందేహంగా సేకరింపబడిన భోగట్టానుబట్టి చూస్తే, అగ్నిమిత్రుని తర్వాతనే (దాదాపు క్రీస్తుపూర్వం 150 వ సంవత్సం) కాళిదాసు నివసించి వుంటాడు. ఎందుకంటే "మాళవికాగ్నిమిత్ర" నాటకమందు అగ్నిమిత్రుడే నాయకుడు. అంతేకాదు. క్రీస్తుశకం 634 వ సంవత్సరానికి ముందే కాళిదాసు జీవించి వుంటాడు. ఎందుచేతనంటే ఆ సంవత్సరమే లిఖించబడిన ఐహోలు శాసనమందు కాళిదాసు మహాకవి అని పేర్కొన బడినాడు. క్రీస్తుశకం 473 సంవత్సరానికి చెందిన మందసూర్ శాసన మందలి శ్లోకాలలో కాళిదాసు రచనల ప్రభావం వున్నట్లుగా వున్నదనే సమర్థులైన పండితుల వాదాన్ని అంగీకరించి

నట్లయితే, అతని కాలాన్ని 450 వ సంవత్సరానికి చేరువుగా తీసికొని రావచ్చు. గుప్త సామ్రాజ్య యుగమందు కాళిదాసు నివసించి వుంటాడనేందుకు, అశ్వఘోషుని రచనల నుండి, వాత్స్యాయనుని "కామ సూత్రాల" నుండి ఆయన కొంత గ్రహించి నాడనేది, వాకాటక వంశస్థుడైన రెండవ ప్రవరసేనుడు వ్రాసిన "సేతుబంధ" కావ్యాన్ని ఆయన సరిదిద్దినాడనేది, గుప్త సామ్రాట్టుల నామధేయాలను ఆయన పరోక్షంగా గుప్తంగా పేర్కొన్నాడనేది, హూణుల దండయాత్ర గురించి ఆయన ఎరుగుననేది, కారణాలై వున్నవి. కాబట్టి క్రీస్తుశకం నాల్గవ శతాబ్ది చివరిభాగమందు కాళిదాసు వుండివుండవచ్చును.

ఆయన రచనలను సూక్ష్మంగా పరిశీలించి నట్లయితే, కాళిదాసు ఉజ్జయినీ పురమందలి సద్బ్రాహ్మణుడని, విశాల హృదయుడైన శైవుడని, బ్రాహ్మణ విజ్ఞాన శాఖలలో అఖండ పాండిత్యం సంపాదించినాడని, భారతదేశమందు ఎంతో తిరిగి అశేషానుభవాన్ని ఆర్జించినాడని తెలుస్తుంది. వైదిక వాఙ్మయ సమస్తంతోటి కాళిదాసుకు పరిచయం కలదు. షడ్దర్శనాలను ఆయన యెరిగి వున్నప్పటికి, సాంఖ్య, యోగదర్శనాల పారమెరిగినాడు. ధర్మశాస్త్ర వాఙ్మయము, కామ సూత్రములు, నాట్యశాస్త్రము, వ్యాకరణము, జ్యోతిశ్శాస్త్రమేకాక, సంగీత, చిత్రలేఖనాది లలిత కళలుకూడ అతనికి లోబడినవి. బహుముఖ ప్రతిభ, రాజాస్థాన ఆచార పరిచితి, కుశాగ్రబుద్ధి, వినయ సంపన్నత, ఆత్మగౌరవ పరత, కావ్యరచనాశక్తి-యివి అతని కావ్యాలలో ఎల్లెడల ప్రతిఫలిస్తూ వున్నవి.

## శాకుంతలము

కాళిదాసు కృతులన్నింటిలో పేరెన్నిక గన్నది "శాకుంతల" నాటకము. సంస్కృత సాహిత్యమేకాక, దీనివలన విశ్వ సాహిత్యమే సంపన్నమైనది. మహాభారతమందలి శకుంతలోపాఖ్యానాన్ని మూలంగా చేసికొని, కాళిదాసు దానినిఅపూర్వ శోభావిలసితం చేసినాడు. స్వల్పమై, పటుతరమైన మార్పులను చేయడమేకాక, క్రొత్తపాత్రలను, గొప్పనాటకీయశక్తిగలసన్నివేశాలను చేర్చినాడు. మహాభారత కథలో కణ్వమహర్షి పుష్పసేకరణకై ఆశ్రమం విడిచి పోయినప్పుడు దుష్యంతుడు ప్రవేశిస్తాడు. కాని యీ నాటకమందు మంచి కారణాన్ని పురస్కరించుకొని కణ్వుడు ఆశ్రమానికి చాలదూరం పోయివుంటాడు. అంటే, ఆయన త్వరలో ఆశ్రమానికిరాడు. అదే విధంగా, మూలకథలో శకుంతుల తానే దుష్యంతునికి స్వీయచరిత్ర చెప్పి, అతని ప్రణయానికి ఆమోదం తెలిపేముందు రాయబారాలు సాగించినట్లు చిత్రింపబడింది. ఈ అనౌచిత్యాన్ని తొలగించి కాళిదాసు, శకుంతల చెలికత్తె అయిన అనసూయచేత తననెచ్చెలి కథను ఔచితి తప్పకుండా చెప్పించి, అసలు రాయబారాల ప్రసక్తినేయెత్తలేదు. దూర్వాసమహర్షి శాప ప్రభావంచేత పోయిన అంగుళీయకం, జాలరివారి సన్నివేశం యివి కాళిదాసు కల్పనలు. నాటకాంత్య భాగంలో ప్రేక్షకులు ఎటూ తోచని పరిస్థితికిలోనై, చివరకు దానినుంచి బయట పడిపోతారు. మూలకథలో నాయికానాయకులు నానావిధాలైన అసహజ పరిస్థితులకు లోనై సతమతమవుతారు. కాని నాటకంలో వారికి సహజ గుణాలు

ఆపాదింపబడినవి. దుష్యంతునిలో ఆదర్శ ప్రభుమూర్తిని కాళిదాసు ప్రసాదించినాడు. శకుంతలలో భారతీయ కన్య బ్రతుకులోగల త్రివిధావస్థలను ఎంతో నేర్పుతో చిత్రించినాడు. ప్రకృతితో కథను అల్లినాడు. భావ ప్రకటన విషయంలోను, మనఃప్రవృత్తుల చిత్రణలోను, పాత్రనిర్మాణమందు, సన్నివేశ కల్పనలందు, కథ అల్లికలోను, కవితా పాటవమందు యీ నాటకం కాళిదాసు కృతులలో ప్రథమస్థాన గౌరవం పొందింది.

## "మాళవికాగ్నిమిత్ర" నాటకం

"శాకుంతల" రచనకు మునుపే కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర" నాటకాన్ని, "విక్రమోర్వశీయ" నాటకాన్ని రచించాడు. అగ్నిమిత్రుడనే రాజు తన రాణీగారి చెలికత్తెను ప్రేమించి, రాణి పెట్టే అడ్డుల నన్నిటిని అధిగమించి, విదూషకుని సహాయాన తన పనిని సఫలం చేసికొంటాడు. ఇదికాళిదాసు ప్రథమ కృతి అయివుండవచ్చు. నాందీ ప్రస్తావనలో నవకావ్య సమర్థనకు కాళిదాసు పూనుకొనినందుచేత యీ విధంగా నిర్ధారణ చేయవచ్చు. ఎన్నోలోపాలున్నప్పటికీ, కాళిదాసు ప్రతిభ స్పష్టంగా యిక్కడ ముద్రపడినట్లు వెల్లడి అవుతుంది.

## "విక్రమోర్వశీయ"నాటకం

ఊర్వశి నాకలోకపు అప్సరస. విక్రముడు మర్త్యుడు. వీరి ప్రణయగాథ యిందు వర్ణింపబడింది. మదాం. ద విల్మన్ గ్రెబొవస్కా, విక్రమోర్వశీయం కాళిదాసు చివరికృతి అని వాదిస్తుంది. ఎందుకంటే అప్పుడే మొదలైన శైథిల్యం యీ నాటకంలో ప్రస్ఫుటమవుతున్నదట. కుమారగుప్తుని యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవ సందర్భాన కాళిదాసు దీనిని వ్రాసివుంటాడని మరికొందరంటున్నారు. ఋగ్వేదములోనూ, శతపథ బ్రాహ్మణంలోనూ, విష్ణు, భాగవత పురాణములలోనూ బృహత్కథలోనూ వర్ణింపబడిన కథాంశాల నన్నిటినీ కలిపి కాళిదాసు తాను కొన్ని సన్నివేశాలను, సంఘటనలను, దృశ్యాలను కల్పించినాడు. ఈ నాటకంలో ఆయన కథానిర్మాణం గురించి చూపిన శ్రద్ధ తక్కువ. పాత్ర చిత్రణమీదనే దృష్టిని కేంద్రీకరించినాడనిపిస్తుంది. ఈ నాటకంలో ఎక్కువ వాద ప్రతివాదాలకు దారితీసిన భాగం చతుర్థాంకం. ఇక్కడ నాయకుడు ప్రియా వియోగ క్లేశంచేత వికలచిత్తుడై తన బాధను చిన్ని చిన్ని తీయదీయని విషాదపూరిత గీతాలలో వెల్లడి చేస్తాడు. ఇది కొందరి దృష్టిలో లోపమయినప్పటికీ, యీ లోపమే యిప్పుడు కాళిదాసు ప్రతిభకు తార్కాణంగా యెంచబడుతూ, అతని ఖ్యాతినీ ప్రజాభిమానాన్నీ యినుమడింపచేసింది.

## "రఘువంశ" కావ్యం

రఘువంశ కావ్యంలో కాళిదాసు నిర్వహించిన కార్యం చాల ప్రయాసాపూరితమైనది. ఎందరో రాజుల జీవితాలను వర్ణించడం సులువుకాదు. ఏవ్యక్తికి ఆవ్యక్తి ప్రత్యేకనైలక్షణ్యాలతో విడిగా ఒప్పారేటట్లు, వర్ణించినదే వర్ణించడంచేత వినుగు వేసటలు పుట్టనట్లు, కాళిదాసు యీ మహాకావ్యాన్ని తీర్చిదిద్దినాడు. అందుచేతనే కాళిదాసును "రఘుకారుడు" అనడం జరిగింది. ఈ కావ్యంకూడ అసమగ్రమే. భోగలాలసుడైన అగ్నివర్ణుని చరిత్రతో యిది ఆగిపోతుంది. బహుశా పందొమ్మిదవ సర్గ

వరకు వ్రాసి, జబ్బుచేతనో, మృతికారణం గానో కాళిదాసు దీనిని పూర్తిచేయలేక వుంటాడు. అజవిలాప ఘట్టంవంటి-చోట్ల కాళిదాసు కవితాశక్తి విజృంభించింది.

### "కుమార సంభవ" కావ్యం

కాళిదాసు మహాకావ్య నిర్మాతకూడ. "కుమార సంభవము" శివ పార్వతుల నందనుడైన కుమారస్వామి జననాన్ని వర్ణిస్తుంది. మల్లినాథునివంటి వ్యాఖ్యాతలు యీ కావ్యమందు తొలి ఎనిమిది సర్గలకే వ్యాఖ్యానం వ్రాశారు. ఎనిమిదవ సర్గలోని వర్ణనలకు కినిసి పార్వతీదేవి శపించినందుచేత, సమగ్ర వ్యాఖ్యానం జరుగలేదని ఒక వ్యాఖ్యాత వ్రాశాడు. చివరి సర్గలు కావ్య శక్తిలో మొదటివానికి తీసికట్టు. కనుక యివి కాళిదాసు కృతాలు కావని ఒక వాదం. "రతీ విలాపము" వంటి ఘట్టాలలో, జటిలుని వేషధారియైన శివునికీ పార్వతికీ నడుమ నడచిన సంభాషణవంటి-చోట్ల హిమాలయ వర్ణనలో, వసంత ప్రాదుర్భావ చిత్రణలో కాళిదాసు కవిత శిఖరాలను స్పృశించింది. కాని ఆనందవర్ధనాచార్యులవంటి ఉద్దండ పండితులు, ఆలంకారికులు కాళిదాసు అష్టమ సర్గలో శృంగారం మోతాదును మించి వర్ణించినాడని విమర్శించారు.

### "ఋతుసంహారము"

కాళిదాసు అల్పకృతులలో పేరెన్నిక గన్నది. ఋతుసంహారము. ఇతివృత్తం సామాన్యం అయినందుచేత, పాత్రల ఆవశ్యకత లేనందుచేత, యిది వ్యాఖ్యాతల ఆసక్తిని రేకెత్తించలేదు. కాని కాళిదాసు సూక్ష్మపరిశీలనాశక్తికి, ప్రకృతి పూజకు యిది గొప్ప నిదర్శనమై నిలిచివున్నది.

### "మేఘదూత"

సంస్కృతభాషలో వ్రాయబడిన అల్ప ప్రమాణంకల కావ్యాలన్నిటిలో పరమ సుందరమైనది "మేఘదూత". వంద పైచిలుకు శ్లోకాలతో కాళిదాసు తన యావత్ శక్తిని ప్రతిభా వ్యుత్పత్తులను కుదించగలిగినాడు. ప్రభువు కినుక కారణంగా ప్రియావియోగం పొందిన యక్షుడు, మేఘదర్శనంతో ఘోర బాధావిదారిత చిత్తుడై తానున్న రామగిరి నుండి తన ప్రియురాలున్న అలకాపురికి ప్రణయసందేశాన్ని కొనిపొమ్మని వేడుకొంటాడు. ఏ దారి బట్టి పోతే అలకాపురి పోవీలవుతుందో, ఏ యే సుందర స్థలాలు దాటి పోవలెనో వివరిస్తాడు. కవి మందాక్రాంత వృత్తాన్ని స్వీకరించి, ఒక్కొక వృత్తంలో ఒక్కొక సంపూర్ణ భావచిత్రాన్ని యిమిడ్చినాడు. కొందరు మేఘదూతను ప్రణయ కావ్యమంటే, మరి కొందరు విలాప కావ్య మన్నారు. స్థిరదేవుడు యిది మహాకావ్యమని, వల్లభుడు ఖండ కావ్యమని అన్నారు. యక్షుడు ప్రవాసజీవితం గడిపిన రామగిరి నేటి నాగపుర సమీప మందలి రామ్‌తెక్ అని నిర్ధారింప బడింది. ఆషాఢ-కృష్ణైకాదశి, యోగినీ మహాత్మ్యకథ యీ మేఘదూత కావ్యానికి మూలమట. అభిప్రాయ వ్యక్తీకరణలో క్లుప్తతకు, ఇతివృత్త సంపన్నతకు, మానసాన్ని ప్రచలింప జేయగల రచనాశక్తికి, "మేఘదూత"కు సాటిగాని, పోటిగానిలేదని విమర్శకులు సెలవిచ్చారు. వైవిధ్యానికి, భావనాశక్తికి, ఉత్సాహపరతకు "కుమార సంభవ" కావ్యం సవ్యులకు మాన్యమైనది. ఆలంకారికుల నిర్వచనాలకు అనుగుణమైన మొదటి భారతీయ మహా

కావ్యం "రఘువంశం". ఇక "శాకుంతల" నాటకం భారతీయులకే కాక, యూరోపు దేశీయులకుగూడ శిరోధార్యమయింది. జర్మనీ దేశపు మహాకవి, గెటే,

"Wouldst thou the young year's
blossoms and the fruits of its decline,
And all by which the soul is
charmed, enraptured, feasted, fed,
Wouldst thou the earth and heaven
itself in one sole name combine?
I name thee, O Shakuntala,
and all at once is said"

అని పొగడినాడు. భూస్వర్గాలను, వసంత శిశిరాలను "శకుంతల" నాటకం ఒక్క కౌగిలిలో పొదివి పట్టుకొన్నదట.

వ్యాస, వాల్మీకి, కాళిదాసులు ఆర్య సంస్కృతీ గతిలో మూడు విభిన్న యుగాలకే కాక, మానవ ప్రకృతిలో మూడు విభిన్న లక్షణాలకు ప్రతినిధులని శ్రీ అరవింద ఘోష్ సెలవిచ్చారు. భారతీయులు నైతిక విషయాలకు పరమ ప్రాముఖ్య మిచ్చిన తొలియుగాల సంస్కృతి వాల్మీకి రామాయణంలోను, భారతీయ మేధశ్శక్తి, అప్రతిహతమైన యుగసంస్కృతి వ్యాసభారతంలోను, బౌద్ధమత పతనానంతరం భారతీయ హైందవ సంస్కృతి పునర్విజృంభింప సాగినప్పుడు చిటిపొటి రాజ్యాల పునాదులమీద మహాసామ్రాజ్య నిర్మాణం జరిగిన స్వర్ణ యుగంలో, లౌకిక విషయాలకు ప్రాశస్త్యం యినుమడించినప్పటి సంస్కృతి కాళిదాసు రచనలలో కనిపిస్తున్నదనికూడ వ్రాశారు. పురాణాలు, నీతిశాస్త్రాలు ఒకటేమి, అన్ని విజ్ఞానశాఖలు స్మృతిరూపంలో సంపుటీకరింపబడుతున్న రోజులు. ఒకవైపు పండితులు, శాసనకర్తలు, తార్కికులు, సూత్రకారులు, మరొకవైపు జాతిలో నిద్రాణమైయుండిన సృజనాశక్తిని ఆనకట్టలు బద్దలుకొట్టి విడిపించిన కవులు, చిత్రకారులు, శిల్పులు, గాయకులు, నర్తకులు. ఈ సౌందర్యార్చనలో భారతీయులు నాస్తికులు కాలేదు, ఐహిక భోగలంపటులు కాలేదు. చార్వాక మత ఖండన సాగుతూనే వున్నది. కాని మానసిక లోకంనుండి భారతీయసృజనాత్మకశక్తి బహిర లోకంలో కాలుపెట్టింది. ఉపనిషత్తుల నుండి పురాణాలకు, తొలివేదాంతసాంఖ్య శిఖరాల నుండి తపశ్చర్యలకు, శుష్క తాత్త్విక తార్కిక భావ ప్రకటనకు లేదా హృదయానికి ఎక్కువ సంబంధించిన నూతన మత ధోరణులకు భారతీయ శిష్ట జనత ప్రయాణించింది. అప్పుడు పుట్టినాడు మహాకవి కాళిదాసు. సమకాలిక సంస్కృతీ జీవిత ధోరణులను అన్నిటినీ పొదివి పట్టుకొన్నాడు. ఆగామి సంస్కృతీ జీవిత ధోరణులను లీలగా తోపింప జేసినాడు. గడచిపోయిన రోజుల నిగ్గును వర్తమాన యుగానుకూలంగా యెత్తి పట్టి ప్రదర్శించడంలో కాళిదాస మహాకవికి షేక్స్పియర్ సాటి వస్తాడు. తాను వేదాంతి, శైవుడు, కాని మతవిషయాలలో పట్టింపు లేదు. సౌందర్యార్చన అతని పరమలక్ష్యం. ఆత్మకెంత ప్రాముఖ్యమో, ఇంద్రియాలకుకూడ అంతే. ఏదేనొక వస్తువును పొదివి పట్టుకొని, అది కన్నులకు కట్టేటట్లు చేయడంలో ఆయన అసమానుడు. వర్ణ సౌందర్యమూ, రూప సౌందర్యమూ, శబ్దప్రభుత, భాషా సార్వభౌమత్వము, క్లుప్తత, పద్యసమ్మేళనము మలచిన స్ఫటిక శిలవలె ప్రకాశించే గద్యరచన, పదౌచితి — యివి కాళిదాసు కవితాశక్తికి దోహదకారులైనవి.

[దేవప్లలి, మజుందార్ లు వ్రాసిన "The Classical Age" నుండి, అరవిందఘోష్ వ్రాసి "Kalidasa" నుండి యీ వ్యాస విషయాలు రింప బడినవి.]

# కాళిదాస భవభూతులు

శ్రీ ద్విజేంద్రలాల్ రాయ్

## కథాభాగము :

అభిజ్ఞాన శాకుంతలము కాళిదాస కృతమగు గొప్ప నాటకము. "కాళిదాసస్య సర్వస్వ మభిజ్ఞాన శాకుంతలమ్". ఉత్తర రామచరిత్రము గూడ భవభూతికృతమగు గొప్ప నాటకముగా భావింపబడుచున్నది. ఈ రెండు నాటకములను విమర్శించుటచే నా మహాకవుల తారతమ్యము తెల్లము కాగలదు.

కాళిదాసు శాకుంతల నాటకమందలి కథాభాగమును మహాభారతములోని శకుంతలోపాఖ్యానము నుండి గ్రహించెను. పద్మపురాణము స్వర్గఖండములో గూడ శకుంతలోపాఖ్యానము వర్ణింపబడియున్నది. ఆ యుపాఖ్యానమునే యభిజ్ఞాన శాకుంతల మెక్కువ పోలియున్నది. కాని పద్మపురాణ మభిజ్ఞాన శాకుంతలమునకు వెనుక వ్రాయబడినదనియు, కాళిదాసుని శకుంతలోపాఖ్యానమే యందు కావ్య రూపమున చిత్రింపబడినదనియు పలువురి యభిప్రాయము.

కాళిదాసుని నాటకములోని నాయకుడగు రాజు మూలకథలో లంపటుడును, బహుపత్నీకుడును, మధుమత్త భ్రమరమువలె నొక పుష్పమునుండి మరియొక పుష్పమునకు తిరుగువానివలె నుండును. కాని కాళిదాసు దుష్యంతుని ధార్మికశ్రేష్ఠునిగను కర్తవ్య పరాయణునిగను దీర్ప బ్రయాసపడినాడు. కనుకనే కాళిదాసు గాంధర్వ వివాహము, నభిజ్ఞాన మునిశాపముల గల్పించి రెండుమారు లతని గళంకమునుండి కాపాడెను. ఈ నాటకములోని దుష్యంతుని చరిత్రమును మానసిక సూక్ష్మదర్శినిచే గాంచినచో నతడు కేవలమొక రసిక పురుషుడుగ గనుపట్టును. కాని కామాంధుడై యతడు వివేకచ్యుతుడు కాలేదు. అతడు లోలుపదృష్టిచే శకుంతలను జూచినమాట నిజము. అతడా తాపసి బాలికను జూచినతోడనే తన కుపభోగ్య వస్తువుగా నాలోచించినమాటయు నిజము. కాని హృదయమున నతడు శకుంతలను పెండ్లియాడనే యెంచును. కామోపాసకు గు కవులు కొందరు వివాహము నొక 'తుచ్ఛవస్తువుగ దురు. కాని వివాహము స్త్రీ కేవలము భోగ్య కాదనియు, ఆమె సమ్మానయోగ్యయనియు దెలుపును! వివాహ సంస్కారము గృహమునకు సుఖదాయకమును, సంతతికి క్షేమకారియు, సమాజమునకు మంగళమూలము నగు నుపాయము. దానిపై కేవలము వ్యక్తిగత శాంతియేకాక, సమస్త సాంఘికశాంతి కూడ ఆధారపడియున్నది. నింద్యమగు కామమును వివాహమే సుందరముగ నొనర్చుచున్నది. మునిశాపమువలనకూడ కాళిదాసు దుష్యంతుని కాపాడినాడు. భవభూతియు నొకమారిటులనే తన నేర్పుచే రాముని గాపాడినాడు. వాల్మీకియొక్క రాముడు నిజవంశ మర్యాదారక్షణార్థమై పతిప్రాణయగు సీతను మిషచే నడవి కంపెను. "ప్రజారంజనముకొరకై స్నేహము, దయ, సౌఖ్యము, తుదకు సీతనుకూడ విడువవలసివచ్చినను నాకు దుఃఖము లేదు" అని భవభూతి అష్టావక్రుని యెదుట రామునిచే ప్రతిజ్ఞ చేయించెను. ఇటులనే భవభూతి వీలగునంతవరకు రాముని చరిత్రమును దోషరహితము గావించెను.

ఈ కవు లిద్దరు నిట్లు తారుమారు సేయుటకు విశేష కారణ మొకటి కలదు. ఎంత గొప్పకవియు అలంకార శాస్త్రము నతిక్రమింపజాలడు. నాటకములోని నాయకుని సర్వగుణ సంపన్నునిగను, దోషరహితునిగను జేయవలయునని అలంకార శాస్త్రమున నొక నియమము కలదు. కొందరీ నియమము కఠినమనియు, దీనిచే నాటకకారుని స్వాతంత్ర్యము నష్టమగుననియు చెప్పుదురు. దుష్యంతుడు శకుంతలా ప్రత్యాఖ్యాన మొనరించుటలో అతని దోషములేదని కవి చూపించెను. దానికి కారణము భ్రాంతి. ఆ భ్రాంతియు దైవికము. కాని రాముడు సీతను ప్రమాదముచేగాక బుద్ధిపూర్వకముగ పరిత్యజించెను. భవభూతి రాముడు ప్రజారంజనము చేయబోయి మహత్తరమగు కర్తవ్యమునుండి స్ఖలితుడయినాడు. ఆ కర్తవ్యము న్యాయవిచారము. అతడు జాగ్రదవస్థలో పట్టపగలు నిరపరాధయు, విశ్వాసినియునగు సీతకు వనవాస మొసగెను. కనుకనే యతడామెను బొందుటకు యోగ్యుడుకాడు. వాల్మీకి యొనరించినది చాల ఉచితము. కాని భవభూతి తన నాటకమున యీ సంయోగ మొనరించి కావ్యకళను, కావ్యన్యాయమును గూడ రూపుమాపినాడు.

## చరిత్ర చిత్రణము :

మహాభారతములోని దుష్యంతుడొక భీరుడు, లంపటుడు, మిథ్యావాదియునగు రాజని చెప్పబడినది. అతని రాజకీయ గుణములందేమియు విశేషములేదు. అతడొక సామాన్యపురాజు. కాళిదాసు తన ఈ నాటకమందు దుష్యంతుని దోషములనుండి చాల గాపాడినను అతని నొక నిర్దోష చరిత్రునిగ జేయలేక పోయెను. అతడు విలాస మగ్నుడై రేబవళ్ళు అంతఃపురమున నుండడనియు, కష్టమున కోర్వగలడనియు కాళిదాసు తెలిపినాడు. కాని ఈ దోషహీనత్వము గుణముకాదు. మృగయాశ్రమ సహిష్ణుతచే నతడే మహాకార్యమును సాధింపలేదు. వేటాడునో – పులులను, భల్లూకములను గాదు; పారిపోవు లేళ్ళను. కాళిదాసుని దుష్యంతునికి రాక్షసబాధా నివారణార్థము కణ్వాశ్రమమున నుండుట కాహ్వానము వచ్చుట నిజము. కాని యతడు మాత్ర మందులకే యచట నుండనియ్యకొనెననుట నిజముకాదు. అటుపిమ్మట రాజు మధ్య మధ్య, "ఓ తాపసులారా! భయపడకుడు, భయపడకుడు, ఇదిగో వచ్చితిని" అని హుంకరించినను, ఆ శౌర్యము శరత్కాలమేఘమువలె కేవలము గర్జించును. సప్తమాంకములో మాత్రము అతడు రాక్షస సంహారమొనర్చి స్వర్గమునుండి తిరిగివచ్చుచున్నటుల గాంచెదము. దేవేంద్రుడు డా రాక్షసులను వధింపజాలక పోడు. కాని దేవేంద్రుని పరాక్రమము సూర్యుని వంటిది. దుష్యంతుని పరాక్రమము చంద్రుని వంటిది. కనుకనే మాతలి, "రాత్రి చీకటిని సూర్యుడు పోగొట్ట జాలడు. దానిని చంద్రుడు పోగొట్టును" అనెను. ఇది దుష్యంతుని కంతగా గౌరవావహముకాదని తోచుచున్నది. దుష్యంతునికి ధర్మశాస్త్రమందును, బ్రాహ్మణ వాక్యమునందును విశ్వాసము మెండు. కాని మహర్షి యాశ్రమమున కతిథియై వచ్చి గుప్తరూపమున శకుంతలను బెండ్లియాడి ఋషుల గురించి విశ్వాసఘాతమొనర్చెను. కాళిదాసుని దుష్యంతుని చరిత్రములో ధర్మభీరుత్వ మతని ప్రధాన గుణముగా గాంచెదము. కాని దీనిచే నతని చరిత్ర మహత్త్వమేమియు నతిశయింప జాలదు. కాళిదాసు తన దుష్యంతుని నొక యుత్తమ చిత్రకారునిగ, సంగీత రసాభిజ్ఞునిగ, రాజ కార్య దీక్షాపరునిగ చిత్రించెను. కాళిదాసు దుష్యంతుని చరిత్రము నొక యాదర్శ చరిత్రమునుగా జేయ బూనుకొనలేదు. ఈ నాటకమున మొదటి మూడంకములు గలిసిన ప్రథమ భాగములో ప్రేమచిత్రము దుష్యంతుని పతనమును, నాలుగైదు అంకములుగల ద్వితీయ భాగములో వియోగవర్ణనము అతని ఉత్థాన ప్రయత్నమును, మిగిలిన రెండంకములు గల తృతీయ భాగములో సంయోగ వర్ణనము దుష్యంతుని ఉత్థానము చూపింపబడినవి. దుష్యంతుని చరిత్ర మహత్త్వ మా యుత్థానపతనములందే యున్నది. కణ్వాశ్రమమున శకుంతలను జూచి అధఃపతితుడై ఆమెను తన కుపభోగ్యముగా నెంచి, వివాహమై, రాజధానికిబోయి శకుంతలను మరచుట అతని పతనముయొక్క పరమావధి. శకుంతల సభకు వచ్చిన పిమ్మట, తా నామెను పెండ్లియాడెనా యని యాలోచించి, "ప్రభాతమున తుషారగర్భితమగు కుంద పుష్పమును భ్రమరమువోలె నే నీమెను భోగించుటకును, విడుచుటకును జాలకున్నాను" అని విచారించికూడ ధర్మమార్గమునుండి చలింపకుండుట దుష్యంతుని మానుషత్వమును చాటుచున్నది. షష్ఠాంకమున శకుంతల పరిణయ వృత్తాంతము జ్ఞప్తికిరాగా, చింతపడి, వసంతోత్సవము జరుపక, శృంగార విధులను త్యజించి, శకుంతలా చిత్రపటమునుజూచి విహ్వలుడై కన్నీరు గార్చు దుష్యంతునిలో మానుషత్వము మూర్తీభవించినది. శకుంతలను తిరిగి చూచినప్పుడు, మొదట నీరసముగ మాటాడజొచ్చినను, చివరి కామె కాళ్ళమీద బడి పశ్చాత్తాపము వెలిబుచ్చెను. దుష్యంతుని చరిత్రము మిక్కిలి మిశ్రచరిత్రము. అందు గుణదోషముల మనోహర సమావేశము కలదు.

శకుంతలది కోమలహృదయము. మనుష్యునిపై మనుష్యుని కట్టు ప్రేమయో, శకుంతలకు వృక్షలతాదులపై నట్టే ప్రేమ. కాని శకుంతల తాపసియయ్యును ఆడుది. ఆమె రాజప్రేమయందు ముగ్ధురాలయ్యెను. టక్కులాడితనము నేర్చినది. రాబోవు సవతుల గురించి అపుడే యీర్ష్యాభావము కలిగినది. శకుంతల ముఖ చుంబనమున కడ్డువెట్టెను. కాని యది యూరక నామమాత్రమునకు. కొందరు తృతీయాంకమందలి యంతిమభాగము కాళిదాసు రచించలేదందురు. ఇది యొప్పుకొన్నను ఈ అంకముయొక్క ప్రథమ భాగమును నిర్దోషముగనే మొప్పుకొన జాలము. శకుంతల ఆత్మవిక్రయమునకు దలపడినది. మన దేశములో కాళిదాసుని కాలమున కవులు ప్రేమయొక్క స్వర్గీయ భావమును సరిగా ననుభవింప జాలకుండిరని నా నమ్మకము. భవభూతి కాలమున ప్రేమ స్వచ్ఛమయినట్లు గనుపట్టును. విశుద్ధప్రేమ విషయములో భవభూతి కల్పన నుమించి యే దేశపు కవియు పోజాలడు. శకుంతల

కోమల ప్రకృతిగల తపస్విని. ఆమె ప్రేమ అధీనము, ఉచ్ఛృంఖలము, ప్రబలమునైయున్నది. వంచితయగు రమణి కుండు సమస్తలజ్జయు, రోషము ఆమె హృదయమున ప్రజ్వలితము లయ్యెను. "కులాంగన లీరీతి నిర్లజ్జవై యెచటనేని పరపురుషుని వాంఛించెదరా ? నేను స్వేచ్ఛాచారిణియగు గణికవలె నీ యొద్దకు వచ్చితినని నీవు తలంచుచుంటివా," అని సాధ్వియగు శకుంతల దుష్యంతుని నిందించెను. సాధ్వి పతియొక్క నిర్దయావమానము తృణీకరించి గర్వముతో తలయెత్తుకొని నిలబడునంతటి యౌన్నత్యము వహించును. శకుంతలా విరహము దృఢము, శాంతము, సంయతము. శకుంతలా చరిత్ర మాహాత్మ్యముకూడ పతనోత్థానములమీద నాధారపడియున్నది. దుష్యంతుని ప్రేమలో జిక్కి అతనితో జేసిన నిర్లజ్జా సంభాషణము, కణ్వమహర్షి అనుజ్ఞ వేడకయే అతనికి చేసిన ఆత్మార్పణము ఆమె యధఃపతనముయొక్క చరమసీమ. ఆమె ఈ యధఃపతనమునందు వివాహమొకటియే పుణ్యరేఖ. అదియే యిరువురకు కాపాడి, వారికి ముందు ముందు పైకి లేచుటకు మార్గము నిచ్చినది. ప్రాయశ్చిత్తము ప్రత్యాఖ్యానమునుండి ప్రారంభమై విరహవ్రతధారణముచే సంపూర్ణమాయెను. స్వాభావిక నియమబలముచే వారికి మరల సంయోగము జరిగెను. దుష్యంతుని చరిత్రము వలెనే శకుంతల చరిత్రమును గుణదోష మిశ్రితము.

రామ దుష్యంతులం దెట్టి భేదము గలదో సీతా శకుంతలా చరిత్రములందట్టి భేదమే గలదు. సీత కోమల, పవిత్ర, పరిహాసరసిక, భయవిహ్వల, రామమయ జీవిత. భవభూతి నాటకమందు సీతా చరిత్రము బాగుగ ప్రస్ఫుటితమే కాలేదు. శకుంతల ఒక చరిత్ర. సీత ఒక ధారణ (కల్పన). శకుంతల జీవముగల ఒక స్త్రీ. సీత ఒక శిలాప్రతిమ. శకుంతల పొంగి పొరలిన ఒక నది. సీత స్వచ్ఛ సరోవరము. భవభూతి తాను ప్రతిష్ఠించిన దివ్యమూర్తికి ప్రాణప్రతిష్ఠ చేయలేకపోయెను. కాళిదాసుని శకుంతలయందు హాసము, రోదనము, పతనము, ఉత్థానము, సహనము వుండెను. కాని సీతయందు మొదటినుండి తుదివరకు ప్రేమయే యుండెను. భవభూతి సీత హేమంత ప్రభాతమందలి శేఫాలికా పరిమళమువలె స్వప్నప్రాయము.

## నాటకత్వము :

నాటకమునకు ఘటనైక్యము, ఘటనా సార్థకత, ఘటనల ఘాత ప్రతీఘాతగతి, కవిత్వము, చరిత్ర చిత్రణము, స్వాభావికత ముఖ్యగుణములు.

శకుంతలా నాటకమున ప్రేమయొక్క సఫలత్వము చూపింపబడినది. కనుకనే యిందు ఘటనైక్యము గను పట్టును. ఈ నాటకమున తక్కిన చరిత్రములన్నియు శకుంతలా దుష్యంతుల ప్రేమను వ్యక్తపరచుటకే కల్పింపబడినవి. ఈ నాటకములో యే దృశ్యమును తీసివేసినను పరిణామము బాగుగ వర్ణితము కాదు. కనుకనే యీ నాటకమున ఘటనా సార్థకత యున్నది. మరియు నిది ఘాత ప్రతిఘాతములచే ముందుకు నడచును. కాళిదాసు అంతర్విరోధమును కూడ చూపించెను. లాలసత్వము, ధర్మజ్ఞానము - మనస్సులో యుద్ధము !

భవభూతి నాటకమున యీ గుణములు బొత్తుగా లేవు. అందు ఘటనైకాగ్రత మాత్ర మవశ్య మున్నది. సీతారాముల వియోగము, మరల సంయోగము ఈ రెండే ప్రధాన ఘటనలు. కాని యీ నాటకమున ఘటనా సార్థకత లేదు. ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠాంకములు పూర్తిగా అవాంతరములు. ఈ నాటకమున నాటకత్వ మేమేని యున్నచో ప్రథమ (వియోగము) సప్తమాంకము (సంయోగము)లయందే యున్నది. వాస్తవమునకు సీతా నిర్వాసనము, లవ చంద్రకేతుల యుద్ధము ఈ రెండు ఘటనలే యున్నవి. ఆ యుద్ధము లేకున్నను నాటకమున కేమియు హానిలేదు. ఇందు అంతర్విరోధముకూడ లేదు. సీతా లోకాపవాద సమాచారము వచ్చివచ్చుటతోడనే ఆమె నిర్వాసనము జరిగినది. సంకల్పమునకు కర్తవ్యమునకు యుద్ధములేదు. కవిత్వము శాకుంతలమునందుకంటె ఉత్తర రామచరిత్ర మున నెక్కువ. ఉత్తరరామచరిత్రములో నే చరిత్రమును పరిస్ఫుటము కాలేదు. కాని శాకుంతలములో చిత్రణ కౌశల్య మెక్కువగ చూపింపబడినది.

## కవిత్వము :

నాటకమున కవిత్వ ముండవలయును. కాని ఒక్క కవిత్వ ముండుటచేతనే కావ్యము నాటకము కాదు. కవిత్వముయొక్క రాజ్యము సౌందర్యము. నాటకముయొక్క రాజ్య మనంత మానవ చరిత్రము. మానవ చరిత్రమున సుందరము, కుత్సితము అని రెండు భాగము లుండును. నాటకములో మానవచరిత్రయొక్క కుత్సిత భాగమును జూపించుటకును ప్రయోజన ముండును. వాస్తవమునకు నాటకములో ఆ కుత్సిత భాగమునువిడిచి కేవలము సుందరభావము జూపుట చాల కఠినము. కుత్సిత వ్యాపారమును వర్ణించియే నాటకము విరచించుచో అది ఉత్తమ నాటకము కాజాలదు. సుందరమును మరింత

సుందరముగ జూపించుటకే నాటకమున బీభత్స వ్యాపారమును ప్రవేశపెట్టవలయును. కాళిదాస, భవభూతులు కుత్సితవ్యాపారము నెత్తుకొనలేదు. వారు వర్ణించిన దంతయు సుందర కల్పనాబద్ధమై యున్నది. కనుకనే ఈ నాటకములు నాటకము లయ్యు కావ్యదృష్టిచేగూడ నిర్దోషములే.

ఏ కవులు బాహ్యసౌందర్యమునే చక్కగా వర్ణించెదరో వారు తప్పక కవులే. కాని మానవుని మానసిక సౌందర్యమును చక్కగ వర్ణించువారు మహాకవులు. బాహ్యసౌందర్యము స్థిరము, నిర్జీవము, అపరివర్తనీయము, పశుసాధ్యముకూడ. దానిని జూపించుటకు వాస్తవికోపాయము చిత్రకళ. కాని కావ్యమునుండి బహిర్జగత్తును బహిష్కరించవలయునను నియమ మేమియు లేదు. బాహ్యజగత్తునందలి సుందర వస్తువులలో రమణీ సౌందర్య వర్ణనము సాధారణ కవుల కెక్కువ ప్రియము. మూడవ తరగతి కవులు స్త్రీల ముఖాద్యవయవములను వర్ణించుట కెక్కువ యానందము వహించెదరు. కాళిదాసు తన నాటకములో ననేక స్థానములయందు శకుంతలా రూపమును సజీవముగ మనోహరముగ వర్ణించెను. భవభూతి సీతారూప వర్ణనమును చాల అరుదుగా జేసినాడు. నాటక మంతకు రెండు మారులే సీతయొక్క బాహ్యసౌందర్యము, నందులో ముఖమాత్రమునే వర్ణించినాడు. భవభూతి సీత గుణములపైననే ముగ్ధుడాయెను. కాళిదాసు శకుంతలారూపవర్ణనమును నాటకత్వ దృష్టితో జేసెను - కవిత్వదృష్టిచే గాదు. దుష్యంతుని మానసికావస్థను దెలిసికొనుట కిట్టి వర్ణనమే యావశ్యకమై యుండెను. ప్రథమాంకమున నవయౌవనవతిని, ద్వితీయాంకమున తనను ఆకర్షించిన రూపవతిని, పంచమాంకమున నాతిపరిస్ఫుట శరీర లావణ్యమును, సప్తమాంకమందు విరహిణిని దుష్యంతుడు చూచినాడు. స్థిరసౌందర్య వర్ణనములే గాక, నడచుచున్న సౌందర్యముయొక్క చిత్రములను కూడ కాళిదాసు చూపినాడు. తుమ్మెదలకు భయపడిన శకుంతలను, వృక్షములకు నీళ్లుపోయుచు నలసిన శకుంతలను, వల్కలమును విడిపించు మిషచే ముఖముపైని ముసుగుదీసిన శకుంతలను, అశ్రుపూరిత నయనయగు శకుంతలను వర్ణించినాడు. అంగ సంచాలనముద్వారా మనోభావముల బ్రకటించుటలో కాళిదా సద్వితీయుడు. కాని స్త్రీ సౌందర్య వర్ణనములో కాళిదాసు చూపిన లాలసత్వము భవభూతిలో లేదు. భవభూతి వర్ణనము గిరి నిర్ఝరమువలె నిర్మలము. అతని దృష్టి అంతఃకరణ సౌందర్యమునం దుండును. స్త్రీ అంగ వర్ణనము కాళిదాసునకు ప్రీతికరము. భవభూతి దృష్టిలో స్త్రీ గృహలక్ష్మి, ఆమె మాటలు కర్ణామృతములు, స్పర్శ సంజీవని, స్నేహార్ద్రి శీతలము. కాళిదాసుని దృష్టిలో స్త్రీ ఉపభోగ్య. భవభూతి దృష్టిలో పూజనీయయగు దేవి. కాళిదాసు నాయకు డొక కాముకుడు. భవభూతి నాయకుడు దేవత. కాని భవభూతి దీర్ఘవర్ణనా ప్రియుడయినందున నాటకత్వము లోపించును. జీవజంతు వర్ణనమున కాళిదాసు సిద్ధహస్తుడు. కాని అచేతన వర్ణన మెక్కువ చేయలేదు. భవభూతి యుత్తర రామ చరిత్ర ప్రకృతి వర్ణనతో నిండియున్నది. వీరరస వర్ణనములో భవభూతి నిరుపమానుడు. కాళిదాసు ప్రకృతియొక్క కోమలభాగమునే గ్రహించి పూర్తిగా వర్ణించెను. ఉత్తర రామచరిత్రమున కరుణరసప్రాదుర్భావమే యెక్కువ. కాని యా కరుణము తరుచు విలాపముచే నిండియున్నది. ఇట్టిది చాల చవుక. కర్తవ్యము, స్నేహము, శోకము, ధైర్యము, ఆనందము, వేదన—యీ మిశ్ర ప్రవృత్తుల సంఘర్షణమున పుట్టు కషాయామృతము నెవడు తయారు చేయజాలునో, ఎవడు మిశ్రప్రవృత్తుల సామంజస్యమును గాపాడి మనుష్య హృదయముననున్న కారుణ్యద్వారమును దెరచునో, ఎవడు భిన్నకత్యకు చెందిన సౌందర్యము నొక్కచో పోగుచేసి చూపించి కన్నులవెంట నీరు తెప్పించునో వాడు మహాకవి. కాళిదాసుని కరుణరస మీ తరగతిదే. ఉత్తర రామచరిత్రము వట్టి యాక్రందనము.

వాస్తవమునకు విపుల గంభీర భావములను చిత్రించుటలో భవభూతి కాళిదాసుకంటె చాల గొప్పవాడు. శృంగారరసమున కాళిదా సద్వితీయుడు. కాళిదాసు రమణీయమగు కరుణచిత్రమును జిత్రించుటలో నిపుణుడైనట్లు భవభూతి గంభీర కరుణ చిత్రమును వ్రాయుటలో మొనగాడు. కాళిదాసుని నాటకమును నదీ కలరవముతో పోల్చిన, భవభూతి నాటకమును సముద్ర గర్జనముతో బోల్చవలయును.

## భాష, వృత్తములు:

జీవముగల కవిత్వములో భాష భావము ననుసరించి యుండును. భావము తనకు తగిన భాష నేరుకొనును. భావము చపలమగునపుడు భాషయు చపలమగును. భావము గంభీరమగునపుడు భాషయు గంభీరమగును. అట్లు కానిచో నది యుత్తమ కవిత్వము కాదు. వృత్తము భావమున కెంత యనురూపముగా

నుండిన అంత మంచిది. కాని వృత్తముల యెన్నికపై కావ్యసౌందర్య మంతగ ఆధారపడియుండలేదు.

కాళిదాస భవభూతు లిద్దరిలో నెవరి భాషా సామర్థ్య మెక్కువో నిర్ణయించుట కఠినము. సుందర భాషపై నిద్దరకు నధికారము గలదు. అయినను భాష సరలముగను, స్వాభావికముగను ఉండుటలో కాళిదాసు శ్రేష్ఠుడు. ఇద్దరు కవులును భావము ననుసరించియే భాషను వాడిరి. కాని నిఘంటువులయందు వ్రాసిన యర్థములు, ధ్వనులుగాక వ్యవహరింపబడిన శబ్దములకు మరియొక గుణముండును. ప్రతిశబ్దమునకు నిఘంటు లిఖితమగు అర్థముగాక మరియొక అర్థముండును. దానిని వాడుకలో బెట్టునపు డెన్నియో ఆనుషంగిక భావములు దానివెంట నుండును. దీని నింగ్లీషులో శబ్దముయొక్క (Connotation) అందురు. సాధారణముగ శబ్ద మెంత సహజము, ప్రచలితము నగునో, అది యంత ప్రభావజనకమగును. కాళిదాసుని భాష ఇట్టిదే. భవభూతి భాష అధిక పాండిత్యద్యోతకమైనది. దురూహ్యమగుభాషను ప్రయోగించుటయే యతని కిష్టము.

కావ్యములో అనుప్రాసము నిజముగ సార్థకమైనది. అంత్యప్రాసము (Rhyme) న కే యుద్దేశ్యమో అనుప్రాసమునకు నదియే. ఒక ధ్వని పునఃపునరావృత్తమగుటలో నొక సంగీత ముండును. భవభూతి యనుప్రాసమునందు వీణాధ్వనికన్న రోకళ్ళ ధిమిధిమికయే ఎక్కువగ నున్నది. అతని కనుప్రాసము గూర్చుట కెక్కువ ప్రయాసపడవలసి యుండును. ఆతని "గద్గద నద ద్గోదావరీ వారయః", "నీరంధ్ర నీల నిచులాని", "స్నేహార్దనరాలనాలనలినీ" మున్నగు ననుప్రాసములు చెడ్డవని మే మనము. వీనిలో నొక మంచి స్వర మున్నది. కాని "కూజత్క్లాంతకపోత కుక్కుట కులాః కూలే కులాయద్రుమాః" - యిది బొత్తుగా అసహ్యము. భాషయొక్క సరలత్వ లాలిత్యములందు భవభూతి భాష కాళిదాసుని భాషకంటె నికృష్టము. కాని ధారయందు అంతకంటె శ్రేష్ఠము.

భావమును గంభీరముగను సుబోధముగను జేయుట మహాకవికి మరియొక లక్షణము. కొందరు గొప్ప కవులు కూడ అప్పుడప్పుడు భావము నతిక్లిష్టమును జటిలమును జేయుటచే దానికి టీక యావశ్యక మగుచున్నది. సంస్కృత కావ్యములలో భట్టికావ్యమందును, మాఘ కావ్యమందును ఈ దోషము పూర్తిగ నున్నది. భవభూతి భావమును చిన్నిశబ్దములలో ప్రకటించుటకు బదులుగ నతిదీర్ఘ సమాసములందు ప్రకటించినాడు. వాస్తవమున కతని చేతిలోబడి సమాసమువంటి సుందర నియమముగూడ పాఠకులకు భయకారణ మయ్యెను.

కావ్యమున కుపమ యావశ్యకము. అది యొక యలంకారము; ఒక రచనా పద్ధతి. ఉపమ సుందరమై ఉచితస్థానమున ప్రయోగింపబడునో కావ్యసౌందర్యము హెచ్చును. అది యుత్తమ వర్ణనమున కొక యంగమై, విషయము నలంకృతముగను, ఉజ్జ్వలముగను చేసి, సౌందర్యము నొక్కచోట ప్రోగుపెట్టి, మనోరాజ్య బాహ్యప్రపంచముల సామంజస్యమును చూపి పాఠకుల విస్మితుల జేయును. పద్మముఖి, మృగాక్షి, గజేంద్రగామిని మొదలగు మాంధాత కాలమునాటి యుపమానములు ఒక తెగవారికే ప్రియములై యుండును. కాని ఉత్తమకవులు చీకిన యీ ప్రాత యుపమలను ప్రయోగించుట కేవగించెదరు. తమ కల్పనాశక్తిచే నూతనోపమానముల సృజించెదరు. సంస్కృతసాహిత్యమున ఉపమా ప్రయోగమున కాళిదాసు ప్రసిద్ధుడు. "ఉపమా కాళిదాసస్య." కాని అత డచ్చటచ్చట ఉపమా ప్రయోగమున పరిమితి నతిక్రమించెను. రఘువంశ మహాకావ్యమున తరుచుగా ప్రతి శ్లోకమునందు నత డుపమను ప్రయోగించినందుచేత అనేక స్థలములం దుపమానము సరిగా కుదరలేదు. కాళిదాసుని శాకుంతలమున నిట్టి దోషములు లేవు. ఆతని "సరసిజ మనువిద్ధం శైవలేన" అను ఉపమకు సాటిలేదు. "అనాఘ్రాతం పుష్పం" అనునది అద్భుతము.

కాళిదాస భవభూతుల యుపమాప్రయోగ సరణి వేరు విధముగ నుండును. ఉపమాప్రయోగము మూడు విధములు. (1) వస్తువుతో వస్తువును, గుణముతో గుణమును పోల్చుట. ఉదా :- చంద్రునివంటి ముఖము, మాతృప్రేమవలె పవిత్రము. (2) గుణముతో వస్తువును పోల్చుట. ఉదా:- స్నేహము శిశిరమువలె పవిత్రము. సరోవరమువలె స్వచ్ఛము. (3) వస్తువుతో గుణమును పోల్చుట. ఉదా :- సుఖమువంటి సెలయేరు, మనస్సువంటి గతి. కాళిదాస భవభూతుల నాటకములం దీ త్రివిధములగు నుపమ లున్నవి. కాని కాళిదాసుని యాధిక్యత ఒకటవ రెండవ యుపమలు ప్రయోగించుటయందును, భవభూతి యాధిక్యము మూడవ రకపు ఉపమ ప్రయోగించుటయందు నున్నది. కాళిదాసు వల్కల ధారిణియగు శకుంతలను శైవలవేష్టితమగు పద్మముతో బోల్చును. భవభూతి సీతను కారుణ్య

ముతో బోల్చును. వాస్తవమునకు కాళిదాసుని శకుంతలా కల్పన ఆధిభౌతికము. భవభూతి సీతాకల్పన ఆధ్యాత్మికము. ఉపమల విషయమందు కూడ కాళిదాసు మర్త్యలోకమునందును, భవభూతి ఆకాశమందును విహరించు చున్నట్టులున్నారు.

వృత్తముల నెన్నుటలో నిద్దరు కవులును సమానులే. సంస్కృత నాటకములలో వరుసగా నొకటే వృత్తము ప్రయోగింపబడదు. కాళిదాస భవభూతు లిద్దరును తరుచు వాడుక వృత్తములనే ప్రయోగించిరి. ఆ వృత్తములు తరుచుగా వర్ణనమున కుపయుక్తములై యున్నవి. విషయము కొద్దిదగునపుడు హరిణీంద్ర వజ్రావృత్తములును, పెద్దదగునపుడు మందాక్రాంతా, స్రగ్ధరా, శార్దూల విక్రీడిత, శిఖరిణిత్యాదివృత్తములును ప్రయోగింపబడినవి. ఇతర వృత్తములలో కాళిదాసున కార్యయు, భవభూతి కనుష్టుప్పును ప్రియములని తోచుచున్నది.

## వివిధ విషయములు:

నాటక దృష్టితో ఉత్తర రామచరిత్రను విమర్శించుచో, దాని నాటకత్వ మెవ్విధమునను నిలువజాలదు. అమానుషిక విషయము లందు మెండు. భవభూతి నాటక రూపమున కావ్యమును వ్రాసెను. ఏడంకము లుంచి మహా నాటకమను పేరుపెట్టి, ఆలంకారిక నియమమును పాలించుటకై సీతారాముల సంయోగము మార్చినను అతడు దీనిని యథార్థ నాటకముగా చేయజాలనని యెరిగియుండెను. కనుకనే కల్పనను స్వేచ్ఛగా వదలెను. దుష్యంతుని నిర్దోషిగ జేయుటకై కాళిదాసు ముని శాపమును కల్పించెను. భవభూతి నాటకకారుడు కాడు, మహాకవి. అతని ఉత్తర రామ చరిత్రములో ఉపాఖ్యాన భాగ మేమియు లేదని చెప్పినను అనుచితము కాదు. అతని నాటకములో వర్ణనలు దక్కనునేదియు లేదు. కాని కల్పన సంపూర్ణముగను, అత్యంత సుందరముగను కుదిరినది. ఉదా: ఛాయాసీత. కాళిదాస భవభూతుల కాలములనాటి ఆచార వ్యవహారములను పోల్చి చూచినచో భేదము కొంత కనుపట్టును. భవభూతి కాలమున వర్ణభేద కాఠిన్యము తగ్గినది. దుష్యంతుడు మునులకు వెరచెను. భవభూతి రాము డష్టావక్రమునితో మిత్రునితోవలె సంభాషించును. భవభూతి కాలమున స్త్రీ సన్మానము కాళిదాసు కాలము నాటికంటె చాల హెచ్చినట్లు కనుపట్టును. ఈ ఆచార వ్యవహార వైషమ్యము కాలానుశ్రుతమే కాక, కవుల యొక్క భిన్నరుచిని దెలుపునదియు కావచ్చును. కవి యెంత పెద్దవాడైనను కాలమును మించి యెక్కువ పైకి పోజాలడు.

## సమాప్తి:

కాళిదాసు విశ్వజనీన ప్రతిభకు ప్రధాన లక్షణ మేమన, ఎపుడో వ్రాసిన అతని నాటకము నేటికిని పురాతి నాధునాతనాలంకార శాస్త్రముల కనుకూలముగ నుంచి, ఆచారనీతివిశ్వాసముల పరివర్తనములను తృణీకరించి, సమస్త విమర్శకుల తీక్ష్ణదృష్టిముందును పర్వతము వలె నిశ్చలమై గర్వముచే తలయెత్తుకొని నిలబడి యున్నది. ఈ రచన ఉషఃప్రాదుర్భావమువలె నప్పుడెంత సుందరముగ నున్నదో ఇప్పుడు నట్లే యున్నది. భవభూతి రచనా మాహాత్మ్యమును కాలగతితో పెరుగుచునే యున్నది.

ఒకటి నాటకము, రెండవది కావ్యము. నాటక దృష్టిచే ఉత్తర రామ చరిత్రము శాకుంతలముయొక్క పాద ధూళికి కూడ సరిరాక పోవచ్చును. కాని కావ్య దృష్టిచే ఉత్తర రామ చరిత్రము శాకుంతలము కన్న చాల గొప్పది. విశ్వాస మహిమయందును, ప్రేమ పవిత్రతయందును, భాషా గాంభీర్యమందును, హృదయ మాహాత్మ్యమునందును ఉత్తర రామచరిత్రము లోకోత్తరము. ఘటనా వైచిత్ర్యమందును, మానవ చరిత్రయొక్క సూక్ష్మ విశ్లేషణమందును, భాషా సారల్య లాలిత్యము లందును శాకుంతలము శ్రేష్ఠము. శాకుంతలము శారద పూర్ణచంద్రిక. ఉత్తర రామచరిత్రము నక్షత్ర ఖచిత మగు నీలాకాశము. ఒకటి యుద్యానములోని గులాబి, రెండవది వనమాలతి. ఒకటివ్యంజనము. రెండవది హవిష్యాన్నము. ఒకటి వసంతము. రెండవది వివర్ష. ఒకటి నృత్యము. రెండవది అశ్రువు. ఒకటి ఉపభోగము. రెండవది పూజ!

[ఆంధ్ర గ్రంథరత్నాకరము(గుడివాడ)వారి ప్రచురణగా జంధ్యాల శివన్న శాస్త్రిగారిచే అనువదింపబడిన 178 పుటల "కాళిదాస భవభూతులు" అనే గ్రంథపు సంక్షిప్తీకరణ.]

# "వాగర్థావివసంపృక్తౌ"

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ

కాళిదాసు శబ్దార్థములను శివశక్తులనుగా భావించి కావ్యరచన నిర్వహించాడు. తన దృశ్యశ్రవ్యకృతులలో శివశక్తుల సామరస్యమునే స్త్రీపుంస దాంపత్యముగా నిరూపించాడు. శృంగారము దాంపత్యనిష్ఠమయినపుడే సముచితమని ఆతని సందేశము. కుమారసంభవంలో పార్వతీపరమేశ్వరుల దాంపత్యము పరాకాష్ఠ వహించింది. రఘువంశంలో దాంపత్యశోభ సంయోగ వియోగములలో ఎట్లా ఉంటుందో స్పష్టమయింది. మేఘకావ్యంలో యక్షుడున్నూ భార్యావియోగ పరితప్తుడై కనపడుతాడు. కావ్యాలలో అంతటా దాంపత్యశుద్ధి విశదంగా ఉన్నది. ఆతని మూడు నాటకాలలోనూ దాంపత్యసిద్ధికల శృంగారమే ప్రదర్శితమయింది.

౧. మాలవికలో, పెద్దభార్య అంగీకరించినపుడె మాలవిక భార్య కాగలిగింది. భార్యగానే మాలవిక అవగుంఠనం ధరించినా రమ్యంగా కనపడుతుంది.

౨. ఊర్వశి దేవవేశ్య. అయినా భార్యవలెనె అనురక్త అయినది. ఆమెది వేశ్యారంగం కాదు. వియోగభీరువై పత్నీభావంతో సంచరించింది. దేవనియమం హేతువుగా పుత్రదర్శనపర్యంతమె ఆమె ఉండాలి. కాని ఊర్వశి చిరకాలము ప్రియుని దగ్గర ఉండాలని కుమారునికూడా చూపలేదు. కుమారుడు కనపడగా వియోగపరితాపం పొందింది. కవి దేవేంద్రుడై ప్రియుడున్నంతకాలం సాన్నిధ్యము అనుగ్రహించాడు. అప్సరస పుత్రవతిగా రాణించింది.

3. శకుంతలాచిత్రణము అసాధారణము. మాలవికకు పుత్రప్రాప్తి చెప్పలేదు. పెద్ద భార్యధారిణి పుత్రవతి. కనిష్ఠానాయిక అయిన ఊర్వశి పుత్రవతి అయింది. శాకుంతలంలో శకుంతల పుత్రవతి. పుత్రప్రాప్తి ముఖ్యంగా శాకుంతలంలో ఉంది. దుష్యంతుడు ఆశ్రమం ప్రవేశించేటపుడే "చక్రవర్తినం పుత్రామాప్నుహి" అని ఋషు లన్నారు. ఆశ్రమం నుంచి శకుంతల నగరానికి బయలుదేరేటప్పుడు కణ్వుడు సుపుత్రోదయమునే సూచించాడు. గర్భవతి శకుంతల ఆస్థానంలో నిరాకృతఅయింది. రాజుతో విదూషకుడు—"నీకు కలిగే కుమారుడు రాజలక్షణాలు కలిగి ఉంటాడని జ్యోతిష్కులు చెప్పారు గదా! ఈమె అట్టి కుమారుని కన్నప్పుడు నీభార్య అని నిశ్చయించవచ్చు"అంటాడు. మరీచాశ్రమంలో పుత్రవతి శకుంతల ఏకవేణీధరగా ఉన్నది. దుష్యంతుడు భరతుని చూచి వత్సలుడవుతాడు. మొల మూలిక దుష్యంతుడు తండ్రి అని నిశ్చయం కలుగజేసింది. మరీచఋషి ఆశీర్వాదాలతో పుత్రవతి శకుంతలను దుష్యంతుడు స్వీకరించాడు. శకుంతల అప్సరః పుత్రి పుత్రావతియై ప్రశంసాస్పద అయింది. స్త్రీ భార్యయై రాణించాలి. పుత్రవతియై శోభించాలి. ఇది కాళిదాస సందేశం. శాకుంతల నాటకం అంతా పుత్రసిద్ధి బీజంగా చేసికొని ప్రసరించి విశ్వప్రశంసల అందుకొన్నది.

"అభిజ్ఞాన శాకుంతల నాటకమున దుష్యం తునకు చక్రవర్తి పుత్రలాభము మునిజనా శీర్వచన ద్వారమున సూచిత మయినది" అని నేను నా నాట్యవేదములో అభినవ గుప్తుని అభినవభారతీభావసారముగా వ్రాశాను. శాకుంతల నాటక బీజార్థము పుత్ర లాభమె. ఈ అంశమె నాందీ పద్యంలో కూడా సూచితమయింది.

౧. "వహతి విధిహుతం యా హవిః"

౨. "యామాహుః సర్వబీజ ప్రకృతిః"

ఈ రెండూ నాందీపద్యంలో ఉన్నవి. శకుంతల విధివిహితమయిన దుష్యంత తేజము వహించుతున్నదని, బీజస్వరూపుడయిన సర్వ దమనుడనే భరతునకు ప్రకృతిస్వరూప అని భావము. రూపకారంభంలో సూచితమయిన బీజార్థమె ప్రథమాంకములో నిరూపితం కావాలి. తరువాతి అంకాలలో ఆ బీజార్థమె వ్యాపించి ప్రసరించాలి. అదె నిర్వహణాం కంలో పర్యవసించాలి. ఇది నాటకీయ కార్య శృంఖల. ఈ విధంగా రూపకమును నిర్మించ డమె శక్తి నిదర్శనము. కాళిదాసు శాకుం తలంలో రచనాదర్శముద్వారా సమాజా దర్శమును ప్రదర్శించాడు.

కేవలాదర్శవాదము కేవలానందము కాళి దాస రచనలో కనపడదు. ఆదర్శములో ఆనందము, ఆనందములో ఆదర్శము ఆతని రచనాసర్వస్వము. ఈ ఉభయ సామర స్యంతో సాహిత్యమును సమీక్షించితేనే సాహిత్యం ఉపకరిస్తుంది. కేవల కావ్యదృష్టి అనే పేరుతో గుణాలంకారరీతివృత్తిశయ్యా పాకముల పరిశీలనమాత్రం యుక్తముకాదు. కేవల విషయదృష్టి అనే పేరుతో సంఘధర్మ నీత్యాదర్శముల పరిశీలన మాత్రమునూ యుక్తంకాదు. రెండువిధాలా సమీక్షచేసి సారము గుర్తించాలి.

కాళిదాసు తన కావ్యాలలో ప్రాచీన కథలనె చెప్పాడు. తనకన్న పూర్వం ఉన్న రచనల విశేషాలను కూర్చుకున్నాడు. అయితేనేమి కాళిదాసు కాళిదాసె. ఎవరిని అనుకరించితేనేమి ? వానిని యుక్తంగా కూర్చినాడా ? అని మాత్రమె సమీక్షిం చాలి. కాళిదాస కావ్యధర్మమును ప్రసమీ క్షించి పరిశీలించితే విఘ్నరహితమయిన ప్రతీతి మనకు కలుగుతుంది. అప్పుడు కాళి దాసు సహృదయంలో నివసిస్తాడు.

అభినవగుప్తుని భావసంభారమును అందు కొనడానికి యత్నించిన నేను;

"శాకుంతలములో కాళిదాసు రససాక్షా త్కార స్వభావము నీ విధముగా సూచించి నాడు.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చనిశమ్య శబ్దాన్
పర్యుత్సుకే భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని"

"సుఖితప్రాణియు రమ్యములను చూచి, మధురశబ్దములను విని, పర్యుత్సుకు డగుట యబోధపూర్వమును మనమున స్మరించు చున్నాడని యర్థము. జన్మాంతరసౌహృదము లన్నియు భావగతములై యుండును గదా !" దీని భావింపుడు. ఈ పద్యములో "స్మరతి" యని యొక స్మృతి నిదర్శిత మయినది. అది తార్కిక ప్రసిద్ధ స్మృతి కాదు. పూర్వమట్టి దేమాత్ర మనుభూతము కాదు కదా ! ఈ స్మృతి ప్రతిభానమన్న పేరు కలది. సాక్షా త్కార స్వభావము, ఆస్వాదాత్మకము నయిన ప్రతీతి యొక్కటియె నిత్య మందు గోచరించును. ఆ ప్రతీతియందే రతి యవ

భాసించుచున్నది. ఇది యిట్టిది కావుననె యే విశేష మిందు కూడియుండదు. ఇది రసనీయమై యనుభూతిలో సాక్షాత్కరించును. ఈ రతి లౌకికము కాదు. మిథ్య కాదు. అనిర్వాచ్యము కాదు. లౌకికతుల్యము కాదు. తదారోపాదిరూపము కాదు. దేశకాలాది నియంత్రణ మే మాత్రము లేనందున రతికి సంబంధించిన యొకానొక యుపచయావస్థ కావచ్చును. రసనాత్మక మయిన వీతవిఘ్నప్రతీతి దీని గ్రహించుచున్నది. ఇట్లు నిర్గ్రాహ్యభావమె రసము. ఇందు విభావప్రభృతు లన్నియు విఘ్నాపసారకములు. లోకమునగూడ సకల విఘ్ననిర్ముక్తమయిన సంవిత్తియె చమత్కారమని, నిర్వేశమని, రసనయని, ఆస్వాదనమని, భోగమని, సమాపత్తియని, లయమని, విశ్రాంతి యని ఏవమాది శబ్దముల నిరూపిత మగుచున్నది."

అని నాట్యవేదంలో వ్రాశాను. భరతుని నిర్ణయానుసారంగా కాళిదాసు సమీక్ష చేస్తే లోకంలో నవోన్మేషం కలుగుతుంది. కాళిదాస పద్యభావాస్వాదనమునకు అభినవగుప్తుడు ప్రదర్శించిన అభినవమార్గం ఒకటి ఉన్నది. సారస్వతేయులు అభినవమార్గపథికు లయితే కాళిదాసు అవతరిస్తాడు. కాళిదాసీకృత హృదయాలతో కాళిదాసుకు స్వాగతం పలుకగల అర్హతసంపాదించపగలము.



ఏకో హి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥

చంద్రకాంతిలో చంద్రునిలో నలుపు కనబడనట్లే చాలా మంచిగుణాలలో ఒక లోపం లెక్కలోకి రాదు.

  

క్షుద్రేపి నూనం శరణం ప్రపన్నే మమత్వ ముచ్చైశ్శిరసాం సతీవ॥

మహాత్ములు శరణన్న నీచుడికికూడ మంచివానియెడ చూపే అభిమానాన్నే చూపుతారు.

  

వికారహేతౌ సతి విక్రియంతే యేషాం నచేతాంసి తఏవ ధీరాః॥

ప్రలోభం ఎదుటవున్నా చలించనివాళ్ళే ధీరులంటే...

  

# కవికుల గురువు కాళిదాసు అతని కవితావైభవము

## శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

"కాళిదాస గిరాం సారం కాళిదాస స్సరస్వతీ
చతుర్ముఖోధవా సాక్షాత్ విదుర్నాన్యేతు
మాదృశాః"

(కాళిదాస కవిత్వపు చెణుకుల్ని వివరించాలంటే ఆ కాళిదాసునికే సాధ్యం. సరస్వతో, సాక్షాత్తూ చతుర్ముఖ బ్రహ్మో రావాలి. మా బోటివాళ్ళ కది సాధ్యంకాదు) అని ఒక మహా విద్వాంసుని వచనము.

ప్రపంచ మహా కవులలో ఉత్తమ శ్రేణికి చెందిన కాళిదాసును కనిన భరతమాత కీర్తి ప్రతిష్ఠలు అజరామరములై నిలిచినవి. ఈ మహాకవి జన్మకాలమునుగూర్చి ఎందరో ప్రాచీనపాశ్చాత్య విమర్శకాగ్రేసరులు ఎంతో కృషి సల్పికూడా నేటిదాకా ఇదమిత్థమని తేల్చలేకపోవుచున్నారు. ముఖ్యముగా రెండు మూడు విషయములను బట్టి పరిశీలించినచో కొంతవరకు ఇతని కాలమునుగూర్చి చూచాయగా తెలిసికొనవచ్చు. పాణినీయ వ్యాకరణమునకు విరుద్ధములైన ప్రయోగములు కొన్ని ఇతని గ్రంథములలో ప్రయోగించుటచేతను, సంతతి లేక చనిపోయినవాని ఆస్తి అతని భార్యకు చెందక రాజునకు చెందును అని శాకుంతలములో చెప్పబడుటచేతను, రత్నములను దొంగిలించినవాడు వధార్హుడని చెప్పుట బట్టియు ఈ మహాకవి రమారమి క్రీ. పూ. మొదటి శతాబ్దివాడని చెప్పవచ్చును.

కాళిదాసుడు అను పేరుగల కవులు ఐదారుగురున్నట్లు మనకు తెలియుచున్నది. అందులో రఘువంశాది కావ్యములు వ్రాసిన కాళిదాసుడే సుప్రసిద్ధుడు. తదితర కాళిదాసులకు సంబంధించిన కొన్ని పుక్కిటి కథలు ఈ కాళిదాసునకే అంటగట్టి చెప్పబడుచున్నవి.

కాళిదాసు విద్యా వైభవమును గూర్చి ఒక విచిత్రమైన చిన్న కథ పండితులు చెప్పుకొందురు.

"కాళిదాసు తొలుత చదువురానివాడుగా నుండెననియు పెండ్లి అయిన తరువాత ఆయన భార్యకు అది తెలిసి మనస్సులో పరితాప పడి "నీవు కాళికాదేవిని ఆరాధించి విద్యావంతుడవు కమ్ము" అని భర్తతో చెప్పి అతనిని పంపెను. ఆమె చెప్పిన విధముననే ఆయన ఆ దేవిని ఆరాధించి సకల విద్యలను, చక్కని కవిత్వమును సంపాదించెను. ఇంటికి వచ్చి తనయొక్క వాక్చాతుర్యమును, పాండిత్యమును భార్యకు ప్రకటింపదలచి, "అస్తి కశ్చిత్ వాగ్విశేషః" (ఏమన్నా విశేషాలున్నాయా?) అని చెప్పెను. దానితో ఆమె తృప్తిజెందక అతని విద్యాశక్తిని పూర్తిగా తెలిచికొన గోరెను. ఆయన తన సామర్థ్యమును పూర్తిగా ఆమెకు తెలుపదలచి తాను చెప్పిన వాక్యములోని నాలుగు పదములు మొదట ఉంచి నాల్గు కావ్యము

లను కొలది కాలములోనే రచియించి ఆమెకు చూపగానే ఆమె సంతుష్టి జెందెను" అని చెప్పుకొందురు. ఇట్టి కథలెన్నియో ఈ మహాకవినిగూర్చి చెప్పికొనుచుందు రనుటకు ఇది ఒక తార్కాణము.

కాళిదాసుడు ఏ దేశమువాడని ఏజాతి వాడని చెప్పుటకు తగిన ఆధారములు స్పష్ట ముగా మనకు గోచరించుటలేదు. కాని ఇతడు వేదమంత్రముల సూచనను అచ్చ టచ్చట తన గ్రంథములలో చేసినందుచేతను, "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్" (వేదాల అర్థాన్ని స్మృతులు అనుసరించినట్లుగా) అను రఘువంశ శ్లోకభాగముచేతను ఇతడు బ్రాహ్మ ణుడని చెప్పవచ్చును. ఇతడు అద్వైత మతావలంబియని ఇతని 'విక్రమోర్వశీయ' నాటకపు నాందీ శ్లోకములో "వేదాంతేషు యమాహురేక పురుషం వ్యాప్య స్థితం రోదసీ" (ప్రపంచాన్నంతనీ ఆవరించివున్న ఒకే పురుషుణ్ణిగా ఉపనిషత్తులలో చెప్పే...) అను శ్లోకపాదమే సాక్ష్యమిచ్చుచున్నది. ఈ మహాకవి రఘువంశ చతుర్థ సర్గములో రఘు మహారాజు జైత్రయాత్రను వర్ణించునపుడు సూచించిన దేశములను బట్టి ఇతడు అనేక దేశములను పర్యటించి పరిపూర్ణమైన లోక జ్ఞానమును సంపాదించినవాడని మనకు స్పష్ట మగుచున్నది. 'మేఘ సందేశము' లోని అలకా పట్టణ మార్గ వర్ణనముకూడ ఈ యభిప్రాయమునే ధ్రువపరచు చున్నది. ఇతని చరిత్రనుగూర్చి మనకు స్పష్టముగా తెలియకున్నప్పటికినీ ఇతడు భారతీయ కవు లకు గురువనియు ఇతని కవితా ప్రభావము సోకని కవిత ఇతని తరువాత వారిలో ఎచ్చ టను కానరాలేదు. కాబట్టి ఇతడు కవి బ్రహ్మయనియు చెప్పుటకు ఏమాత్రము సందేహము లేదు.

కాళిదాసుడు, 'రఘువంశము, కుమార సంభవము, మేఘసందేశము' అను మూడు కావ్యములను, 'శాకుంతలము, విక్రమోర్వ శీయము, మాళవికాగ్నిమిత్రము' అను మూడు నాటకములను రచించెను. ఇవి గాక ఋతు సంహారము మొదలగు ననేక కావ్యము లీ మహాకవి రచించినట్లు వాడుక గలదు. కాని వానిలో నొక ఋతు సంహారము మాత్ర మితడు రచించినట్లు చెప్పుటకు అనేక ఆధారములు కలవు.

ఈ కవి వాల్మీకికి పరోక్ష శిష్యుడని విద్వాంసుల యభిప్రాయము. ఇందుకు తార్కాణము 'పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా' (ఉత్తమురాలూ, పతివ్రత అయిన ఆమె నీడలాగ నిరంతరం వెంటాడింది.) అను రామాయణ శ్లోకము నకు అనుగుణముగా కాళిదాసు రఘు వంశంలో 'ఛాయేవ తాం భూపతి రన్వ గచ్ఛత్' (మహారాజా మెను (నందిని ధేను వును) నీడలా వెంటాడాడు) అను శ్లోక భాగమును రచించె నందురు. రామాయణ వర్ణనములను పోలిన అనేక వర్ణనములు కాళిదాస కృతులలో నున్నను అవి చదువు వారికి గోచరింపనంత రమ్యముగా నితడు కూర్చెను. వాల్మీకిపై కాళిదాసు కత్యంత భక్తివిశ్వాసములు కలవు. ఇట్లే భాస మహా కవి పైనను భక్తి కలవాడన్నందు కితడు భాస నాటకముల యనుకరణము నచ్చ టచ్చట ప్రకృతి వర్ణన సందర్భములందు తన కృతులలో చేయుటయే తార్కా ణము. కాళిదాస కృతులందు నవరసములు వర్ణితములైనను నితనికి శృంగారమునందె

యెక్కువ మక్కువ కలదు. అందును విప్రలంభ శృంగారము ఇతని గ్రంథములలో పరాకాష్ఠ నందుకున్నది. ఇతని మేఘ సందేశము ఖండకావ్యమైనను విప్రలంభ శృంగార వర్ణనములో నిది కావ్య ప్రపంచమున కెల్ల తలమానికము. ఇది యొక కావ్యరత్నము. కాళిదాసుని అపూర్వ ప్రతిభా సంపత్తికి ఇది ఒరగల్లు. మహా పండితులైన మల్లినాథాదులనేకు లీకావ్యమునకు వ్యాఖ్యానములను వ్రాసిరి. మల్లినాథుడు 'మాఘే మేఘే గతం వయః' (మాఘకవి వ్రాసిన శిశుపాలవధ కావ్యానికీ, మేఘ సందేశానికీ వ్యాఖ్యలు వ్రాయడంలో మా వయస్సు చెల్లిపోయింది) అని చెప్పినాడు. రామాయణములో రాముడు సీతకు హనుమంతుని ద్వారా పంపిన సందేశమును మనసున నుంచుకొని కాళిదాసు మేఘ సందేశమును వ్రాసెనని ఊహింపవచ్చును. కాళిదాసు తరువాత కవులెందరో యెన్నో సందేశ కావ్యములను అతనిని అనుకరించుటకు వ్రాసిరి కాని అవి మేఘ సందేశమునకు ఏ యంశములోను సరిపోలలేవు.

ఈ కావ్యమునందు, యక్షుడు మేఘుని ద్వారా ప్రియురాలికి పంపు సందేశములలో

"త్వా మాలిఖ్య ప్రణయ
కుపితాం ధాతు రాగై శ్శిలాయాం ।
ఆత్మానం తే చరణపతితం
యావ దిచ్ఛామి కర్తుం ।
అస్రైస్తావ న్ముహు రుపచితై
ర్దృష్టిరాలుప్యతే మే ।
క్రూర స్తస్మిన్నపి నసహతే
సంగమం నౌ కృతాంతః ॥

(ఓ చెలీ! నీవు ప్రణయ కుపితురాలవై యున్నప్పటి నీ రూపును శిలపై చిత్రించుకొని నిన్ను ప్రసన్నురాలిని చేయుటకు నీపాదములపై నేను వ్రాలినట్లుగాగూడ చిత్తరువున దిద్దితిని. అప్పుడు కంటినిండ నీరుగ్రమ్మి కన్నులు కానరాకపోయెను. క్రూరదైవము చిత్తరువునందు గూడ మన సంగమమును ఓర్వలేకపోయెగదా! ఎంత దౌర్భాగ్యము) అను సందేశ మెంతో హృదయ విదారకముగ నున్నది.

భావుకతకు పరాకాష్ఠ అనదగిన మేఘదూత కావ్యమునకు సాటియగు (లిరికల్) కావ్యము, ప్రపంచమునందు ఇకపుట్టదేమో. కాళిదాసు చిత్రకారుడు కాబట్టి కాబోలు, ఇతడు తన రచనలలో చూపిన వర్ణికాభంగమును చిత్రకారులు కూడ చేయలేరని ఈ క్రింది మందాక్రాంత స్పష్టము చేయుచున్నది.

"రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్య మే
తత్పురస్తాత్
వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుః ఖండ
మాఖండ లస్య;
యేన శ్యామం వపురతితరాం కాంతి
మాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య
విష్ణోః ॥"

(ఎదురుగావున్న ఆ పుట్టమీదుగా ఇంద్రధనుఃఖండంమీదుగా రత్నాల కాంతులు అలముకొన్నట్లుగా బయలుదేరుతుంది. దాని వలన నీ నల్లని శరీరం నెమలిపింఛంతో అలంకరించిన కృష్ణుని శరీరంలా ప్రకాశిస్తుంది.)

ఈ శ్లోకములోని రంగుల కలయికను కాళిదాసుని వంటి చిత్రకారుడే వివరించగలడు.

అతిలోక అనింద్య సౌందర్య స్వరూపిణిగా పార్వతీదేవిని ఇతడు శివునితో నిట్లు వర్ణింపచేసెను.

"యదుచ్యతే పార్వతి! పాపవృత్తయే
నరూప మిత్య వ్యభిచారి తద్వచః
తథా హి తే శీల ముదార దర్శనే!
తపస్వినా మప్యుపదేశితాం గతం."

(అందం అనేది పాపకార్యాలకోసం కాదు అనేమాట నిజమే అయింది. పార్వతీ, నీ శీలం ఋషులకూడా ఆదర్శప్రాయం) ఇంతేకాక, కాళిదాసుడు శిల్పియు కాబోలును. లేకున్న నొక్కమాటలో శిల్పకళా రహస్యము ఈ క్రింది పద్యములో ఇంత మనోహరముగా జాలువార గలుగునా?

"స్థితాః క్షణం పక్ష్మసు, తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః"

(మొట్ట మొదటి వర్ష బిందువులు ఒక క్షణం రెప్పలమీద ఆగాయి. పెదవిమీద పడ్డాయి. రొమ్ములమీద తుంపురు తుంపురు లయి, పొట్టమడతలలోంచి జారి నాభిని చేరే సరికి ఎంతో వ్యవధి గడిచింది) అని అన గలిగి యుండునా?

కాళిదాసు కవిత, భావుకత ఈ రెంటి విషయములో బంగారు పండించిన నాటకము అభిజ్ఞాన శాకుంతలము. కుమార సంభవము లోని దేవభూములలోపార్వతికి దివ్యసౌందర్య శీలముల అలంకరణము కాళిదాసునకు విడ్డూర మనిపించినదేమో. శాకుంతలమున ఒక మానవిని – దేవ సంబంధమున్నను, పాంచ భౌతికతయే హెచ్చుగా నున్న వ్యక్తిని – సంపూర్ణ దివ్యత్వ విలసితగా తీర్చి దిద్ది కాళిదాసు దేవ మానవ లోకములకు సమ న్వయము కుదిర్చెను. అతని కృతులలో చివరిది శాకుంతల మనవచ్చును. మాళవి కాగ్ని మిత్రము నాటకములలో తొలిది కావచ్చును. శాకుంతల నాటకములోని రసౌచిత్యము, కథ, పాత్రలు అద్భుతములు. కనుకనే 'నాటకేషు శకుంతలా' అను నానుడి లోకమున ప్రసిద్ధ కెక్కినది. శాకుంతలనాట కమున ఈ సహజ సౌందర్య వర్ణనమును ఎంతో అందముగ వర్ణించుచు 'కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం' (అంద మైన ఆకారాలుగలవారికి ఏది పెట్టినా అలం కారంగానే వుంటుంది) అని చెప్పెను. దుష్యంతుడు శకుంతలను విడిచి పోవునప్పుడు:

"గచ్ఛతి పురః శరీరం ధావతి పశ్చా దసంస్తుతం చేతః" (శరీరం ముందుకు పోతూంది. కాని మనస్సుమాత్రం వెనకకే పరుగెత్తుతూంది) అని చెప్పి దానికి సుందర మైన ఉపమానమును కూడా:

"చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య" [ఎదురుగాలికి తీసుకుపోతున్న జెండాగుడ్డవలె (వుంది)] అని చెప్పెను.

'జామిత్ర' మొదలగు శబ్దములను ప్రయో గించి ఈ కవి తన జోతిశ్శాస్త్రం ప్రావీణ్య మును, "వీర్యవంత్యౌషధానీవ, రాజ యక్ష్మా, మహౌషధిం నక్తమివావభాసః" ఇత్యాది రచనలచే వైద్య విద్యా ప్రావీణ్య మును ప్రకటించెను. ఆతని కాలమున భార తీయులు నౌకా వ్యాపారములుకూడా చేయు చుండిరని అతని రచనలవలన మనకు తెలి యును. రఘుమహారాజు దిగ్విజయ యాత్ర వర్ణనము ప్రాచీన హిందూదేశ చిత్రపట మన వచ్చును.

రఘువంశ కావ్యములో కాళిదాసుడు ఈ నాటి ప్రజాప్రభుత్వ పద్ధతిని సూచించుచు: "ప్రజానా మేవ భూత్యర్థం సతాభ్యో బలి మగ్రహీత్; సహస్రగుణ ముత్స్రష్టుమా దత్తేహి రసం రవిః," (ప్రజాక్షేమంకోసమే

ఆతడు వారినుంచి పూజలందుకొన్నాడు. సూర్యుడు నీరును తీసుకోవడం వేయింతలుగా తిరిగి ఇవ్వడం కోసమే) అని చెప్పెను.

ఉపమాకాళిదాసస్య-అనుటకు ఎన్నియో అద్భుతములైన ఉపమోదాహరణములను ఇతని కృతులనుండి చూపవచ్చును. అందులో "దీపశిఖాకాళిదాస" అని ఇతనికి గొప్పకీర్తిని, బిరుదమును తెచ్చి పెట్టిన శ్లోకము, "సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యంవ్యతీయాయ పతింవరా సా" (వరాన్వేషిణియై ఆమె నడుస్తున్న దీప శిఖలా వారిని దాటి సాగిపోయింది.) అను ఉపమ ఇతని ఇందుమతి స్వయంవర వర్ణనములోనిది. లోక సామాన్యములైన విషయములను అత్యద్భుతమైన భావుకత చూపెట్టి సహృదయుల తల లూపింపజేయగల నిపుణత ఇతనికి దప్ప మరియే కవికిని లేదు.

కాళిదాసుడు వీరరసమును వర్ణించుచున్నపుడుకూడ ఎంతో సున్నితమైనఫక్కీలో రచన సల్పుననుటకు శాకుంతలములో మాతలి విదూషకుని కంఠమును మెలవేసినపుడు, అదృశ్యుడుగానున్న మాతలినిగూర్చి దుష్యంతునితో చెప్పించిన ఈ క్రిందిశ్లోకము వలన స్పష్టము కాగలదు.

'యో హనిష్యతి వధ్యం త్వాం రక్ష్యం
రక్షతి చ ద్విజం'
'హంసో హి క్షీరమాదత్తే తన్మిశ్రం వర్జయత్యాపః'

(హంస నీళ్లు కలసిన పాలలో నీటిని వదిలి పాలను తీసుకున్నట్లు, చంపదగిన వాడిని చంపేసి, రక్షించదగిన బ్రాహ్మణుణ్ణి నిన్ను రక్షిస్తుంది) అని దుష్యంతుడు బాణము వేయబోవును. ఉదాత్త గంభీర నాయకుల నాశ్రయించిన వీర రసమును కాళిదాసు వంటి మహాకవులు చిత్రించునపుడు ఇట్లు అత్యుదాత్తముగానే ఉండునుగదా.

కథా సరిత్సాగరములోని చిన్న కథా వస్తువును గైకొని కాళిదాసువిక్రమోర్వశీయ మను నాటకమును రచించెను. శాకుంతలములోవలెనే ఇందులోను, మాళవికాగ్నిమిత్రములోను దృశ్య ప్రబంధమునకు అనుగుణమైన రీతిలో కొలది మార్పులను కథలో చూపెను. ఊర్వశీ మాళవికల పాత్రలను ఈ మహాకవి తనబంగారు కలముతో చిత్రించి అపూర్వనాయికా వస్తువులను పాఠకులకు సమర్పించెను. ఊర్వశి సౌందర్యమును వర్ణించుచు

'అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూత్
చంద్రోనుకాంతి ప్రదః
శృంగారైకరసః స్వయంను మదనో,
మాసోహి పుష్పాకరః
వేదాభ్యాసజడః కథంనువిషయ వ్యావృత్త
కౌతూహలో,
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం
రూపం పురాణో మునిః'

(కాంతివంతుడైన చంద్రుడూ, శృంగార మూర్తి అయిన మన్మథుడూ, వసంతుడూ ఈమెను సృష్టించి వుండాలిగాని, వట్టి ఛాందసుడైన బ్రహ్మ బతుక్కి- ఇంత అందమయిన ఆకారాన్ని సృష్టించడం కూడానా?)

ఇంత మనోహరముగాను, సహృదయ రంజకముగాను ఒక దేవవేశ్యను వర్ణించుట కాళిదాసుకు తప్ప మరెవ్వరికి సాధ్యము?

కుమార సంభవములో :

'పదం సహేత భ్రమరస్య పేశలం,
శిరీష పుష్పం నపునః పతత్రిణః'

(దిరిసెన పువ్వు తుమ్మెదవాలితే ఆగ గలదుగాని, పక్షివాలితే నిలబడగలదా ?)

'సరత్నమన్విష్యతి మృగ్యతే హి తత్'
(రత్నాన్ని ఇతరులు వెతుక్కుంటూ వస్తారుగాని, రత్నం ఎవ్వరినీ వెతుక్కుంటూ వెళ్ళదు). ఇత్యాదికములైన కథనములచేత ఈ కవి పాఠకుల మనస్సును ద్రవింపజేసెను. శాకుంతలములో :

'స్నిగ్ధజన సంవిభక్తం హి దుఃఖం, సహ్యావేదనం భవతి' (స్నేహంగల జనం సానుభూతి చూపినప్పుడే ఎంత దుఃఖాన్నయినా భరించగలం) అను మాటచే అతి స్వాభావికమైన విషయమును ఎంతో సుందరముగ చెప్పెను. మైత్రీ లక్షణమును నిర్వచనము చేయుచు రఘు వంశములో:

'సమదుఃఖ సుఖః సఖీజనః' (దుఃఖాలనూ సుఖాలనూ సమంగా పంచుకొనే వాళ్లే సఖులంటే) అని చెప్పెను. ఇదే భావమును తెలుపుచు శాకుంతలములోను:

'పృష్టాజనేన సమదుఃఖ సుఖేన బాలా' (సుఖదుఃఖాల్ని సమంగా పంచుకొనే ఆజనం అడిగినప్పుడు...) అని చెప్పెను. దీనిచేత 'మిత్రుని సుఖదుఃఖములను సమానముగ పంచుకొను వాడేసరియైన మిత్రుడు' అని సన్మిత్రుని గుణమును ఎంతో చక్కగ వర్ణించెను.

ఈ మహాకవి పఠితలను శబ్దార్థముల ప్రపంచమునుండి ఒక అనిర్వచనీయమైన ఉన్నతస్థాయికి కొనిపోయి, సామాన్యవిషయములలోని ఒక అపూర్వమయిన రసానందములను అనుభవింప జేయుచు వ్యంగ్యార్థ డోలికలలో ఊగజేయును. ఈ శక్తి ఇతనికి దప్ప మఱే కవికిని లేదనినచో అసత్యము కాదు.

కావ్యములోకన్న నాటకములోగల విశిష్టతను చెప్పుచు కాళిదాసుడు :

"నాట్యం తు దేవైః నేత్రమయో యాగః" అనియు 'నాటకమే వివిధ అభిరుచులు గల జనములను ఆనందింపజేయు సాధనము' అనియుచెప్పెను. మాళవికాగ్ని మిత్రములో:

'భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం'

(వివిదాభిరుచులు గలవాళ్ళు కూడా దీనిని ఒకే విధంగా అభిమానిస్తారు) అని చెప్పెను.

ఈ కాళిదాసు కృతులలో అనంతములైన రచనా విశేషములు, అలంకార రచనలు, వ్యంగ్యభంగిమలు, రసభావాదుల చిత్రణము, ఉక్తివైచిత్రి మొదలగునవి అనేకములుకలవు. వాటినన్నింటిని మనము ఒక్కసారిగా తెలిసికొని ఆనందింపబూనుట కడు సాహసము. అతని కృతుల పఠనమునకు జీవితమంతయు వెచ్చించినను సమగ్రమైన సారస్యమును గ్రహింపజాలము. అతడు ఏదేశమువాడైనను, ఏ కాలమువాడైనను, ఏ జాతివాడైనను ప్రపంచ సాహిత్య వేత్తలకందరికి కడు పూజనీయుడు. అజరామర మయిన కావ్యచిత్రణముద్వారా తనకును, తనునుగన్న భరతమాతకును అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలను గడించి, వాటిని శాశ్వతముగా కావ్యదర్పణమున ప్రతిబింబింపజేసిన సుపుత్రుని గనిన భరతమాత ధన్యురాలు. అతడు మరణించినను జీవించినను సూర్యుని జ్యోతివలె నిత్యనూతనుడే. కనుకనే,

'కాళిదాస కవితా, నవం పయః,
మాహిషం దధి, సశర్కరం పయః,
ఏణ మాంసం, అబలా చ కోమలా
సంభవంతు మమ జన్మజన్మని'

(కాళిదాసుని కవిత్వం, గుమ్మపాలు, గేదె పెరుగు, పంచదార చేర్చిన పాలు, లేడి మాంసం, పడుచుపిల్ల, జన్మ జన్మలకీ కావాలనే నా కోరిక) అని ఒక రసిక శిరోమణి చెప్పిన సూక్తి అనుభవైకవేద్యము.

# కాళిదాసు రాజకీయ తత్వం

శ్రీ కారుమంచి

"పురాకవీనాం గణన ప్రసఙ్గే, కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా। అద్యాపి తత్తుల్య కవే రభావా, దనామికా సార్థవతీ బభూవ." మహాకవి కాళిదాసు పేరు చెప్పి చిటికెన వ్రేలు మడచిన తరువాత రెండవ పేరు దొరకనందున రెండవ వ్రేలికి "అనామిక" యని పేరువచ్చినట్లు ప్రతీతి కలదు. ఇట్టి ప్రఖ్యాతిని పొందిన మహాకవిని గురించి విచారించునప్పుడు ఆ కవికాలమును గురించి నిర్దుష్ట నిర్ణయము లేకుండా ఆలోచించుట అనాలోచిత మవుతుంది. ఆ కాలంలోని సామాజిక పరిస్థితులను అవగాహన చేసుకొనినప్పుడే ఆనాటి రచనయొక్క సార్థకత, విశిష్టత స్పష్ట మవుతుంది. కాలానికి సంబంధించని విషయాన్ని (సంఘ పరిస్థితులను) రచించితే ఆనాటి మానవ కళ్యాణానికి అది ఉపయోగించదు. కనుక "విశ్వశ్రేయః కావ్యం" అను సూత్రంతో ఆ రచన కావ్యమే కాకుండా పోతుంది. అందుచే ముందుగా కాలనిర్ణయం చేయడం భావ్య మవుతుంది.

మహాకవి కాలమును గురించి కవులు పండితులు మందసార శాసనాదికమునుబట్టి చేసిన నిర్ణయముతో ఏకీభవించుచూ, చరిత్రకారులలో పెక్కురు B.C. 56 వత్సర మనే నిర్ణయమునకు వచ్చియున్నారు. కాని కొందరు దానిని అంగీకరించక విభిన్నములయిన శతాబ్దములనే సూచించుచున్నారు. అందుచే ముందు మహాకవి ఏ ఆస్థానమునకు సంబంధించినవాడో, సమకాలికు లెవరో? ఏ రాజు పరిపాలనో? మొదలుగాగల విషయముల నాధారముగా చేసుకొనవలసి వస్తుంది. "ధన్వంతరి క్షపణ కామరసింహ శఙ్కు, భేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః; ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం, రత్నానివై వరరుచి ర్నవవిక్రమస్య." అను శ్లోకమువలన ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంఖుడు, భేతాళభట్టు, ఘటకర్పరుడు, కాళిదాసు, వరాహమిహిరుడు, వరరుచి, అను నీ తొమ్మిది మంది విక్రమార్క ఆస్థానములో "నవరత్నా"లనేపేర ఉన్నట్లు తెలియుచున్నది.

దీనివలన కాళిదాసు మహాకవి జ్యోతిష్యాచార్యుడయిన వరాహమిహిరాచార్యుని సమకాలికుడని స్పష్టమవుతుంది. కనుక మిహిరాచార్యుని ఆధారంగా తీసుకొని కాళిదాసుని కాలము పోల్చుకొనుట సులభము. అందుచేత ఆ మార్గమును అవలంబించుదాము.

శ్రీ మిహిరాచార్యులు జ్యోతిషమందు నూతనాధ్యాయమును ప్రారంభించినాడు. ఉజ్జయినిలోని ఖగోళశాస్త్ర పరిశోధనశాలలో అధ్యక్షపదవిని నిర్వహించినాడు. అశ్వని 'o' (gero) డిగ్రీలో ఆయన రేఖ ఉన్నప్పుడు అంతకుపూర్వం అనుసరిస్తున్న బార్హస్పత్య వత్సరమును రద్దుపరచి చాంద్రమాన వత్సరమును ఏర్పాటుచేశాడు. ఆ మార్పును స్థిరీకరించుచూ ఖగోళశాస్త్ర గణితమునకై విక్రమశకమును మహారాజయిన విక్రముని పేర ప్రారంభించినాడు. ఈ విషయము బృహత్సంహిత III వ అధ్యాయంలోని 1 వ శ్లోకాధారంతో తెలియుచున్నది. మనము ఈ ఆయన రేఖనాధారంగా లెక్కించిన శ్రీ విక్రమశకం ఆరంభించినది B.C. 58 వ సంవత్సరమని తేలుచున్నది. అందుచే మహాకవి కాళిదాసుని కాలము కూడా నదేనని నిస్సందేహముగా స్పష్టమవుతుంది :

ఆయనరేఖ భచక్రమును చుట్టుటకు 31680 సం॥
ఒకడిగ్రీకి–88 సం॥ సంవత్సరమునకు 40-10/11 విలిప్తలు
1955 ఏప్రియల్ వరకు ఆయనరేఖ $23°.13'38\frac{2}{11}''$లు
సూర్య చంద్రయానముల తేడా సం॥నకు 5 రో–20 ఘ॥
1955 ఏప్రియల్ వరకు విక్రమార్క శకవత్సరములు.

| | |
|---|---|
| | 2013-10-2 రో |
| క్రీస్తుశకం— | 1955- 4-0 |
| B.C.— | 58- 6-2 |

## సాంఘిక పరిస్థితులు

మహాకవికాలమైన B.C. 1 వ శతాబ్దములో కేంద్రీకృత రాజరికము, సాంఖ్యావాదములను ప్రబోధించుట ప్రధానమయింది. ఆనాటి సమాజ పరిస్థితిని పరిశీలించి యీ విషయాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోడానికి భారతజాతియొక్క ఆర్థిక రాజకీయ పరిణామమును ఆదినుండి ఒక్కసారి క్లుప్తంగా సమీక్షించు

కోవడం ఎంతేని అవసరం. అందుచే B.C. 1వ శతాబ్దం వరకు వచ్చిన పరిణామాన్ని పరిశీలించుదాము.

మధ్యాసియాలో నివసించుచున్న ఆర్యులలో కొందరు మృగశిరా నక్షత్రంలో ఆయనరేఖ యున్నప్పుడు అదితి యజ్ఞమునుచేసి 7000 సంవత్సరములకు పూర్వం వలస బయలుదేరారు. షుమారు 2 వేల సంవత్సరముల దీర్ఘ ప్రస్థానానంతరం కృత్తికా నక్షత్రంలో ఆయనరేఖ ఉండగా 5287 సంవత్సరములకు పూర్వం భారతదేశమును జేరారు.

పశువుల కాపరులై పచ్చికబయళ్లను వెదకుచూ వచ్చుచున్న ఆర్యులు సింధు మైదానములో ప్రవేసించారు. అప్పటికే బానిసలు, యజమానులుగా విభజింపబడిన ద్రావిడులు భారతదేశములో స్థిరనివాసమేర్పరుచుకొని యున్నారు. కత్తి, యీటె, గదలతో మాత్రమే వారు యుద్ధములు చేయుచుండేవారు.

గణసాంప్రదాయంతో ఐక్యతకలిగి విల్లు నంబులు, గుర్రములను వాడుచున్న ఆర్యులు ద్రావిడులను పరాజితులను జేశారు. తరువాత 800 సంవత్సరముల వరకు తండా జీవితమునే గడుపుచుండేవారు. ఇట్లాగే ఉత్తర భారతదేశమునంతా ఆక్రమించారు. ఆక్రమించి స్థిరనివాస మేర్పరుచుకోవడంలో చాలా గణములుగా చీలడం జరిగింది. అయినను గణజీవితమున కాకరమైన కేంద్రీకృత ప్రకృతిసంపదల సిద్ధాంతమునే అవలంబించి యుండేవారు.

స్థిరనివాసానంతరం వృత్తి విభాగములు వచ్చెను. వృత్తి విద్యలందు నిపుణత సంపాదించు నవకాశము లభించెను. ఆ వృత్తుల ననుసరించే వర్ణవిభాగము లేర్పడ్డాయి. ఆర్య ద్రావిడ యుద్ధములలో స్వాధీనమైన ఖైదీలను బానిసలుగా ఉపయోగించు చుండేవారు. ఈ సమయంలో వస్తూత్పత్తి, వ్యవసాయం, వృత్తి నిపుణత అభివృద్ధి చెందాయి.

ఇదేకాలంలో ఉత్తర భారతదేశంనుండి దక్షిణాదిపై దండయాత్రలు చేయుట జరిగింది. బ్రాహ్మణులు (మతాధిపతులు), క్షత్రియులు (యుద్ధవీరులు) మధ్య అధికార మార్పిడికోసరం పోరాటాలు జరుగుచుండేవి. పూర్వం విశ్వామిత్రుడను క్షత్రియుడు పీఠాధిపతియైన వశిష్ఠునితో కామధేను అను ఆవుకై యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో వశిష్ఠుని మంత్రశక్తి (Misticism) ముందు విశ్వామిత్రుని భుజబలం ఓడిపోయింది. విశ్వామిత్రుడుకూడా మంత్రశక్తిని సంపాదించడంకోసరం ఒక పీఠమును స్థాపించి కృషిచేయడం జరిగింది. పరశురాముడు క్షత్రియులపైని కోపంతో తన గండ్రగొడ్డలినిబూని ఇరువదియొక్కమారులు భారతదేశములోని క్షత్రియుల వధించడం జరిగింది. ఈ చంపటంలో 'మాలో పౌరుషంలేద'ని లొంగిడినవారిని క్షమించడం జరిగింది. రామాయణకాలంలో యువకుడైన రామునిద్వారా క్షత్రియ పీఠమయిన విశ్వామిత్ర పీఠం తాము సంపాదించిన మంత్రశక్తిని రామునికిచ్చి రాముని బలపరాక్రమములకు జోడీకరించి బ్రాహ్మణ పీఠములకు ప్రతినిధియయిన పరశురాముని ఓడించడం జరిగింది. అంతవరకు బ్రాహ్మణులనోట చలాయించబడుచున్న అధికారం క్షత్రియుల చేతికి వచ్చిచేరింది. ఆచరణలో ఓడింపబడినను బ్రాహ్మణ, క్షత్రియులిద్దరు రాజీపడి కలసి అధికారము సాగించారు.

అందుచే భారతచరిత్రవద్దకు వచ్చునప్పటికి ద్రోణుడు ద్రుపదునిచేత పరాభవింపబడినను పరశురామునిలా యుద్ధమునకు దిగలేదు. సమయమునకై వేచియుండి తన శిష్యుడైన అర్జునునిచేత పట్టించి కట్టించి తెప్పించి తన పగను సాధించాడు.

దాదాపు 3500 ల సంవత్సరముల ప్రాంతమున ప్రకృతి సంపదను విభజించుకొను హక్కుకొరకు మహాభారతయుద్ధము జరిగినది. మహాభారత కథలో శంతనుని ద్వితీయ వివాహమునకై కుమారుడైన గాంగేయుడు దాశరాజును సత్యవతి నిమ్మని కోరాడు. దాశరాజు తన కూతునకు పుట్టబోవు సంతానమునకు రాజ్య పట్టాభిషేకం కావాలని కోరుతాడు. అందుకు దేవవ్రతుడు అంగీకరించాడు. కాని, నీవు అంగీకరించినంత మాత్రం చాలదు. నీకు కలుగు సంతతి అధికారు లవుతారు. కనుక నీవు బ్రహ్మచారిగా ఉండాలని కోరుతాడు. అలా ఆచరిస్తానని ప్రతిజ్ఞచేయడంతో భీష్ముడయ్యాడు గాంగేయుడు. ఇందువల్ల అప్పటివరకు ఆచరణలో నున్న కేంద్రీకృత ప్రకృతిసంపదల ఆర్థిక విధానముయొక్క మూలధర్మము పెద్దవాని పెద్దకొడుకు ఆర్థికసంపదపై స్థిరమైన పెత్తందారన్న విషయం స్పష్టమవుతూంది. ఇందువల్లనే పాండవులు దాయపాలనే విభజన హక్కుకోసమై పెద్దవాని పెద్దకొడుకైన సుయోధనునిపై యుద్ధం చేయడం జరిగింది. ఆ యుద్ధంలో కౌరవ పోషణలోనుండి కౌరవపక్షముననే యుద్ధరంగమున నున్న భీష్ముడు పాండవ పక్షపాతియగుట కనిపించుతుంది. అవిభక్త సంపదల ఆర్థికవిధానంతో జీవితం సర్వం నాశనం కావింపబడిన భీష్ముడు న్యాయశాస్త్రకోవిదుడైనను పాతవిధానాన్ని నిరసించి క్రొత్తవిధానానికి చేయూత

నిర్వేదం జరిగింది. ఇందువల్లనే భారత మహాసంగ్రామంలో పీడితజన పక్షమయిన పాండవులు విజయాన్ని సాధించారు. ఈ విప్లవానంతరం ప్రకృతిసంపదలను విభజించుకొను హక్కు ఏర్పడింది. మహాకవి వాల్మీకిన్ని కేంద్రీకృత ప్రకృతిసంపదలకు చిహ్నంగా తీసుకొన బడిన సూర్యుని వదలి ఆ సూర్యునినుండి తనకు కావలసిన వెలుగును భాగలు భాగలుగా గ్రహించునట్టి చంద్రుని తన కథానాయక వంశానికి మూలపురుషునిగా స్వీకరించాడు మహాకవి వ్యాసుడు.

ప్రకృతి సంపద విభక్తమగుటతో వ్యక్తి సంపద ఆచారములోనికి వచ్చింది. అందువలన భూస్వామ్య విధానము బానిస విధానములు పరిపూర్ణమయిన స్థాయికి చేరుకొన్నాయి వ్యష్టి ఆర్థిక విధానంతో ఆర్థికాన్నత్యపు పోటీలలో వస్తూత్పత్తి అధికమయింది. వస్తు మార్పిడితో వ్యాపారం ప్రారంభమైంది. వ్యాపారుల వర్గం ఏర్పడింది.

దీనితో అధికారం తగ్గినా అధికావకాశాలతో జీవిస్తూ మతాధిపత్యం వహిస్తున్నవారికి అవకాశాలు తగ్గటం ప్రారంభించింది. వ్యాపారం పెరగటంచేత ధనికులకు అవకాశాలు అధికమయ్యాయి. అందుచే మేధావి వర్గమయిన బ్రాహ్మణులు అంతవరకూ క్రియలనుండి ఉత్పన్నము చెందిన నామవాచకములకు (Gerund) స్వరూపములను కల్పించి వ్యక్తులను చేయడం ప్రారంభించారు.

“చాతుర్వర్ణ్యం మయాసృష్టం, గుణకర్మ విభాగశః” అని భారతంలో వివరించిన వర్ణ సిద్ధాంతమునకు తిలోదకాలిచ్చారు. వర్ణములు జన్మతో సిద్ధించునటుల “జన్మనే జాయతే విప్రః, కర్మణే జాయతే ద్విజః” అని చిత్రించి తమ ఉనికిని స్థిరపరచుకో గోరారు. అందుకే పౌరాణిక గాథలను రచించి అందులో పూర్వ ఆదర్శములకు సమాధికట్టేరు. ప్రకృతి వర్ణనలకు రూపములను కల్పించి విగ్రహాలుగా మలచి విగ్రహారాధన నెలకొల్పారు. మూఢ నమ్మకాల కాకరమైన భక్తి విధానాన్ని స్థాపించారు. వీటికితోడు “అరణ్యకాలు” మొదలుగాగల వేదాంతం ప్రబలి సంఘమునకు దూరమై అడవికిపోయి తపస్సుచేసి అతీతమైన శక్తులను సంపాదించడమనే విధానమును గొప్పదానినిగా సృష్టించారు. సమిష్టినుండి వ్యష్టి, దానినుండి వ్యక్తి ఘనత, దానితో వ్యక్తి ఆరాధనలను నెలకొల్పారు. ఈ విధంగా అంతవరకూ వచ్చుచున్న సాంఘిక ఆర్థిక మానసిక విషయాల నన్నింటిని స్వార్థ దృష్టితో మలచటం జరిగింది.

ఈవిధంగా సమాజం వ్యక్తిస్వార్థంవైపు ప్రయాణం చేయడం. వ్యక్తి స్వార్థంకోసరం సమాజాన్ని బలిపెట్టడం జరుగసాగింది. వ్యాపారం, వ్యవసాయాలు అభివృద్ధిచెందడంతో బానిసలను కొనుట, వారిని భరించుటకన్న కూలీల నేర్పరుచుకోవడం లాభదాయకమైంది. అందువలన బానిస విధానాలకు వ్యతిరేకమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ సమయంలోనే అనేకమయి చిన్న చిన్నవిగానున్న రాజ్యాలు వారిలోవారికి జరుగుచున్న యుద్ధాలవల్ల చేతులుమారడం జరుగుతూంది. దానితో ఆర్థిక అస్థిరత్వం ఏర్పడింది.

ఈ పరిస్థితులలో బానిసవిధానాన్ని, వర్ణవిభేదాలను యుద్ధాలను, సంఘంనుండి విడివడి అరణ్యాలకు పోవడాన్ని, రాజుల భోగలాలసతను, వ్యతిరేకిస్తూ 2500 సంవత్సరాలకుపూర్వం బౌద్ధం వచ్చింది. బానిస లుండరాదనీ, వర్ణవిభేదములు కల్పితములనీ, జీవహింస పనికిరాదనీ, యుద్ధములు జీవహింసాత్మకములు గనుక వాటిని చేయరాదనీ, అరణ్యాలకు పోవడంవలన మానవత్వానికి సిద్ధించున దేమీలేదనీ, మానవుడు సంఘ సేవ చేయడమే పరమోత్కృష్టమని, సంఘ సేవకు సౌఖ్యాలు బంధనాలు గనుక త్యజించాలనీ, కష్టాల కన్నింటికీ మూలం కోర్కె గనుక కోర్కెలను విడిచిపెట్టాలనీ, ప్రచారం జరుగుతుండేది. దీనితో సంఘంలో చాలామార్పు వచ్చింది. అన్ని వర్ణ వర్గాల ప్రజలకు సంఘారామాలలో చోటు దొరికింది. బౌద్ధప్రచారంతో అప్పటికి అందలంపై తిష్టవేసియున్న బ్రాహ్మణవర్గం బలహీన పడింది. దానితో తరువాత పై వర్గాలవారైన రాజులు, వ్యాపారస్థులకుమాత్రం నెత్తిన బరువు దింపినట్లయింది. కాని అట్టడుగున కష్టాల ననుభవిస్తున్న బానిసలకు వారి బానిసత్వం అర్ధబానిస విధానంగా మారింది. ఆర్థిక విధానంలో సమానత్వంలేక అసమానత్వం తిష్ట వేయడంవల్ల వారి జీవితం ఆర్థికంగా బాగుపడలేదు. ఆర్థిక పుష్టిలేని కారణాన అగచాట్లు అట్లాగే అంటిపెట్టుకొని కూర్చున్నాయి. సంఘంలోమాత్రం సౌందర్య విముఖత ప్రబలింది. ఈ తరుణంలో దేశంలోని రాజులలో కొందరు యుద్ధ విముఖులైనారు. గ్రీసు, పరాసులు మొదలైన యితరజాతుల దండయాత్రలు తటస్థించాయి. మనదేశంలోని బలహీన రాజరికాలు తట్టుకోలేకపోయాయి. ఈ పరిస్థితులను అధిగమించి భారత రాజరికం నిలువాలంటే కేంద్రీకృత రాజరికం కావలసివచ్చింది.

బౌద్ధంలోని సౌందర్య విముఖతకు వ్యతిరేకంగా సూక్ష్మమైన ప్రకృతి ప్రపంచమున కంతా మూలమయి

నది. ఆ ప్రకృతి జడపదార్థము. పురుషుడు జీవము. పురుషుడు ప్రకృతికి చలనం కలిగిస్తాడు. చలనం కలిగించినప్పుడు ప్రపంచోత్పత్తి . ప్రారంభమవుతుంది. సకలమునకు జడజీవుల సంయోగమే మూలమంటూ సిద్ధాంతీకరించుతున్న "సాంఖ్యవాదం" ఒక రూపమును ధరించటం ప్రారంభించింది.

ఈవిధంగా వర్ణవర్గ విభేదాలతో పౌ రా ణి క యుగంగా రూపొంది మానవులను సమాజ దూరులగా జేసి అరణ్యాలవైపు ప్రయాణానికి బాటలువైచిన బ్రాహ్మణ సిద్ధాంతము; యుద్ధ వ్యతిరేకత, జీవహింసలను ప్రబోధించి, కత్తిపుస్తిని చంపి, శృంగార విముఖతతో వైరాగ్య ప్రవృత్తిని పురిగొల్పుతున్న బౌద్ధములతో సంఘం సతమతమగుచున్న కాలం. ఈ కాలంలో కేంద్రీకృత రాజరికమును, సాంఖ్యవాదమును స్వీకరించి విజయమును సాధించినవాడు మహాకవి కాళిదాసు.

ఈ పరిస్థితులను ఆధారం చేసుకొని మనం కాళిదాస కృతకావ్యాలను పరిశీలించుదాము.

## రఘువంశం

కేంద్రీకృత రాజరిక ప్రతిపాదనకై ప్రథమ కావ్యమైన రఘువంశం ప్రారంభించాడు. తాను చెప్పదలచిన నూతన విషయాన్ని పాతలోనే మలచినట్లయిన ప్రజలలో పాతుకుపోవడానికి సుకరమౌతుందని భావించాడు. పూర్వనుండి సాంప్రదాయంగా వచ్చుచున్న రాజవంశములు రెండు. ఒకటి సూర్యవంశము. రెండవది చంద్రవంశం. సూర్యవంశమును మహాకవి వాల్మీకి కేంద్రీకృత ప్రకృతిసంపదల సిద్ధాంతమును బలపరుచుకొనుటకు వాడుకొనినాడు. మహాకవి వ్యాసుడు చంద్రవంశమును విభక్త ప్రకృతిసంపదల సిద్ధాంతమును బలపర్చుకొనుటకు వాడుకొనినాడు. తాను రూపొందించదలచినది కేంద్రీకృత రాజరికము కనుక సూర్యవంశమునే తానూ స్వీకరించాడు; వాల్మీకి రామాయణ గాథలో వ్యవసాయారంభమునకు ప్రాముఖ్యత నిచ్చుటకై మేఘవర్ణుడైన రాముని పేర "రామాయణం" అన్నాడు. తానూ అదే కథను స్వీకరించినా కేంద్రీకృత రాజరికమును ప్రతిపాదించుటకొరకు రాజరికమునకు ప్రాముఖ్యము నిచ్చుటకై రాజవంశ ముఖ్యుడైన రఘు మహారాజు పేర "రఘువంశం" అని తన కావ్యమునకు నామకరణం చేశాడు మహాకవి కాళిదాసు.

తానూ సూర్యవంశమునే ఆధారంగా ఎన్నుకొన్నా—
"అథవాకృత వాగ్ద్వారే, వంశేస్మిన్ పూర్వ సూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే, సూత్రస్యేవాస్తిమే గతిః"

తనకంటే పూర్వులయిన పండితులచేత చెప్పబడి తొలుచబడినమణులవలె ప్రకాశించుచున్న విషయాలను (హారములుగా కూర్చుటకు) తనకు దారమువంటి గతియున్నదని తన అభిప్రాయమును ధ్వనించునట్లు అతి సున్నితంగా చెప్పుకున్నాడు.

రామాయణగాథ ఒక కల్పంలో జరిగిన కథ. కల్ప మనగా ఒక సంవత్సరమని అర్థం. అందుచే తానూ సంవత్సరములోని సూర్యుకి ఆరు ఋతువులు కల్గియున్నందున తన కావ్యకథలోనూ సూర్యవంశజులైన ఆగ్గురి రాజుల చరిత్రలనే రచించినాడు.

"యాతిక్షితీశో నవతిం నవాధికాం,
మహాక్రతూనాం మహనీయ శాసనః"

అని దిలీపమహారాజును తొంబదితొమ్మిది ఉత్కృష్టమయిన అశ్వమేధ యజ్ఞములు చేసెననియు ఆ రాజు నూరు యజ్ఞములు చేసినను ఇంద్రునివలన నూరవ యజ్ఞము ఫలము నిచ్చెడిదయినను లెక్కకుమాత్రం రాలేదనియు వర్ణించినాడు.

"నిర్వృష్టలఘు భిర్మేఘైర్ముక్తవర్త్మా దుస్సహః
ప్రతాపస్తస్య భానోశ్చయుగపద్వ్యా నశేదిశః".

సంపూర్ణముగా వర్ణించినతరవాత శరదృతువులో మేఘములు అడ్డులేకుండా సూర్యుని ఎండ దిక్కులెల్ల వ్యాపించెను. భూమి ఎండి దారి చక్కబడగా నిరాఘాటముగా (దిలీపుని కుమారుడైన రఘుమహారాజు దిగ్విజయ యాత్రకు) వెడలెను. ఇందులో శరత్ సూర్యుని సహాయంతో రాజు దిగ్విజయ యాత్రను ప్రారంభించాడు. ఈ దిగ్విజయ యాత్రలో కవి తన కాలంలో తన మాతృభూమిపై దాడి సల్పుచున్న పరాయి దేశమైన పారశీకమునుగూడా కలిపినాడు.

"పారశీకాంస్తతో జేతుం, ప్రతస్థేస్థలవర్త్మనా;
ఇంద్రియాఖ్యానివ రిపూం, స్తత్త్వజ్ఞానేన సంయమి."

యోగి ఇంద్రియములను ఆత్మజ్ఞానముచే జయించినట్లు పారశీక రాజులను జయించువాడై నేల దారిని బయలుదేరెను. ఈ విధముగా వెడలిన ఆ రఘుమహారాజు,

"భల్లాప వర్జితై స్తేషాం, శిరోభిః శ్మశ్రులై ర్మహీం
తస్తారస రఘూ వ్యాప్తైః, సక్షౌద్ర పటలైరివ"

గడ్డములు మీసములు దట్టముగా పెరిగి తేనెటీగలు ముసరిని తేనెపట్లవలెనున్న ఆ పారశీక రౌతుల తలలను బల్లెములతో తెగవేసెను. శిరములు నేలపై బడుటచే ఆ ప్రదేశమున నేల కాన్పించకుండెను.

అనుచు ప్రకృతము దండయాత్రలు చేయుచున్న పారశీకులనుగూడా రఘుమహారాజు జయించినట్లు

వర్ణించి, నేడు వారిని పారద్రోలవలసిన అవసరమును వ్యక్తపరచి ప్రబోధించినాడు.

ఈ విధముగా అగ్గరు రాజులచేత అశ్వమేధ యాగములో, దిగ్విజయ యాత్రలో చేయించడమూ, వారు భరతఖండమునంతను ఏకచ్ఛత్రాధిపత్యంతో పరిపాలించుట స్పష్టంగా వర్ణించినాడు.

"సరాజ్యం గురుణాదత్తం, ప్రతిపద్యాధికం బభౌ,
దినాంతే నిహితం తేజః, సవిత్రేవ హుతాశనః".

సాయం సూర్యుని తేజస్సును అగ్ని స్వీకరించినట్లు తండ్రి సింహాసనమును తనయుడు స్వీకరించాడు. అని పట్టాభిషేకమును వర్ణించాడు. ఈ విధంగా సూర్యాంశను ప్రతిరాజునందును ప్రతిపాదించాడు.

అప్పటికే రాజరికం ఛిన్నాభిన్నమై రాజులలో సోమరితనం, ధన దుర్వినియోగం ప్రబలింది.

"ప్రజానా మేవ భూత్యర్థం,
సతాభ్యో బల మగ్రహీత్,
సహస్రగుణ ముత్స్రష్టు,
మాదత్తే హి రసం రవిః".

వేయిరెట్లుగా మంచిని కలుగజేయుటకు సూర్యుడు నీళ్ళను తీసుకొనునట్లు, రాజు ప్రజలనుండి పన్నులను తీసుకొనవలయునని చెప్పుతాడు. ప్రజలకు మేలు చేయడమే రాజుయొక్క ప్రధాన ధర్మమని చెప్పుతాడు.

"స విశ్వజిత మాజహ్రే, యజ్ఞం సర్వస్వ దక్షిణమ్,
ఆదానం హి విసర్గాయ, సతాం వారిముచామివ".

రఘుమహారాజు సర్వధనమును దక్షిణగాగల విశ్వజిత్తను యాగమును జేసెను. సాధువులు ధనమార్జించుట సత్పాత్రమునకిచ్చుటకే గదా!

"స మృణ్మయే వీత హిరణ్మయత్వాత్,
పాత్రే నిధాయార్ఘ్య మనర్ఘశీలః,
శ్రుత ప్రకాశం యశసా ప్రకాశః,
ప్రత్యుజ్జగామా తిధి మాతిథేయః".

చాలా దొడ్డస్వభావముగలిగి కీర్తిచే వెలుగుచూ, అతిథి పూజాపరాయణుడైన ఆ రఘు మహా రాజు బంగారు పాత్రలన్నియు దత్తము లయిపోయినందున మట్టిపాత్రలో పూజాద్రవ్యములుంచుకొని అభ్యాగతునికి ఆతిథ్యమిచ్చుటకై ఎదురుగా వెళ్ళెను. అని రాజు తన ధనధాన్యములు తాను అనుభవించుటకై దాచి భోగలాలసుడు కాకూడదని, రాజ్యములోని ప్రజలకు పంచి తాను నిరాడంబర జీవియై జీవితము గడుపవలెనని, యీ విధముగా చేయుట రాజుయొక్క ముఖ్య కర్తవ్యమని ప్రబోధించుతాడు.

"ఉపమా కాళిదాసస్య" అని ఉపమాలంకార ప్రయోగంలో సాటిలేని మేటిగా నిరూపించారు పూర్వ పండితులు. కాళిదాస కవి "వాగర్థావివ" వంటి ఉపమానములు పరిపూర్ణమయి యుండుట జగద్విదితం. ఇక నాకుమాత్రం అంతకన్నా యింకేమి దొరుకుతుంది. అయినా అశేష ప్రజ్ఞావంతుడైన మహాకవి కావ్యంలో ఉపమలతోనే ఊరడిల్లుట అసంగత మనుకుంటూ, "కవి సంసారే కాళిదాసాదయః ద్విత్రాః పంచవా మహాకవయః గణ్యంతే" అన్నాడు ఆనందవర్ధనుడు. "కావ్య స్యాత్మా ధ్వనిః" అనుటచే చాలా ప్రతిభా సంపన్నమైనధ్వని మహాకవి కావ్యములందు కన్పించును గదా!

"యత్రార్థః శబ్దోహితమర్థ ముపసర్జనీ కృతస్వార్థే
వ్యక్తః కావ్యవిశేషః సధ్వని రితి సూరిభిః కథితః"
అన్నారు పెద్దలు.

"తవ మన్త్రకృతో మన్త్రైః, దూరాత్ ప్రశమితారిభిః
ప్రత్యాదిశ్యంత ఇవమే, దృష్టలక్ష్యభిదః శరాః".

పరోక్షమందే శత్రువుల కూల్చగల్గిన మంత్రములను కనిపెట్టగలిగిన నీ ప్రోవల, కన్పించు లక్ష్యములను కొట్టగలిగిన మా బాణములశక్తి నిష్ఫలములేకదా యని దిలీపుడు వశిష్టమహామునిని ప్రార్థిస్తాడు. మంత్రశక్తి ముందు భుజశక్తి నిష్ఫలమనుటలో పూర్వం క్షత్రియుడయిన విశ్వామిత్రుడు యుద్ధముచేసి మంత్రశక్తి ముందు ఓడిపోవడం స్పష్టంగా ధ్వనించుతుంది.

"కాఽప్యభిఖ్యాతయోరాసీత్, వ్రజతో శుద్ధవేషయోః,
హిమ నిర్ముక్తయో ర్యోగే, చిత్రా చంద్రమసో రివ".

శుద్ధమయిన అలంకార విభూషితులయి ఆ సుదక్షిణా దిలీపులు మంచుసుండి విముక్తమయిన చిత్తాచంద్రుల వలె ప్రకాశముకలిగి యొప్పుచున్నారు. ఇది తాత్పర్యార్థం. ఇందులో స్త్రీ యయిన సుదక్షిణాదేవిని చిత్తతోను, రాజును చంద్రునితోను పోల్చుట ఉపమ. సంతాన కారకుడయిన శుక్రుని గృహమైన తులా రాశిలో ఉన్న చిత్తా జంద్రులతో పోల్చుటవలన వారు సంతానార్థమై పోవుచున్నారు. కనుక వారికోర్కె ఫలప్రదమగునని సూచించడం జరుగుతుంది. అంతే అయితే-

"కళత్రవన్త మాత్మాన, మవరోధే మహత్యపి;
తయా మేనే మనస్విన్యా, లక్ష్మ్యా చ వసుధాధిపః."

ఎందరు అంతఃపుర స్త్రీలున్నను మంచి మనస్సుగలదై సుదక్షిణాదేవి చేతను రాజ్యలక్ష్మి చేతను తను భార్య

గలవానిగా రాజు తలచెను. అని వారి అన్యోన్యతను గూర్చి వివరించిన కాళిదాసు, చంద్రునికి యనుంగు భార్యయని చెప్పబడుచున్న రోహిణినే స్వీకరించును కదా? రోహిణీ నక్షత్రంకూడా శుక్రగృహస్థితమైనదే కదా? అధికముగా జంద్రుడు వుచ్చయందున్నవాడగును కదా? అందుచే యింతకన్న "రోహిణీచంద్రమసో రివ" యనుట అన్ని విధాలా ఉత్తమముగదా? కాళిదాసుని పరిపూర్ణతకు సరిపడియుండును గదా? ఇందుకు చిత్తాధి దేవత అదితి కనుక అదితి కశ్యపులు దేవతలకు మాతాపితరులు కనుక వారిని స్ఫురింపజేయుటకని సమాధానము వచ్చుచున్నది. అట్లైన చిత్తతో కూడి చంద్రునకు ఎప్పుడూ యీ వ్యాఖ్య సరిపడును గదా! అట్టి స్థితిలో "హిమ నిర్ముక్తయోః" అని ముందు ప్రయోగించి మాసమును సూచించుటేల? ఇందువలను శిశిరాంతమున మంచుపోవును గనుక తరువాత నెలయైన చైత్రమాసములో చిత్తతోగూడిన చంద్రుడనుచున్నాడు. అలాయైన ఆ చంద్రుడు పౌర్ణమీ చంద్రుడు. ఈవిధముగా మాసమును సూచించి పౌర్ణమీ చంద్రునిగా చేయుటతో చంద్రునకు సూర్యుని యాధారముతో కాంతి వచ్చుచుండుటచే సూర్యునిచే భరింపబడినదై పురుషత్వముపోయి స్త్రీత్వము ఆపాదింపబడుచున్నది. చంద్రసూర్యులు క్షత్రియదంపతులనుట శాస్త్రసమ్మతం గదా? చిత్తా చంద్రుడనుటతో అదితి యింటనున్న చంద్రుడనుట. అదితి పుత్రుడగుట చేతనే సూర్యుడు ఆదిత్యుడని కదా? అందుచే అత్తింటనున్న కోడ లగుచున్నది. అట్టి చంద్రునితో సుదక్షిణాదేవిని బోల్చుటతో రాజునుఉచ్చలోనున్న సూర్యునితో బోల్చుట సంభవించుచున్నది. ఈ రెండు గ్రహములు సమసప్తకముల నుండుట జరుగుచున్నది. కుజ శుక్రులు సంతాన కారకులు. అట్టి కుజ శుక్రుల యింట సూర్యచంద్రులు ఉండటంజరుగుతుంది. దీనికితోడు కుజ శుక్రచంద్రులపై గురువీక్షణము సోకినప్పుడు జరుగు సంయోగము వలన గర్భధారణ జరుగునని జ్యోతిషములో నిషెకాయధ్యాయమువలన స్పష్టమగుచున్నదిగదా? కుజుని యింటనున్న ఉచ్చసూర్యునివంటి రాజు, శుక్ర గృహమునన్న పూర్ణచంద్రునివంటి సుదక్షిణాదేవి కలసి గురువీక్షణకై గురువైన వశిష్టముని ఆశ్రమమునకు పోవుట జరుగుచున్నది. "హిమ నిర్ముక్తయోః" అని శబ్దప్రయోగముచే వాచ్యముకాని ప్రతీయమాన ధ్వనిని ప్రసాదించాడు మహాకవి. ఈ విధంగా మహాకవి కావ్యాలలోని ధ్వని విశేషాలను వివరిస్తూ పోతుంటే ఎంతయినా దొరుకుతుంది. అనంతం గదా? అయినా ఎంతకాలానికి తెమిలేట్టు "మాఘే మేఘే గతం వయః" అన్నాడు పండితుడైన మల్లినాథ సూరి.

తాటకవధను వర్ణిస్తూ మహాకవి వాల్మీకి బీభత్స రసాన్ని స్వీకరించాడు. మరి మహాకవి ఆ విషయాన్ని వర్ణిస్తూ:

"రామ మన్మథ శరేణ తాడితా,
దుస్సహేన హృదయే నిశాచరీ,
గంధవద్రుధిర చందనోక్షితా,
జీవితేశ వసతిం జగామ సా".

రాముడనే మన్మథుని బాణముయొక్క తాపుతో భరింపనలవిగాని బాధాసహిత హృదయంతో రాక్షసి వాసనతోకూడిన రక్తగంధముల నలముకొనినదై భర్తయొక్క వసతికి పోయెను అని వర్ణించాడు. శృంగార, బీభత్సరసములు ఒకదానికి ఒకటి విరోధమును రసకారుల గోలను లెక్కచేయక కవి నిరంకుశుడంటూ నిరూపించడానికా యన్నట్లు, చిత్రకారుడు రంగుల మిశ్రమంతో వింతకాంతులను సృష్టించినట్లు చచ్చిపోవుచున్న తాటకిని తనకింటెముందు చచ్చిన భర్త వద్దకు పోయి పునస్సమాగమును బొందినట్లు వర్ణించడములో విభిన్నములైన బీభత్స, శృంగారరసముల మేళవింపుతో నూతనశోభలను సిద్ధింపజేశారు భాషా సరస్వతికి మహాకవి.

ఇక శబ్ద విషయంలో సర్కసులు కనిపించవు. ఎప్పటైనా:

"తతో మృగేంద్రస్య మృగేంద్రగామీ,
వధాయ వధ్యస్య శరం శరణ్యః."

ఈ విధమైన శబ్దాలంకారాన్ని కాలముయొక్క అవ్యవధిని చూపించుటకే వాడినాడు. అందుచే శబ్దాల పిల్లిమొగ్గలతో వళ్ళు హూనం కాకుండా సున్నితంగా గంభీర భావార్ణవంలోని అట్టడుగు ఆణిముత్యాల నేర్చి కూర్చాడు.

ఈ విధముగా కేంద్రీకృత రాజరిక వాదమును రఘువంశ కావ్యరచనతో నాటి భారత రాజకీయముల యందు మహాకవి కాళిదాసు ప్రతిపాదించాడు.

## కుమార సంభవము

బౌద్ధములోని వైరాగ్య ప్రచారంతో విజృంభించి శృంగార విముఖతను ఖండించుటకై సాంఖ్యవాదమును స్వీకరించాడు మహాకవి. తన రెండవ కావ్యమునకు

సంయోగఫలితమైన వుత్పత్తిని కావ్యవస్తువుగా స్వీకరించి దానికి "కుమారసంభవం" అని పేరు పెట్టినాడు.

ఇందులో సాంఖ్యవాద మూలసూత్రములయిన ప్రకృతీ పురుషుల సంయోగమును ఆధారం చేసుకొని ప్రపంచ నిర్మాణానికి మూలమైన కణము (cell) జీవ జడముల ఏకరూపమై అంతర్గత సంయోగమువలన ఉత్పత్తిని సాగించుతుందనుట స్పష్టము కనుక, ఒకే శరీరములో కుడి ఎడమల పురుష స్త్రీరూపములలో వున్నట్లు వర్ణించబడిన శివపార్వతులను ఒకే కణములోని పురుష ప్రకృతులకు చిహ్నముగా స్వీకరించి వారిని ఈ కావ్యంలో ప్రధాన పాత్రలుగా చేశాడు. కణము తన చలనము మానినప్పుడు ప్రపంచము స్తంభించుట ప్రకృతిశాస్త్ర సమ్మతము గదా ? అందువలన పురుషుడు :

"అవృష్టి సంరంభ మివాంబు వాహం,
అపామివాధార మను త్తరంగం;
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా,
న్నివాత నిష్కంప మివ ప్రదీపం."

ఉచ్ఛ్వాస నిశ్వాసరహితమై వర్ష సంరంభములేని మేఘమువలెను, అలలులేని నీటిమడుగువలెను, గాలిలేని తావునఉన్న దీపమువలెను, ఉండి పురుషుడు ప్రకృతిని స్వీకరించనప్పుడు ప్రపంచగమనానికి అడ్డంకులు గలుగుతాయనీ, ఆ అడ్డంకులకే తారకాసురుడని నామకరణము చేశాడు.

శివుడు పైన వర్ణించిన రీతిగా చలనరహితుడై, వైరాగ్యమూని తపస్సనే సమాధిలో నుండగా తారకాసురుడు విజృంభించాడు.

"తస్మిన్ విప్రకృతాః కాలే, తారకేన దివౌకసః;
తురాసాహం పురోధాయ, ధామస్వాయం
భువం యయుః"

ఈశ్వరునికి పార్వతి సేవచేయు కాలముననే తారకాసురునిచే ఓడింపబడి, పీడింపబడుచున్న దేవతలు ఇంద్రుని నాయకత్వమున సత్యలోకమునకు బోయిరి. పురుషునినుండి విడివడిన ప్రకృతి మరల ప్రకృతిని సమీపించటం అననుగా భావించి అడ్డంకిని అధిగమించ గోరింది లోకం.

ఈ విధంగా సత్యలోకములో నివసించుచున్న బ్రహ్మవద్దకు పోయిన దేవతల తరపున బృహస్పతి బ్రహ్మతో :

"పురాతావంత మేవాస్య, తనోతి రవిరాతపః
దీర్ఘికా కమలోన్మేషో యావన్ మాత్రేన సాధ్యతే."

సూర్యుడు భయముచేత తారకాసురుని పట్టణమందు గల బావులు మన్నగువాని యందలి పద్మములు వికసించుట కెంత వేడిమి కావలయునో అంత వేడిమిని మాత్రమే కలగించుచున్నాడు.

"సర్వాభి స్సర్వదా చంద్ర స్తం కళాభి ర్నిషేవతే,
నాదత్తే కేవలాం లేఖాం, హర చూడామణీ కృతాం."

ఎల్ల వేళలయందును ఈశ్వరుని తలసిగ పువ్వుగా వుండబడిన ఒక కళను మాత్రం విడిచి మిగిలిన పదిహేను కళలలోనూ పూర్ణ చంద్రుడై ప్రకాశించుచున్నాడు.

"వ్యావృత్త గతి రుద్యానే,కుసుమ స్తేయ సాధ్వసాత్
నవాతి వాయు స్తత్పార్శ్వే తాళవృంతానిలాధికం."

ఉద్యాన వనములోని పుష్పములు తన గాలితాకుడు వలన రాలినట్లైన పుష్పములు దొంగిలించినవాడ నగుదుననెడి భయముచే వాయువు ఉద్యానవనవాటికల సంచారము లేనివాడై చుట్టుపట్ల విసనకర్రలతో విసురునప్పుడు వచ్చు గాలికంటే అధికముగా వీచడు.

"పర్యాయ సేవా ముత్సృజ్య,
పుష్ప సంభార తత్పరాః;
ఉద్యానపాల సామాన్యం,
ఋతవ స్తముపాసతే.

ఋతువులు వరసగావచ్చుతమ సహజక్రమమును విడచి (అన్ని ఋతువులు ఒకేసారి) పూలను గూర్చుటయందు ఆసక్తి గలిగినవై తోటమాలీలవలె సేవించుచున్నవి.

"త దిచ్ఛామో విభో స్రష్టుం,
సేనాన్యం తస్య శాంతయే".

కావున ఓ ప్రభువా! ఆ తారకాసురుని నివృత్తికొరకు మాకు సేనానాయకుని సృజించమని వేడుకుంటారు. ఈ వర్ణనలలో ప్రకృతిమూలమైన సూర్య, చంద్ర, వాయు, ఋతువులన్నీ తమ సహజమైన మార్గమును వదలిపెట్టటం సూచించాడు. ప్రకృతి సక్రమమైన మార్గగామియై చరించునటులు చేయగల నాయకుని సృష్టించమన్నారు.

"సంయుగే సాంయుగీనంత,
ముద్యతం ప్రసహేత కః,
అంశాద్రుతే నిషిక్తస్య,
నీలలోహిత రేతసః".

అతిబలవంతుడైన ఆ తారకాసురుని ఈశ్వరుని రేతస్సువలన పుట్టినవాడు తప్ప యితరు లెవ్వరు ఓడింపజాలరు.

"సహిదేవః పరంజ్యోతిః, స్తమసః పారేవ్యవస్థితం;
పరిచ్ఛిన్న ప్రభావార్ధి, ర్నమయా నచవిష్ణునా"-

పరమేశ్వరుడు తమస్సుయొక్క పరమునం దున్నట్టి పరంజ్యోతి కనుక నాకుగాని, విష్ణువునకుగాని పొంద దగిన ప్రభావాతిశయము కలవారము గాము. అందుచే:

"ఉమారూపేణ తే యూయం,
సంయమ స్తిమితం మనః
శంభో ర్యతధ్వ మాక్రష్టు,
మయస్కాంతేన లోహవత్".

మీరు సమాధి నిశ్చలమైన హరుని మనస్సును ఇనుము నూదంటురాయి ఆకర్షించునట్లు పార్వతీదేవి సౌందర్యముచే ఆకర్షింపబడుటకు ప్రయత్నింపుడు. అప్పుడు మీకు వారి సంయోగముచే తారకాసురుని జయించగలిగిన సేనానాయకుడు లభించగలడని సెలవిస్తాడు.

అంతట దేవతలు మన్మథుని ద్వారా పురుషుని ప్రకోపింప జేయదలచారు. ఇంద్రుడు మనస్సులో మన్మథుని తలంచాడు. తలచుటే తడవుగా సేవకుడై మన్మథుడు వచ్చాడు.

"తస్మిన్ మఘోన స్త్రిదశాన్ విహాయ,
సహస్ర మక్ష్ణాం యుగపత్ పపాత;
ప్రయోజ నాపేక్షితయా ప్రభూణాం
ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు"

ప్రభువులు సేవకులయందు తరచు చంచలమైన ఆదరముకలవారు అయిననూ ఇంద్రుడు ప్రయోజనాపేక్షితుడు గనుక మిగిలిన దేవతలందరిని వదలి తన వేయికన్నులతోనూ ఒక్క మన్మథునే వీక్షించెను.

"సవాసవేనాసన సన్నికృష్ట
మితో నిషీదేతి విసృష్టభూమిః"

తన సింహాసనము ప్రక్కనే సేవకుడైన మన్మథునికి కూడా ఒక ఆసనమును చూపించెను. ఈ విధముగా ప్రభువులు తమ కార్యార్థం సేవకులను గౌరవింతురు. ఇలా సేవకుడైన మన్మథుడు ఇంద్రుని సింహాసనము ప్రక్కన ఆసనముపై కూర్చుండునంత గౌరవమును పొంది, ఉబ్బి తబ్బిబ్బై, "స్వామీ మీ పదవికేమైనా ప్రమాదం సంభవించెనా? పతివ్రతనే ధీమాతో ఏ స్త్రీయైనా మీకు లొంగక ఎదురు తిరిగిందా? చెప్పండి నిమిషాలమీద లొంగదిస్తానంటూ...అంటూ మాటల ధోరణిలో—

"తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి,
సహాయమేకం మధు మేవలబ్ధ్వా;
కుర్యాం హరస్యాపి పినాకపాణేః,
ధైర్యచ్యుతిం కే మమధన్వినోఽన్యే"—

ప్రభూ! మీ దయవలనే నేనయితే మిక్కిలి మృదువుగల, పుష్పబాణములు గలవాడను. ఒక్క వసంతుని సహాయము మాట అయితే ఏం? పినాకధరుడైన హరుని నిబ్బరమునైనను తొలగజేయగలను. ఇక మిగిలినవాళ్లు నాకేపాటి? అనేశాడు మన్మథుడు. ఇంకేం, దొరకనే దొరికాడు. తన పథకం కాస్తా పారింది.

"ఆశంసతా బాణగతిం వృషాంకే,
కార్యం త్వయానః ప్రతిపన్న కల్పం;
నిబోధయజ్ఞాంశ భుజా మిదానీ, ముచ్చైర్ద్విషా మీప్సిత మేతదేవ."

ఈశ్వరునిపైనైనను నీ బాణమును ప్రయోగించెదనని చెప్పుటచేత మాపనికి నీవు పూనుకొనిన వాడవే యయితివి. ఇప్పుడు గొప్ప శత్రువుగల దేవతల కోరిక కూడా ఇదేనని తెలుసుకొనుము అని చావుకబురు చల్లగా అందించాడు ఇంద్రుడు.

"సమాధవే నాభిమతేన సఖ్యా,
రత్యాచసాశఙ్క మనుప్రయాతః
అఙ్గవ్యయ ప్రార్థిత కార్యసిద్ధిః స్థాణ్వాశ్రమం హైమవతం జగామ."

చెలికాడగు వసంతుడు, ప్రియురాలగు రతీదేవి భయముతోగూడిన మనస్సుతో అనుసరించి వెంటరాగా ప్రాణముల నొడ్డియైననూ దేవతలపనిని పూర్తి చేయవలయునని సంకల్పించుకొని మన్మథుడు హిమవత్పర్వతమునకు బయలుదేరినాడు. నిజమే పాపం. చావడానికైనా సిద్ధంగాక మరేం చేస్తాడు. ప్రభువు తనను మహా గౌరవంతో చూచేసరికి ఉబ్బి తబ్బిబ్బై అన్న మాట కాస్త అడ్డందిరిగింది. ప్రభువులముందుఆడినమాట తప్పటం అసాధ్యంగదా; అందుచే ఏమైనా సరేనని మన్మథుడు.

"సదక్షిణాపాఙ్గ నివిష్టముష్టిం, నతాంస మాకుంచిత సవ్యపాదం".

ముందుకు సాచిన పాదంతో కుంచిత దేహుడై దక్షిణనేత్రం వరకు లాగిన వింటినారితో శివునిపై బాణప్రయోగం జేయబోయాడు పాపం. అది గాంచిన శివునకు కోపమగ్గలమై.

"తావత్సవహ్నౌ భవ నేత్రజన్మా, భస్మావ
శేషం మదనం చకార"—

మూఁడవ నేత్రం తెరవడం మన్మథుడు కాస్తా మసై పోవడం జరిగింది పాపం. ఇది చూచిన రతీదేవి శోక మగ్నలమై కరుణారసం పరిపూర్ణ మైయ్యేట్లు దుఃఖించింది. చివరకు దేవతలు మరల నీ భర్త జీవించునని చెప్పడంతో విప్రలంభమై విచ్ఛకాగ్రేసరుల పాల పచ్చివెలుగై తికమకలు పెట్టి చివరకు కరుణా విప్రలంభమై కూర్చుంది. అంతకంటే ఆమేం చేస్తుంది.

ఇంత గందరగోళాన్ని చూచి ప్రకృతియైన పార్వతి తన సహజ లలిత సౌందర్యమును విడచి వడలిపోయి చలనరహితమయిన కఠోర తపమును ప్రారంభిస్తుంది. ఇంత జరిగిన తరువాత పురుషుడు తన కర్తవ్యాన్ని గుర్తిస్తాడు.

వైరాగ్యం మానవత్వానికి అసహజమని, ప్రకృతికి విరుద్ధమని, పురుషుడు ప్రకృతిని కదిలించటం తప్పనిసరి యని, అలా జరగకున్న సృష్టే నాశన మవుతుందని నిరూపించాడు. పురుషుడు ప్రకృతిని కదలించనంత కాలం సంయోగకారకుడైన మన్మథుడు మరణించాడని మరల సంయోగంతో:—

"శాపావసానే ప్రతిపన్నమూర్తేర్యయాచిరే పంచ
శరస్య సేవాం"

శాపమునుండి విముక్తిబొంది మన్మథుడు తన వృత్తిని స్వీకరించాడని, మరల మన్మథుని బ్రతికించడంలోని అంతరార్థం సాంఖ్యధర్మమే.

ఈ కావ్యాన్ని కుమారసంభవమను పేర ప్రారంభించి తారకాసురవధ వరకు కథ నడపడం జరిగింది. దీనిని కుమారసంభవంతోనే ఆపియున్నట్లయిన కారణ కార్యములు నిర్వర్తింపబడినను —

"మయి సృష్టిర్హి లోకానాం, రక్షాయుష్మాస్వవస్థితా"

నాపని కేవలము ప్రపంచమును సృష్టించుట మాత్రమే. దానిని రక్షించుకోవడం మీవంతని బ్రహ్మ దేవతలకు చెప్పినట్లుగా అడ్డంకిని పూర్తిగా తొలగించుకొనుట మనే ఫలితమును కావ్యము మనముందుంచలేకపోయేది. కొంతకాలం పురుష ప్రకృతులు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించకుండా మానుటచే కాలానికే గండిపడుతూంది. పడినగండిని పూడ్చుట ఎంతకష్టమో వివరించడం కోసరం ఘోరమైన యుద్ధ ఘట్టాన్ని వర్ణించి చూపాడు. కాలానికి గండిపడకుండా కాపాడుకోవలసిన బాధ్యతను గుర్తింపజేయడంకోసరం కథను తారకాసుర వధవరకు పొడిగించినాడు మహాకవి.

## మేఘదూతం

మానవత్వపు పరమార్థం ఆనందమనీ, ప్రపంచస్థితికి మూలమైన ఏకైక కారణం సంయోగమనీ, అట్టి సంయోగానికి శృంగారం పట్టుకొమ్మయనీ, అందుచే ఆనందానికి శృంగారం అత్యుత్కృష్టమైనదనీ, ఆ శృంగారం మానవులపరంగాక ప్రకృతి పరమైనప్పుడు వెగటు జనించదనీ తలంచాడు. కవిత్వానికి కథా రచనా చమత్కృతులకన్నా భావనాశక్తి అతిముఖ్యమై ప్రాణం వంటిదనీ, అందువలన కథా కల్పనా చమత్కృతులు పరిపూర్ణంగా భావించడానికి అడ్డుగా నిలుస్తాయనీ భావించాడు. ధనమే సర్వస్వంగా ఎంచి ధనార్జనమీదే లక్ష్యం నిల్పి కూర్చుండే ధనికులకు ఆనందమును ఆస్వాదించుటకు అవకాశం లేదు. అందుచే వారి ఆత్మలో ఆనందానికి చోటులేదని, అనుభవించనివాడు ఇతరులను అర్థం చేసుకోలేడని, పై వర్గాలవారే నాయకీ నాయకులుగా వుండనవసరం లేదని తలచాడు. అందుచేతనే తన కావ్యాన్ని :

'కశ్చిత్కాంతా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపే నాస్తం గమితమహిమా వర్ష భోగ్యేణ భర్తుః"

అని నాయకీ నాయకుల పేర్లను సహితం వదలిపెట్టి మేఘదూతాన్ని ప్రారంభించాడు మహాకవి.

ధనపతియైన కుబేరుని సేవకులలో ఒకడు అందవతియైన భార్యావ్యామోహంలో తన కర్తవ్యాన్ని విస్మరించాడని కుబేరుడు కోపించి రామగిర్యాశ్రమమందు ఒంటరిగా నివసించునట్లు శపించాడు. ఆ శాపంవల్ల ఒక సంవత్సరంపాటు విరహాన్ని అనుభవించివలసి వచ్చింది. ఆ విరహార్తుడు ఆషాఢ ప్రథమదివసమేఘుని ద్వారా తన భార్యకు పంపు సందేశం ఇందులోని కథ.

ఇందులో సందేశం కన్నా దేశవర్ణనలు, ప్రకృతి వర్ణనలకు అతి ప్రాధాన్యత నివ్వడం జరిగింది.

"ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే
హైమం తాలద్రుమవన మభూ దత్ర తస్యైవ రాజ్ఞః;
అత్రోద్భ్రాంతః కిలనళగిరిః స్తంభముత్పాట్యదర్పా
దిత్యాగన్తూ రమయతి జనో యత్ర బన్ధూ నభిజ్ఞః"

(ఆ విశాల నగరమందు) పూర్వకథల నెరిగినవారు దేశాంతరములనుండి క్రొత్తగా వచ్చిన తమబంధువులకు "ఇదుగో! ఈ చోట వత్సరాజు ప్రద్యోతనుని ప్రియ తనయయైన వాసవదత్తను హరించుకొని పోయెను. ఈ చోట ప్రద్యోతనుని బంగారు తాటితోపు యుండెను. ఇచ్చట నళగిరియను ప్రద్యోతనుని ఏనుగు మదమెక్కి ఆలానస్తంభమును పెకలించుకొని దుముకు

లాడేను" అనుచు జరిగిన కథలను చెప్పుచూ ఆయా ప్రదేశములను చూపుచుందురు. అని పూర్వరాజుల కథలను వర్ణించినాడు.

"స్త్రీణాం మాద్యం ప్రణయ వచనం విభ్రమోహి ప్రియేషు"

స్త్రీలు ప్రియుల విషయమైన తమ ప్రార్థనలను (శృంగారానికి సంబంధించిన) విభ్రమములచేత తెల్పు దురుగాని నోటి మాటలచే తెలుపరని స్త్రీల శృంగార చేష్టను వర్ణించినాడు.

"జ్ఞాతాస్వాదో వివృతజఘనాంకో విహాతుం సమర్థః"

రసానుభూతి కలవాడెవ్వడైనా కటిపురోభాగమును ప్రదర్శించిన ప్రియను విడువగల సమర్థుడగునా ? అని పశ్చిశృంగారాన్ని నదులను స్త్రీలగాను, మేఘుని పురుషునిగాను చిత్రించి వర్ణించినాడు.

"సోత్కంఠాని ప్రియసహచరీ సంభ్రమా లింగితాని."

నీ యురుములచే తమకముతోగూడిన అనంగు కాంతలు తొట్రుబాటుతో తమ ప్రియుల ఆలింగ నాలను పొందుదురని మేఘుని చూచునప్పుడు గల్గు వుద్రేకాన్ని వర్ణించినాడు. ఇంతేకాదు శృంగారం అంతా మృదువుగాఉంటుందని భావించకు. అలసటతో బొందే ఆనందంకూడా వున్నది. నీవేమొ అలసట తీర్చునట్టి నల్లనివాడవైతివి. అందుచే సురకాంతలు తమ గాజులచే నిన్ను చీరి నిన్ను జలయంత్రముగా చేసి ఆనందింతురు సుమా ! అప్పుడు మాత్రం ఘర్జించి వాళ్ళను బెదిరించి నీ దారిని నీవు దూసుకొమ్మంటాడు.

"తస్యాస్తిక్తైర్వనగజమదైః వాసితం వాంతవృష్టిః
జంబూకుంజప్రతిహతరయం తోయమాదాయగచ్ఛేః
అంతస్సారం ఘన తులయతుంనానిలాః శక్ష్యతిత్వాం
రిక్తఃసర్వోభవతిహి లఘుః, పూర్ణతా గౌరవాయ"!

నీవు వర్షించి, అడవియేనుగుల మదముచేత పరిమళించునవియు, నేరేడి పొదల యడ్డగింతలచేత వడి తగ్గినవియు నగు రేవాజలమును త్రాగి తెరలుము. అట్లు జేసిన నీకు లోపలబలము కలుగును. నిన్ను వాయువు కదలింపజాలదు. సారవిహీనుడు చులకనయై కదలింప శక్యుడగును గాని, సారవంతుని కదలింప శక్యము కాదు గదా ! అంటాడు. విషయపరిజ్ఞానములేనివాడు తేలికవు తాడుగనుక ఎంతబాధనైనా సహించి కషాయంలాంటి రేవాజలమును మేఘుని త్రాగమన్నట్లు విజ్ఞానాన్ని మందులాగానైనాసరే సేవించమంటాడు. మంచి కటువుగా ఉంటుందని సూచిస్తూ ఎంత కటువైనాసరే సేవించి పూర్ణత్వమును బొందితేనే గౌరవించబడ గలరను నిత్యసత్యాన్ని చాటుతున్నాడు.

"తస్మిన్ కాలే జలదయది సాలబ్ధనిద్రాసుఖాస్యాత్
అన్వాస్యైనాం స్తనితవిముఖోయామమాత్రం సహస్వ
మాభూదస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధేకథంచిత్
సద్యఃకంఠచ్యుతభుజలతాగ్రంథిగాఢోపగూఢమ్" !

జలదా! నీవు వెళ్ళేవేళకు నాప్రియురాలు నిద్రలో యుండి యున్నట్లయిన ఒక జాము నిశ్శబ్దముగా వేచి యుండుము. కలలో నేను కనిపించి అలింగనాది సుఖము లందుచున్నదైన వాటికి భంగము కల్గునుకదా? యని విరహార్తయొక్క అంతరంగమును "నభూతో నభవిష్యతి" యనునట్లు భావించినాడు.

"శ్రుత్వాం వార్తాంజలద కథితాంతాం ధనేశోఽపి సద్యః
శాపస్యాన్తం సదయహృదయం సన్నిధాయాస్తకోపః"

కుబేరుడుకూడా మేఘుడు యక్షునిభార్యకు విని పించుచున్న సందేశమును విని తగ్గిన కోపము గలవాడై యక్షునికి శాపావసానమును అనుగ్రహించినాడనిచెప్పు తాడు. ధనేశం అని కుబేరునిపేర్కొనుటలో ధనమునే ప్రధానమని ఎంచుతాడని సూచిస్తున్నాడు. హృదయ విదారకమైన యీ సందేశమును మేఘుడు వివరించు నప్పుడు ప్రక్కయింటివాడైన ధనపతికూడా ఆలకిం చుటతో మనసు కరిగిం దంటాడు. ప్రకృతి ధర్మము నుండి దూరమైన జీవియొక్క జీవితబాధ పాషాణము నైనా కరగించగలదని నిరూపించాడు. యింత కథ జరుగుటకు మూలమైన కుబేరుని ధనపతి, ధనదః, ధనేశః మొదలైన పదజాల ప్రయోగముచే సంబోధించి ధనప్రధానమైన వారలకు శృంగారానందాలపై నున్న విముఖతను చాటుతున్నాడు మహాకవి. అందుకే కుబేరుని ధనప్రధానునిగా సూచించాడు.

ఈ విధంగా సాంఖ్యవాద ప్రధానసూత్రమైన సంయోగానికి ఆటపట్టయిన శృంగారరసమును అతి ప్రతిభావంతముగా వర్ణించి కవిత్వాన్ని చివరస్థాయికి చేర్చినాడు మహాకవి. ఆనంద పారమార్థంతోనింపిన కావ్యం సంస్కృత సాహిత్యంలో ఇదేమొట్టమొదటిది. ఇందులో శృంగారానికి సరిక్రొత్త ఛందస్సును కూడా సమకూర్చినాడు. అదే మందాక్రాంతం. మంద మంద గమనంతో మత్తగజయాన కాలి అందెల మ్రోతలా అతి గంభీరంగాను, సున్నితంగాను ఉంటుంది యీ ఛందస్సు.

## ఋతుసంహారము

అసలు కథేలేకున్నను భావనా ప్రధానం కవిత్వమని

నిరూపించడానికి, నాయకుడు తానైతన ప్రియురాలికి ఋతువులలోని లక్షణాలను శృంగారోద్దీపనాలుగా వర్ణించుచూ వివరించెడి ఖండికల సంపుటిగా ఋతు సంహారమును రచించాడు. ప్రకృతి నంతను శృంగార మయంగా చిత్రిస్తూ అన్ని ఋతువులూ ప్రేమికుల ఆనందానికి ఆటపట్లని నిరూపించాడు.

"తృషా మహాత్వాహత విక్రమోద్యమః
శ్వసన్ముహుర్దూర విదారితాననః
నహంత్యదూరేఽపి గజాన్ మృగేశ్వరో
విలోల జిహ్వ శ్చలితాగ్రకేసరః"

ఎక్కువ దప్పిచే, మాటిమాటికి నోరుతెరచుచూ, జూలు విదలించుకొనుచూ డస్సి సహజ పరాక్రమము సడలినదై సింహము దగ్గరనున్న ఏనుగును చంపకున్నది. వేసవి ఎండవేడిమి సహజ లక్షణములను సహితము మాన్పి, తమ ఉనికి సంగతిని ఆలోచించు నవసరమును గల్పించుచున్నది. అయిననూ అట్టివేసవి కూడా

"నిశా శ్శశాంక క్షత నీలరాజయః
క్వచి ద్విచిత్రం జలయంత్ర మందిరం
మణి ప్రకారాః సరసంచ చందనం
శుచౌ ప్రయేయాంతి జనస్య సేవ్యతాం"

ప్రియా! చంద్రునిచే నల్లని చాల్పులను పోగొట్ట బడిన రాత్రులు, విచిత్రమగు జలయంత్రములుగల గృహ ములు, చంద్రకాంత మణులతో గూర్చిన హారములు, చందనరసములు హాయిని గూర్చునవై యున్నవి.

"వ్రజతు తవ నిదాఘః కామినీభిః సమేతో
నిశి సులలిత గీతే హర్మ్యపృష్ఠే సుఖేన"

రాత్రి వేళలయందు మేడలమీద కూర్చుండి కామినీ జనములతో గూడి సంగీత ప్రసంగములచే సుఖముగా గడుపవచ్చును. అని ప్రకృతే మానవులకు ఆనంద ప్రదాయిని యని, కొంచంలోపం వున్నట్లయిన ప్రయత్నంవలన దానిని సరిచేసుకోవచ్చునని వివరిం చాడు.

ఈ విధానాన్ని తరువాత కొందరు తమ శృంగారచరి త్రలురచించుకోడానికి ఉపయోగించుకొన్నారు. కొంత కాలం తరువాత తాము నాయకులై ఎవ్వరో ప్రేయసి కాగా విరహతాపాన్ని వెల్లడించుకోడానికి ఆధారం చేసుకొన్నారు కొందరు. వీరే అప్పకవితో సరసాలాడిన భావకవులు. ఈ విధంగా వింతవింత మార్గాల ప్రవ హించి "కళ కళ కోసరం" అనే వాదానికి మూల మయింది. కానీ తానుమాత్రం తనకాలంలో వేళ్ళూని వైరాగ్య బోధలవల్ల పాతుకుపోయిన శృంగార విముఖ త్వాన్ని పెకలించడానికి గొడ్డలిపెట్టుగా తన కార్య సాధనకోసరం ఈ కావ్యాన్ని రచించాడు మహాకవి.

సంస్కృత సాహిత్యమందు మహాకవి కాళిదాసు తన కాలంలో విశ్వశ్రేయోభిదాయకమైన నూతన రాజకీయములను, వేదాంతమును, సాహిత్యరీతులను స్వీకరించినాడు.

1. రామాయణమందు ప్రతిపాదింపబడిన కేంద్రీ కృత ప్రకృతిసంపదల సిద్ధాంతము భారతయుద్ధంతో విచ్ఛిన్నమై విభక్తసంపదగా మారింది. దీనితో ఏర్పడిన అనేకములైన చిన్నచిన్న రాజ్యములు ఒండొంటితో పోరాడుకొని బలహీనపడుట జరిగింది. ఇంతలో వచ్చిన బౌద్ధములోని యుద్ధవ్యతిరేకతతో క్షాత్రపుష్టి చచ్చి పరాయిదండయాత్రలను తట్టుకోలేక సతమత మగుచున్న భారతజాతికి విప్లవకరమైన కేంద్రీకృత రాజరిక సిద్ధాంతమును రాజకీయములయందు ప్రతిపాదించి విప్లవవాదియైనాడు.

2. వాటి సంఘము పౌరాణిక, మూఢభక్తి, అరణ్య కాలలోని వేదాంతాలతో నిండిన మితవాద సనాతన ధర్మములకు, బౌద్ధములోని జీవరహిత సన్యాసమునకు మధ్య నలుగుచున్నప్పుడు రెంటినుండి సమాజమును రక్షించుటకై సాంఖ్యవాదమును స్వీకరించినాడు. ఈ మార్గం ద్వారా ఊబిలో కూరుకుపోయి తికమకలగుచు నిలచిన సమాజమును ముందుకు నడుపుటకై దారిజూపి అభ్యుదయ వాదియైనాడు.

3. కవిత్వమందు భిన్నవిభిన్నములైన రసములచే వచ్చు వివిధములైన రసములను కూర్చినాడు. కళకు భావనాశక్తి ముఖ్యమని కథారచనకు ప్రాముఖ్యము లేదను భావమునకు బీజములను ఆనాడే నాటినాడు. కాలానుకూలంగా కవిత్వం మారుతుందని ఛందస్సులు కూడా క్రొత్త క్రొత్తవి సృష్టించాలను మార్గమును సూచించాడు. ధ్వని ప్రధానమైన ఉత్తమోత్తమ రచన లను సాగించాడు. తన కావ్యములయందు విశ్వశ్రేయ స్సును లక్షించి, విశ్వశ్రేయోభి దాయకముగా రచించి నాడు. అందుచే మహాకవియైనాడు.

ఈ విధంగా రాజకీయ, సాంఘిక వేదాంతములు మొదలైన బహుశాస్త్ర ప్రవీణుడైన కాళిదాసు అభ్యు దయ విప్లవవాద మహాకవి యగుటవల్ల,

"పురా కవీనాం గణన ప్రసఙ్గే
కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః
అద్యాపి తత్తుల్య కవే రభావా
దనామికా సార్థవతీ బభూవ"

యని భారతీయులు గౌరవించుచున్నారు.

# కాళిదాసుని విదూషకులు

## శ్రీనివాస చక్రవర్తి

సకల మానవులనూ గిలిగింతలు పెట్టి నవ్వించేది హాస్యరసం. నవ్వని మానవు డంటూ కనిపించడు. నవ్వు ఆరోగ్యకరం. వినోదకారి. మనసులోని ఆనందానికి బాహ్యరూపమే నవ్వు. వేషభాషణలవల్లా, చేష్టా సంఘటనలవల్లా నవ్వు జనిస్తుంది. అయితే ఇవి సహజమయినపుడు నవ్వురాదు. కుంటివానినిచూస్తే నవ్వు పుట్టదు. పైగా సానుభూతి కలుగుతుంది. కుంటిగా నటిస్తూంటే నవ్వు పుడుతుంది. చొక్కా సీదాగా తొడిగితే నవ్వురాదు. ఉల్టాగా తొడిగితే నవ్వు వస్తుంది. అలాగే భాషణ విషయంలోకూడా. మామూలు మాటలకు నవ్వురాదు. చమత్కారంగా మాట్లాడినా, వేళాకోళం చేస్తూ మాట్లాడినా, మాటలు తారుమారయినా, అసందర్భంగా మాట్లాడినా నవ్వు వస్తుంది. శవం చుట్టూ ఆప్తులు చేరి ఏడుస్తూంటే నవ్వురాదు. మదరాసులోలాగా కూలికి ఏడిచే ఏడుపు వింటే నవ్వొస్తుంది. ఉత్తరకుమార ప్రజ్ఞలు పలికి తీరా సమయం వచ్చేసరికి పిరికిపందలా ప్రవర్తించడం చూస్తే నవ్వు పుడుతుంది. మనిషి పశువులా నాలుగు కాళ్ళతో ఆటకోలుతనానికి నడిస్తే నవ్వుతాం. అంటే అసహజమూ, వికృతమూ అయినవాటివల్ల నవ్వు జనస్తుందని తేలుతుంది. అందుకే భరతముని వికృతాకార వాక్చేష్టాదులు హాసజనకాలని సూత్రీకరించాడు. ఇంకా, ఒకరు నవ్వుతూంటే మనకూ నవ్వు వస్తుంది. మనం ఎన్నడోచేసిన తెలివితక్కువ పనులు జ్ఞప్తికి వచ్చినపుడు మనలో మనం నవ్వుకుంటాం. తిండిపోతుని చూసినా, బూతులువిన్నా, త్రాగుబోతు ప్రలాపాలు విన్నా నవ్వొస్తుంది. కాని ఇలాంటిది చౌకబారు హాస్యం.

సంస్కృత లాక్షిణికులు నవ్వును ఆరు విధాలుగా విభజించారు. (1) స్మితం : కనులు వికసించునట్లు నవ్వడం, (2) హసితం : పళ్లు కొంచెం కనిపించేటట్టు నవ్వడం, (3) విహసితం : మధురమయిన కంఠ ధ్వని కలిగేటట్టు నవ్వడం, (4) ఉపహసితం : తలకదిలేటట్టు నవ్వడం, (5) అపహసితం : కనుల నీరుకారేటట్లు నవ్వడం, (6) అతిహాసితం : ఒళ్ళంతా కదిలేటట్టు నవ్వడం. వీటిలో మొదటి రెండూ ఉత్తమ మయినవి. తరువాత రెండూ మధ్యమ మయినవి. చివరి రెండూ అధమమయనవి. ఇంతేగాక మన లాక్షణికులు హాస్యం శృంగారానికి మైత్రీరస మన్నారు. భరతముని అసలు హాస్యరసం శృంగార రసంలోంచి జనించిన రసమేనని సిద్ధాంతీకరించాడు. నిజానికి హాస్యంలేందే శృంగారం రాణించదుకూడా. ఒకొక్కప్పుడు వీర రసానికి కూడా హాస్యం అంగిగా ఉపయుక్త మవుతుంది. ఇలా హాసజనకమయి ప్రజలను వినోదింపజేసే హాస్య రసానికి లలిత కళలలో ముఖ్యంగా నాటకంలో ప్రాధాన్యం ఎక్కువగా ఉంటుంది. అందుచేతనే సంస్కృత నాటక కర్తలు ప్రతినాటకంలోనూ హాస్యానికి తావిచ్చి ప్రేక్షకులకు వినోదం కల్పించడానికి ప్రత్యేకంగా విదూషక పాత్రను నాటకాలలో ప్రవేశపెట్టడమేగాక హాస్యం ప్రధాన రసంగాగల ప్రహసనాలను సైతం రచించారు. లాక్షణికులు ప్రతి నాటకంలోనూ విదూషక పాత్ర ఉండాలని నిర్ణయించడమేగాక దశ రూపకాలలో ప్రహసనానికికూడా స్థానం కల్పించారు. ఈ విదూషకుణ్ణే యక్షగానాలలో 'కోణంగి' అని పిలుస్తారు. 'హాస్య ప్రాయో విదూషకః' అని విదూషక పాత్ర ప్రయోజనం హాస్యం జనింపజేయడమే నని లాక్షణికులు సిద్ధాంతీకరించారు.

అయితే ఈ విదూషకుడు ఎవరు? నాటకరచయిత ఊహాప్రపంచంలో జనించినపాత్రా? కాదు. సర్వదేశాలలో, సర్వకాలాలలో, రాజరికం ఉన్నచోట రాజులు నటవిటగాయకాది పరివారంతోపాటు విదూషకుణ్ణికూడా పోషించేవారు. భారతదేశంలో ఇతనిని విదూషకుడంటే పాశ్చాత్యదేశాలలో 'కోర్టుజెస్టర్', 'కోర్టుఫూల్' అనేవారు. ఈ సాంప్రదాయం మొన్నమొన్నటిదాకా వస్తూనే ఉంది. వికృత వేషభాషాదులతో నవ్వుపుట్టించి రాజుగారిని నవ్వించి వినోదపర్చడమే ఇతని ఉద్యోగం. అంటే ఇతను తన స్వభాషాదులను, స్వభావాన్ని అణచిపెట్టుకుని కేవలం ఇతరులను వినోదింపజేయడానికి లేని వికృతాకార భాషాచేష్టాదులను తెచ్చిపెట్టుకుని సర్వులను నవ్వించే మహా నేర్పరి అయిన నటుడన్నమాట. అంతేకాని కొందరు భావించి

నట్టు విదూషకుడు మందబుద్ధీకాడు, వికృతాకారుడూ కాడు. వికృతచేష్టలు స్వభావికంగా చేసేవాడూ కాడు. వికృతభాషి కాదు. అటువంటివాడిని ఏ రాజూ తన కొలువులో ఉంచుకోడు. అదంతా ఇతరులను నవ్వించడానికి తెచ్చిపెట్టుకున్న నటన. కాని సంస్కృత నాటకకర్తలు, లాక్షణికులు ఈ విషయం విస్మరించి విదూషకుని కేవలం వినోదపాత్రగా, తిండిపోతుగా, మందబుద్ధిగా చిత్రించారు. అందుచేతనే బహుకొద్ది నాటకాలలో తప్ప తక్కినవాటిలోని విదూషకుని హాస్యం మోటుగా, చవుకబారుగా కనిపిస్తుంది.

సంస్కృత నాటకాలలో సామాన్యంగా రాజో, తత్సముడో నాయకుడు కావడం, శృంగార వీరరసాలు ప్రధాన రసాలు కావడంతో రాజుతోపాటు హాస్యకారకుడయిన విదూషకుని కూడా నాటకకర్తలు చిత్రించడానికి పూనుకున్నారు. సంస్కృత నాటకాలలాగానే ఈ పాత్రకూడా మూసలోపోసిన పాత్రగా తయారయింది. అన్ని నాటకాలలోనూ ఒకే విధంగా చిత్రితమయి, విదూషకుడంటే మూఢుడు, తిండిపోతు, అసంబద్ధ ప్రలాపి, పిరికిపంద అనే అపవాదు రూఢి అయిపోయింది. భరతముని మతప్రకారం విదూషకుడు బట్టతల, మరుగుజ్జు, వికార స్వరూపం, గూని, ఎత్తుపళ్ళు, ఎఱ్ఱటి కళ్ళుగలవాడు. శారదాతనయుని మతప్రకారం విదూషకునిది రాగిజుట్టు, పీచుగడ్డం. సంస్కృత నాటకకర్తలు భరతముని చెప్పిన బట్టతల విదూషకుణ్ణి చిత్రించినట్టు లేదు. శాకుంతలంలోని విదూషకుడికి జుట్టు ఉన్నట్లు తెలుస్తుంది. రాజశేఖర కవి కర్పూరమంజరి నాటకం చూస్తే విదూషకుడు విగ్గులు మొదలయిన ఉపకరణాల సాయంతో వికృత వేషం వేసుకునే వాడని తోస్తుంది. చేతిలో కొంకికర్ర (దండకాష్టం) పుచ్చుకొని, చమత్కారంగా మాట్లాడుతూ, ఇతరులను అపహాస్యంచేస్తూ, అసందర్భంగా మాట్లాడుతూ అందర్నీ నవ్విస్తాడు. ఈ విదూషకుని చెడిపోయిన బ్రాహ్మణ్ణిగా చిత్రించి, అతని కులాన్ని, యజ్ఞోపవీతాన్నీ అపహాస్యం చేయడానికి మార్గం సృష్టించారు. వసంతఋతు సంబంధమయిన కుసుమ, వసంతాది పేర్లు విదూషకునికి పెట్టాలనీ, అతని పని నవ్వించడం, సుష్టుగా భోజనంచేయడం అనీ లాక్షణికులు నిర్ణయించారు.

ఇంతేకాదు. అసలు విదూషక పాత్ర కేవలం వినోద పాత్ర కావడానికి ఇంకో కారణంకూడా చెబుతారు. పూర్వం ప్రతి నాటకసమాజానికీ అయిదుగురు ప్రధాన నటులు ఉండేవారనీ, అందులో హాస్యం చెప్పేనటుడు ఒకడనీ నాట్యశాస్త్రంవల్ల తెలుస్తుంది. ఈ నటుడు బహుశా నాటక ప్రయోగంలో మధ్యమధ్యన హాస్యం చెబుతూండేవాడనీ, ఆపాత్ర క్రమక్రమంగా విదూషక పాత్రకింద మారిందనీ కొందరు విమర్శకుల ఊహ. ఎలాగయినా సంస్కృత నాటకకర్తలు ఎక్కువగా విదూషకుణ్ణి కేవలం వినోదపాత్రగానే భావించి చిత్రించారు. కథా విన్యాసంలో విదూషకునికి పనేం ఉండదు. ఇతనివల్ల కథా గమనానికి పెంపూలేదు, తరుగూలేదు. రంగస్థలంమీదికి రావడం అందలి పాత్రలను, ప్రేక్షకులను నవ్వించడం, నిష్క్రమించడం. ఇదీ ఇతని పని. ఇదీ స్థూలంగా సంస్కృత లక్షణ గ్రంథాలవల్ల, రూపకాలవల్ల విదూషకుణ్ణి గురించి తెలిసే భోగట్టా.

కాళిదాసుకి పూర్వీకులలో భాసశూద్రకులు ముఖ్యులు. (కొందరు శూద్రకుడు కాళిదాసు తరవాతవాడంటారు.) భాసుని నాటకాలలో ప్రసిద్ధికెక్కినవి స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణం. వీటిలో కథను నడిపించిందంతా యౌగంధరాయణుడు. అతనికి సహాయకారిగా, రాజును వినోదింప జేసేవాడుగా విదూషకుడు చిత్రితమయినాడు. కథాగమనంలో విదూషకపాత్రకు ప్రాధాన్యంలేదు. కొంచె మించు మించు వినోదపాత్రగా తయారయినాయి. ఇక శూద్రకుడి మృచ్ఛకటికంలో విదూషకుడు మందబుద్ధి, తిండిపోతు. వసంతసేన నగ దొంగచేతికి చిక్కడంగాని, వసంతసేన నగలమూటతో న్యాయస్థానానికి వెళ్ళి చారుదత్తుని హంతకుడుగా నిరూపించడానికి కారణభూతుడవడంగాని విదూషకుని మందబుద్ధివల్లా కాదు, స్వబుద్ధివల్లా కాదు. అవి యాదృచ్ఛికంగా జరిగిన ఘటనలు. వసంతసేనా చారుదత్తుల ప్రేమకథకుగాని, ఆర్యకుని విప్లవానికిగాని అతను చేసిందేమీలేదు. అందుచేత మృచ్ఛకటిక విదూషకుని కూడా వినోదపాత్రగా జమకట్టవలసి వస్తోంది.

ఇక కాళిదాసో మహాకవి, మహాశిల్పి. సర్వతంత్ర స్వతంత్రుడు. కేవలం వినోదపాత్రగా విదూషకుణ్ణి చిత్రించడం మనస్కరించలేదు. లాక్షణిక మతాన్ని తోసిరాజని సాహసించి మాళవికాగ్నిమిత్రంలో విదూషక పాత్ర చిత్రణలో కొత్తతోవ తొక్కాడు. భాసునికంటె ఒక అడుగు ముందుకు వేసి మంత్రికి సహాయకారిగా చేయడంతో తృప్తి చెందక మంత్రిలాగా కథంతా విదూషకుని చేతనే నడిపించాడు. బహుశా మాళవికాగ్నిమిత్ర రచననాటికి కాళిదాసు

న్నూనూగు మీసాల నూత్న యవ్వనుడేమో సాహసించగల్గాడు. మాళవికాగ్నిమిత్ర నాందీప్రస్తావనలోనే ముందు జాగ్రతకు —

"సర్వమును ప్రాతదని యెంచు సాదుగాదు
క్రొత్తదనిరయె కావ్యమునకు గొఱతరాదు
యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు
మూఢు డన్యులనే నమ్ము బుద్ధిలేక."

అని ఒక చెణుకు విసిరాడు.

మాళవికలోని విదూషకునికి సంస్కృతనాటక విదూషకులలో విశిష్టస్థానం ఉంది. తక్కిన విదూషకులకూ, యీ విదూషకునికీ ఎంతో భేదం ఉంది. స్వప్నవాసవదత్తాదులలో కథ నడిపేది యౌగంధరాయణుడు. వాని ననుసరించిపోయే వినోదపాత్ర విదూషకుడు. ఇక మాళవికలోనో కథ నడిపేదే విదూషకుడు. ఇందులోని విదూషకుడు తక్కిన నాటకాలలోలాగా మందబుద్ధి కాడు. ధీశాలి. అగ్నిమిత్రుడితనిని 'కార్యాంతర మందలి అపరమంత్రిగా', 'ప్రజ్ఞానేత్రం' గలవాడుగా భావించాడు. ఇరావతి యితనికి 'కామమంత్రి' అనే బిరుదిచ్చింది. విదూషకునికి రాజుగారి 'నర్మసచివు'డనే పేరు యీ నాటకంలో సార్థకమయింది.

'పటంలో చూసిన మాళవికను ప్రత్యక్షంగా' రాజు చూడదలచడంతో నాటకబీజం ఏర్పడింది. ఈ పనిని రాజు 'కామమంత్రి' గారిమీద పెట్టాడు. రాజుగారి ఆదేశం శిరసావహించి మన విదూషకుడు అట్టే ఆలోచించాడు. రాజుగారి కంటబడకుండా మాళవికను ధారణీదేవి వేయికళ్ళతో కనిపెట్టి చూస్తోంది. మరి మాళవిక రాజు కంటబడడం ఎలా ? ఉపాయం తట్టింది. అభినయాచార్యులయిన హరిదత్త, గణదాసు లిద్దరికీ విదూషకుడు పురెక్కించాడు. వీరిద్దరిలో మాళవిక గురువు గణదాసు. ధారణీదేవి పక్షపువాడు. ఇక హరిదాసు రాజుగారికి అభిమానపాత్రుడు. విదూషకుడు పురెక్కించేసరికి వీరిద్దరూ వాదులాడుకున్నారు. ఏమని ? నాట్యశాస్త్రంలో నేను గొప్పంటే నేను గొప్పని. ఇంకేం విదూషకుని 'నీతి వృక్షం పూతపట్టింది.' ఇంతకీ ఈ వివాదం తేల్చేదెలా ?. తేల్చేదెవరు ? ఇక్కడే విదూషకుని ధీశక్తి పనిచేసింది. ఆచార్యులిద్దరినీ పరీక్షిస్తే మాళవిక రాజుకంట ఎలా పడుతుంది? పరివ్రాజకను కూడగట్టుకున్నాడు. అయితే ధారణీదేవి అసలీ పరీక్షకే ఒప్పుకోలేదు. అసలు పన్నాగమే దెబ్బతినే దశకు వచ్చింది. దానిమీద విదూషకుడు, 'ఈ కుక్షింభరుల సంవాదము విందము. వీరికి జీతములిచ్చి వృథాగా కూరుచుండబెట్ట నేల ?,' 'రెండు మదపుటేనుగు లన్యోన్య కలహ ప్రియములయి యున్నప్పుడు వానిలో నేదో యొకటి పరాజయము పొందక శాంతి యెట్లు కలుగును ?' అని నర్మి చెప్పి పరివ్రాజక చేత, 'వీరు నేర్పినది చూచుటవలన నిర్ణయించవలెను.' అని చెప్పించాడు. దీని అంతర్యం గ్రహించిన ధారణీదేవి ససేమిరా దీనికి అంగీకరించలేదు. కార్యభంగం అయే టట్టుంది. విదూషకుడు రాణీగారికి వ్యతిరేకంగా చెయ్యడానికి వెనుదీసి తెల్లమొహం వేశాడా? ఊహుఁ. మెల్లగా గణదాసు నితో, 'ఓ గణదాసా ! సంగీతాచార్యత్వము పొంది, సరస్వతికి నైవేద్యము పెట్టు మోదకములను భక్షించుచు కూరుచుండెడి నీకీ పరాభవకరమయిన శుష్కకలహములతో నేమి ప్రయోజనమయ్యా !" అని గణదాసుకి రోషం వచ్చేటట్లు చేశాడు. దాంతో గణదాసు మాళవిక చేత నాట్యం చేయించి చూచి తీరాల్సిందేనని మంకు పట్టుపట్టాడు. ఇక చేసేందుకేం లేక ధారణీదేవి అందుకు అంగీకరించింది. కాని పరివ్రాజక ఒకతే పరీక్షించాలనే పేచీ పెట్టింది. విదూషకుని కుట్రలో చేరిన పరివ్రాజక, 'సర్వజ్ఞునకైనను నొంటరిగా నుండి న్యాయముతీర్చుట యుక్తముకాదు' అని రాజు సమక్షంలో పరీక్షకు ఏర్పాటు చేస్తుంది. అంతేకాదు, 'అన్ని యవయవముల సౌష్టవమును చక్కగా గనబడుటకై యలంకారము విశేషముగా జేయక పాత్రలను తీసుకుని రండు' అని ఆదేశిస్తుంది. ఇంకేం విదూషకుని 'నీతివృక్షం' ఫలించింది! సంగీతశాలకు వెళ్లేటప్పుడు విదూషకుడు రహస్యంగా రాజు కిచ్చిన సలహా, 'ఓయీ ! ధీరత్వముతో నడువుము. ధారణీదేవి మరియొక విధముగా భావించుకొనును' పరికిస్తే అతని వివేచనా శక్తి బోధపడుతుంది. ఈ అంకంలో ధారణీదేవి ఎత్తులకు పై ఎత్తులు వేయడంలో విదూషకుడు ఏమాత్రం పప్పులో కాలువేసినా, ఏమాత్రం పరాకుగా మాట్లాడినా అతని పన్నాగమంతా వృథాఅయి అతనికీ రాజుకూ చిక్కులువచ్చి పడేవి. అసలు కథ మొదట్లోనే అడ్డం తిరిగేది.

మాళవిక రాజుకు కనులపండువుగా నాట్యంచేసి నిష్క్రమించబోతోంది. కాని రాజుకింకా తనివి తీరలేదు. ఏదో మిషమీద ఆమెని యింకా కాసేపు నిలపాలిగదా, కారణంకూడా సహజంగా ఉండాలి. అందుకని విదూషకుడు, 'అమ్మా ! పోక నిలువుము. నీ వాట యందొక క్రమమును మఱచిపోతివి. నేను దాని నిప్పుడే దెలిపెదను' అంటాడు. నాటకంలోని

పాత్రలు, ప్రేక్షకులుకూడా ఆ మఱచిం దేమిటా అని ఉత్సుకతతో ఉంటారు. చివరికి విదూషకుడు, 'ప్రథమోపదేశ దర్శన సమయమునందు ముందుగా బ్రాహ్మణ పూజ చేయవలెను. మీ రా పూజ మరిచిపోయినారు!' పాత్ర లందరికీ నవ్వొస్తుంది. మనకీ నవ్వొస్తుంది. దీని నే నాటకీయ వ్యంగ్యం అంటాం. ఒకదెబ్బతో రెండు పిట్టలు! మాళవికను రాజు తనివితీరా చూడడానికి ఆస్కారం కలిగింది. అందరికీ వినోదమూ కలిగింది. అంతటితో ఊరుకున్నాడా, మాళవిక నాట్యాన్ని మెచ్చుకుని రాజు చేతినించి బంగారు మురుగు తీసి బహూకరించ బోతాడు. 'రెండవవారి గుణ తారతమ్యముకూడ దెలియక నీ వీ యాభరణమేల యిచ్చెదవు?' అని ధారణీదేవి వేసిన ప్రశ్నకు, 'ఇది మరియొకరి సొత్తు గనుక' అనే విదూషకుని సమాధానం లోని హాస్యం ఎంత సున్నితంగా ఉందో చూడండి.

ధారణీదేవికి రాజుమీద అనుమానం హెచ్చి మాళవికను,' నిధిని రక్షించినట్లుగా మరింత పదిలముగా గావలియుంచి కాపాడు'తోంది. ఇక రాజుతో సమాగమ మెలా? విదూషకుడు, 'ఈ కార్యసాధనకు వేరొక యుపాయప్రయోగం' చేశాడు. ఊయల ఊగుతున్న ధారణీదేవి కిందపడేటట్టు చేశాడు. కాలు నొప్పిపెట్టింది. కదలలేదు. కాంచనాశోకానికి దోహదంచేయాలి? ఏంచేస్తుంది. మాళవికను అందుకు నియోగించి, 'అది యయిదురాత్రుల లోపల బూత పట్టిన పక్షమున, నీ మనోరథపూరకమయిన యనుగ్రహమును నీకు జేసెదను' అని వాగ్దానముచేసి ఉద్యానవనానికి పంపుతుంది. ఇలా జరగడంకోసరమే విదూషకుడు చపలత్వం నటించి ధారణీదేవి కింద పడేటట్టు చేశాడు. ఇందుతో రెండు కార్యాలు నెరవేరాయి. ఒకటి: రాజు మాళవికను సందర్శించే అవకాశం కలిగింది. రెండు: అశోక వృక్షం పూత పట్టితే మాళవిక కులీన అని నిరూపిత మవుతుంది. సరిగ్గా విదూషకుడు అనుకున్నట్టే జరిగింది. మాళవిక ఉన్న ఉద్యానవనంలోకి రాజును తీసుకుపోతాడు. అయితే సమయానికి ఇరావతి వచ్చి మాళవికాగ్ని మిత్రులను పట్టుకుంది. 'రాజు, మిత్రుడా! ఇప్పుడేమిగతి?' అని ప్రశ్నిస్తాడు. విదూషకుడు, 'మరి యేమున్నది! పిక్కబలమే.' ఎంత చక్కటి హాస్యం! ఎత్తిపొడుపు!

ఇరావతి రాకతో మాళవికాగ్ని మిత్రుల సమాగమానికి అంతరాయం కలిగింది. రాజుకు మతి మతిలో లేదు. పైగా ధారణీదేవి ఇరావతివల్ల జరిగినదంతా విని మాళవికను పరిచారికతో సహా పాతాళ గృహంలో తోసింది. ఇదే ఈ నాటకంలో గర్భసంధి (Climax). ఈ విషయం రాజుతో విదూషకుడు ఎంత చమత్కారంగా చెప్పాడో చూడండి. మాళవిక వృత్తాంతం, 'పిల్లిచేత బట్టువడిన కోకిల వృత్తాంతమువలె నున్న'దట!

తిరిగీ మాళవికాగ్ని మిత్రులకు సమాగమం కలిపించాలి. దీనికి ఉపాయమేమిటి? పూర్వంలాగా కాదు. మాళవిక ఇపుడు పాతాళ గృహంలో కారాగారంలో వుంది. ఆమెని విడిపించి బయటికి తేవడ మెలా? ధారణీదేవి సర్పముద్రాంకిత మయిన ఉంగరం చూపి తేనే గాని మాళవికను వదలవద్దన్నది. ఇంకేం కావ మంత్రిగారి బుద్ధి పాదరసంలా పనిచేసింది. 'సర్పముద్ర' అనే పదం వినేసరికి ఉపాయం తట్టింది. వెంటనే తోటలోకి వెళ్ళి ముగలిముండ్లతో బొటనవేలు గీచుకుని గాయాన్ని జందెంతో కట్టుకుని విషోద్రేకం నటిస్తూ రాజు, ధారణీదేవి కూర్చున్న చోటికి వెళ్ళి పాముకరిచినవాడిలా నటించసాగాడు. ధారణీదేవికి ఎలాగయినా కరుణ కలిగేటట్లు చేసి సర్పముద్రాంకిత మయిన ఉంగరం ఆమె దగ్గిరనించి సంపాదించాలి. ఇదీ అతని ఎత్తు. 'దేవిగారి దర్శనము చేయవలెనని యాచారము చొప్పున బువ్వముల నిమిత్తము నేనుద్యానవనమునకు బోయి నాను'. 'అట్లుపోయి పుష్పమునిమిత్తమయి కుడిచేయి అశోక వృక్షముమీదికి జాచునప్పటికి మృత్యుదేవత సర్పరూపమున వెడలివచ్చి కాటువేసినది' అని బాణంవదిలి, 'నేనే యీ బ్రాహ్మణుని ప్రాణసంశయమునకు హేతుభూతురాల నయినాను' అని ధారణి బాధపడేటట్లు చేశాడు. నిజంగా చచ్చిపోతున్నవాడిలా నటించాడు. రాజుకు తన కుటుంబాన్ని అప్పగించాడు. ఇంకేమిటి, అంతా విదూషకుణ్ణి నమ్మి విషవైద్యుడి దగ్గిరకి పంపారు. ఆ విషవైద్యుణ్ణి తన బుద్ధిచాతుర్యం చేత విదూషకుడు లోబర్చుకుని ఉండి ఉంటాడు. విషవైద్యుడు 'సర్పముద్రగల యుంగర మెక్కడనైనను వెదకి సంపాదించవలె'నని కబురు చేశాడు. వెంటనే ధారణీదేవి తన వేలిఉంగరం తీసి ఇస్తుంది. విదూషకుడు జయించాడు. సర్ప ముద్రాంకితమయిన ఉంగరం చూపినా తగిన కారణం చెప్పకపోతే మాళవికను వదలడానికి సంశయిస్తారేమోనని రాజుగారికి గ్రహబాధ తప్పేందుకు చెరలో వారందరినీ వదలిపెట్ట మన్నారనే కారణం చెప్పి మాళవికను చెర విడిపిస్తాడు. చిన్నచిన్న విషయాలలోకూడా ఎంత జాగ్రత వహించాడో చూడండి. ఇలాగే పాముకాట్లు కనిపించడానికి రెండుగీట్లు మాత్రమే గీచుకుంటాడు.

మాళవికాగ్నిమిత్రులు ప్రమదవనంలో కలుసుకుంటారు. ఇద్దరినీ వంటరిగా విడిచి దూరాన శిలావేదిక మీద కూర్చుని విదూషకుడు నిద్రపోతుంటాడు. మళ్ళీ ఇరావతి చెలికత్తెతో ప్రత్యక్షమవుతుంది. హాస్యానికి మీదవేసిన దండకాష్టాన్ని నిజంగా పామని భ్రమించి విదూషకుడు భయపడి, తాను మొంగలిముండ్లతో గీచుకొనడం తనలో తాను బిగ్గరగా ప్రస్తావించి రహస్యం బయటపెడతాడు. ఇరావతికి కోపంవచ్చి వెళ్ళిపోయినా, కాంచనాశోకం మొగ్గదొడగడంతో విదూషకుని పన్నాగం, రాజుగారి మనోరథం ఈడేరతాయి. చివరికి ధారణీదేవి 'కాంచనాశోకం పూతపూచితే నీ మనోరథం తీరుస్తా'నని మాళవికకు చేసిన వాగ్దానం నిలబెట్టుకుని మాళవికను రాజుకు అర్పిస్తుంది.

మాళవికాగ్నిమిత్రుల ప్రేమ ప్రవర్థమానమవడానికి, వారి సమాగమానికి, చివరికి వారి వివాహానికి కారకుడు విదూషకుడు. ఇంతేగాదు ముఖ్యంగా మాళవికలోని విదూషకుని సంభాషణలు ఎంతో చమత్కారంగా ఉంటాయి. ఎక్కడా చౌకబారు హాస్యం కనిపించదు. అతను ఉపయోగించే ఉపమానాలు, సూక్తులు చూస్తే అతను మంచి పండితుడని లోకానుభవం గలవాడని బోధపడుతుంది. ఉదాహరణకు :

"నేను నిశ్చయముగా నీరు త్రాగవలెనన్న యాశతో వట్టి యురుములుగల యాకాశమును కనిపెట్టుకుని యున్న చాతక పక్షి నయినాను."

♦ ♦ ♦

"మేఘముల చాటునన్న వెన్నెలవలెనే పరాధీనురాలయిన మాళవిక దర్శనమే శీఘ్ర సాధ్యము కాదు. నీవో, కటికవాని సమీపమునన్న మాంసమునందత్యాశ కలిగి చేర భయపడుచున్న గృధ్రమువలెనున్నావు."

♦ ♦ ♦

"నీటి సమీపమున దారిలేక పట్టుబడిన దొంగవలెనే యిప్పుడు సంధిచేసుకొనుటయే కర్తవ్యమని తోచుచున్నది."

♦ ♦ ♦

"అంగార రాశివలె నీమె మరల రాకమునుపే మనము శీఘ్రముగా పారిపోవుదము రమ్ము."

♦ ♦ ♦

"దొరలకును జారులకును చంద్రిక సరిపడదు కదా!"

♦ ♦ ♦

విదూషకుడు మాళవికను మనసులో పెట్టుకుని రాజుతో, "ఓయీ! పరువముగల దానిని జూడుము" అంటాడు. వెంటనే ధారణీదేవి "ఎవతెను?" అని ప్రశ్నిస్తుంది. తన మనసులోది చెప్పాడా కొంప లంటుకుంటాయి. అందుకని సమయస్ఫూర్తిగా, "నేను గాంచనాశోకముయొక్క పుష్పశోభను గూర్చి చెప్పుచున్నాను" అని తప్పించుకుంటాడు. ఇదొక రకమయిన నాటకీయ వ్యంగ్యం. ఇలా విదూషకుని సంభాషణలు ఒకొక్కటికీ వ్యాఖ్యానించుకుంటూ పోతే, కాళిదాసు ప్రతిభ సువ్యక్తమవుతుంది. కాబట్టి ఇంతటితో ఈ విషయం విరమిస్తాను. ఇక తిండి గొడవ అక్కడక్కడా సకృత్తుగా యదాలాపంగా వచ్చిందే. ప్రేక్షకుల ధ్యాస వానిమీదకి మళ్ళదు.

కేవలం వినోద పాత్రగా కాకుండా నాటక కథా సూత్రధారిగా, ధీశాలిగా విదూషకుణ్ణి చిత్రించింది సంస్కృత నాటకకవులలోకల్లా కాళిదాసు ఒక్కడే కనిపిస్తాడు. అందుచేతనే మాళవికలోని విదూషక పాత్రకి విశిష్ట స్థానం లభించింది.

కేవలం వినోదపాత్రగా కాకుండా కథా సూత్రధారిగా, ధీశాలిగా విదూషకుణ్ణి చిత్రించడం లక్షణ విరుద్ధమని ఆనాటి పండితులు ఆమోదముద్ర వేయకుండా అధిక్షేపించారేమో, తక్కిన రెండు నాటకాలలోనూ లాక్షణిక మతాన్ననుసరించి కాళిదాసు వినోదపాత్రగానే విదూషకుణ్ణి చిత్రించాడు. శాకుంతలంలోని విదూషకుడు, విక్రమోర్వశీయంలోని విదూషకుడు మందమతులు, తిండిపోతులు – "తినడం నిద్రపోవడం మాత్రమే వీరి పనిలాగా కనిపిస్తుంది." నాటక కథాగమనానికి వీరు తోడ్పడిం దేమీ లేదు.

శకుంతల నాటకంలోని విదూషకుడు కథానాయికను ఎన్నడూ చూడలేదు. అసలు రంగస్థలంమీదికి రావడమే మూడుసార్లు వస్తాడు. అంతే. శకుంతలా దుష్యంతుల ప్రేమ కథకుగాని, వారి గాంధర్వ వివాహానికిగాని, శకుంతలా పరిత్యాగానికిగాని, పునస్సమాగమానికిగాని యితను సాయపడిందేదీ లేదు, నిరోధించిందీ లేదు. దుష్యంతుని వినోదపర్చడం మాత్రమే యితని వంతు. అయితే ఎంత మందమతిగా, తిండిపోతుగా చిత్రిద్దామని యత్నించినా కాళిదాసు ప్రతిభ అక్కడక్కడా పొడగడుతూనే ఉంటుంది. విదూషకుని నోట కాళిదాసే పలుకుతున్నట్లుంటుంది. ఈ నాటకంలోని విదూషకు డనండి లేక కాళిదాసనండి మంచి లోకానుభవం గలవాడు.

"ఏ నెదురుగాగ మఱలించె దృష్టి నౌర
కారణాంతర మున్నట్లు కలికి నవ్వె
తద్వినయవారితుండగు దర్పకుండు
బయలు పడలేదు దాగినవాడుగాడు."

అని దుష్యంతు డనేసరికి విదూషకుడు,

"అట్లుగాక చూచిన మాత్రమున నే, నీ తొడ నెక్కునా యేమి?" అని అంటాడు. ఇందులో లోకానుభవం, స్త్రీ తత్త్వ పరిజ్ఞానం ఎంతవుందో చూడండి. ఇక యితని వాక్చాతుర్యం చూదాం:

రాజు: ఇటు దపస్విజన కార్యము, అటు గురు జనుల యాజ్ఞ. రెండునూ దాటగూడనివే. ఇపుడేమి చేయవలయును?

విదూ: త్రిశంకునివలె నంతరాళమున నిలువుము.

♦ ♦ ♦

మన్మథుడు, 'చూత శరం బెక్కుపెట్టె సఖుడ!' అని దుష్యంతుడు వాపోతే అతని విచారం పోగొట్టి నవ్వించడానికి విదూషకుడు, 'నీవు కొంచ మూరకుండుము. నే నీదుడ్డుకర్రతో గందర్ప బాణమును నాశనమొనరించెదను. (అని కర్ర నెత్తి చూతాంకురమును బడగొట్ట బోవుచున్నాడు).

కాళిదాసుని మూడవ రూపకం విక్రమోర్వశీయం. ఇదీ శృంగారరస ప్రధానమయిందే. ఇందులోని విదూషకుడుకూడా కేవలం వినోద పాత్రే. కథా గమనానికి ఇతనుచేసిందేమీలేదు. 'మూఢుడు. అన్నిటను ప్రమాది'. ఊర్వశి విసిరివేసిన భూర్జరపత్రాన్ని జాగ్రతగా కాపాడకుండా గాలికి వదిలివేసి రాజుకు చిక్కుతెచ్చి పెట్టాడు. పైగా, 'దొంగసొత్తుతో దొరికిన దొంగకు ప్రతివచనం ఉంటుందా?' అని ఊర్వశీ పురూరవుల ప్రణయ రహస్యం రూఢిపరుస్తాడు.

ఇతనికి 'ఎపుడూ తిండిమీదనే లోకము' 'యిప్పు డెచ్చట ఆత్మను వినోదపెట్టుకొందును?' అని రాజంటే విదూషకుని జవాబు చూడండి. 'వంటయింటికి వెళ్దాం' ఏ మక్కడ? 'అక్కడ పంచవిధభక్ష్యాలని దానిదాని సంబారాలతో కూరుస్తూవుండడం చూస్తూవుంటే ఉత్కంఠ' అతనికి తీరుతుందట! ఈ విదూషకునికి తోచే ఉపమానాలుకూడా తిండికి సంబంధించినవే. చంద్రోదయాన్ని వర్ణిస్తున్నాడు చూడండి. "హీహీ! ఓహో! ద్విజాతుల రేడితడు కలకండ మోదకపు సిరి గలవాడు ఉదయించినాడు".

'సన్న గరికపోచ కొసనున్న మంచుబొట్టులాగ ఇతని నాలికలో రహస్యము చాలాసేపు వుండదు'. నిపుణిక అనే దేవిచేటి కొంచెం లౌక్యం ఉపయోగించేసరికి రాజు గుట్టు బైటపెట్టేస్తాడు. పైగా భయస్తుడు. అందులోనూ పామంటే ఇక చెప్పక్కర్లేదు. ఊర్వశి విసిరిన భూర్జరపత్రాన్ని చూసి భయపడిపోయి, 'ఓయమ్మో! ఓయిబాబో!' అని కేకలు పెడతాడు.

అయితే కాళిదాసు మహాకవీ, కళావేత్తా అవడంవల్ల ఎంత వద్దనుకున్నా అక్కడక్కడా విదూషకుని నోట వజ్రాలలాంటి ముక్కలు అనిపించకపోలేదు. మచ్చుకి 'దొరకని ప్రియను పొందడానికి' విదూషకుడు ఉపాయాన్ని రాజుకు ఉపదేశించాడు. అదేమిటో తెలుసా? 'స్వప్న సమాగమకారిణియైన నిద్రను సేవించడం' ఎంతటిమొండికయినా ఈముక్కను వింటే నవ్వురాక మానదు. ఇంకోటి: ఊర్వశిరాసిన భూర్జరపత్రలేఖను అందుకొని విదూషకుడు అంటాడు: 'ఏమి మరి ఆమహనీయురాలు ఊర్వశి నీ కోరికలకు పువ్వు చూపి పండు విషయములో కినుకున్నూవుంది' మరొకటి: "చెయితెగిన చెంబటివాడు చేప తప్పించుకునిపోగా 'ఇందువల్ల నాకు ధర్మం కలుగుతుంది' అని చెప్తాడు."

కాళిదాసు చిత్రించిన ముగ్గురు విదూషకులను పరిశీలించాం. శాకుంతలం విక్రమోర్వశీయంలోని విదూషకులకు మాళవికలోని విదూషకునికీ పోలికేలేదని గమనించాం. మాళవికలోని విదూషకపాత్ర అపూర్వమయింది. విదూషకునిచేత నాటక కథనంతను నడిపించిన ప్రతిష్ఠ ఒక్కకాళిదాసుకే దక్కింది. అది అతని కొక్కడికే చెల్లుతుంది. ఈ పాత్ర చిత్రణలో కాళిదాసు చూపిన శిల్పం, భావనాశక్తీ అత్యద్భుతం. మాళవికాగ్నిమిత్రం చదువుతున్నా, ప్రదర్శనం చూస్తున్నా మన కళ్ళకి విదూషకుడు వినోదపాత్రగా మాత్రమేగాక కామమంత్రిగా గోచరిస్తాడు. ఎంతటి సాంప్రదాయజ్ఞుడయినా యీనాడు కాళిదాసుని యీ కొత్తపోకడను మెచ్చుకోకుండా ఉండలేదు.

# దీపకళిక

## శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి

అసహ్యావిక్రమః సహ్యం
దూరాన్ముక్త ముదన్వతా
నితమ్బమివ మేదిన్యాః
స్రస్తాంశుక మలఙ్ఘయత్ ♦

కంచుగీసినట్లు ఖంగుమని కంఠం మ్రోగుతోంది. పండితులు దుశ్శాలువలను భుజాలమీదనుంచి కొద్దిగా ఓసరిల్లజేసి ముందుకు తూగారు. కావ్యాన్ని కళ్ళతోనే పానంచేస్తున్నారా అన్నట్లు నుదుట వళులేర్పడేలాగ కళ్లు పెద్దవిచేసి వింటున్నారు.

కావ్యగానం ఆషాఢ గౌతమిలాగ సాగుతోంది. సుడిలోంచి సుడిపుట్టి వలయాలు వలయాలుగా విస్తరిల్లి మరొక సుడిలో కలిసి పోతున్నట్లు ఒక శ్లోకంలోంచి మరొకశ్లోకం మొలిచి కొనలుసాగి ననలు తొడుగుతూంది. ఆ కావ్యఝరీ తరంగాలతో అణువణువూ లయకలపగా రసికుల మనస్సులూ, శిరస్సులూ ఛందోబద్ధమై ఊగాడుతున్నాయి. గాన ఝరి ఉరవడికీ, పరవడికీ మలుపులు తెలుపుతున్నట్లు మధ్య మధ్య సాధు శబ్దాలు నెగడుతున్నాయి.

చామరగ్రాహిణుల కంకణక్వాణాలూ కర్పూర కరండ వాహినుల మంజీర ఝణం ఝణలూ కావ్యానికి లయ కలుపుతున్నాయి. తీగలుసాగే కృష్ణాగురు ధూమం కూడా లయానుబద్ధంగా నర్తిస్తున్నట్లనిపిస్తోంది.

కాళిదాసు మహాకవి రఘువంశ కావ్యాన్ని ఆస్వాదించడానికి కూడిన పండిత సదస్సు అది. మహాకవి ఒకొక్క సర్గనూ ముగించగానే అంతవరకూ అతికష్టం మీద అదిమిపెట్టిన ప్రశంసని జలయంత్రాలలాగ చిమ్ముతున్నారు పండితులు.

అక్కడక్కడ పొదిగిన వ్యాకరణచిత్రాలను విడదీసి వింగడించి మెచ్చుకొంటున్నారు వ్యాకర్తలు. హేతువాద చాతురిని కొనియాడుతున్నారు నైయాయికులు. ధర్మజ్ఞతను ధర్మశాస్త్రజ్ఞులూ నీతికుశలతను నీతికోవిదులూ ప్రస్తుతిస్తున్నారు. రీతినీ వృత్తినీ అలంకారాలనూ పృథక్కరించి కవిగొప్పతనాన్ని ఉగ్గడిస్తున్నారు ఆలంకారికులు. రసస్యంది అయిన ప్రతి పదాన్నీ పాదాన్నీ పదేపదే మననంచేస్తూ ఆస్వాదిస్తూ ఆనందిస్తున్నారు రసికులు.

'సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా
నరేన్ద్రమార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాలః' *

ఇలాంటి ఘట్టాలు వచ్చినప్పుడు సర్గాంతం వరకూ ఆగలేకపోతున్నారు ఆ పండితులు. ఉండంత శ్లోకంలో కొండంత భావాన్ని పొదిగిన కాళిదాసు ప్రతిభను ప్రస్తుతించకుండా వుండడం సాధ్యమా ? ఆపాత రమణీయ శ్లోకం విన్నప్పుడు ఆశుప్రస్తుతి తప్పదు.

కాళిదాసు మహాకవి గిర్వాణ వాణికి ఆరనిదీపకళికతో ఆరాత్రిక మిచ్చాడన్నారు. ఇంత గొప్ప ఉపమ అశ్రుత పూర్వమన్నారు. దీపకళికా కాళిదాసు అన్న కీర్తి ఆచంద్రార్కం నిలుస్తుం దన్నారు.

కర్పూర తాంబూలాలను మునిపంటి కొరుకుతూ వ్యాఖ్యానాలు చేస్తున్నారు. ఆదికవి రామాయణానికీ మహాకవి రఘువంశానికీ గల తారతమ్యాన్ని విడమర్చి విస్తరించి ప్రస్తరించి చెప్పుతున్నారు.

ప్రశంసలు హాయిగా చెవులకు సోకుతూవుంటే కాళిదాసుకు మనసు కావ్యపఠనం మీద నిలవలేదు. కవితాగానాన్ని కట్టిపెట్టి అతడు కూడా ఆ గోష్టికి గొంతుకలిపాడు.

---

♦ దూరానవున్న సముద్రం తొలగిన వలువకాగా మేదినీనితంబంలావున్న సహ్యాద్రిని ఆ దుర్వార విక్రముడు (రఘువు) దాటాడు.

* రాత్రిపూట రాజవీధిలోంచి దీపాన్ని కొనిపోతూవుంటే ఆదీపంగడిచి పోగానే పక్కనున్న మేడలు చీకటిమాటున మణిగి పోయినట్లు ఆమె (ఇందుమతి) పతినివరించుటకు ముందుకు పోవడంతోనే పక్కనున్న భూపాలుర ముఖాలు వివర్ణమై పోయాయి.

"ఆదికవిది ధర్మదీక్ష. రసోత్పాదనకన్న ధర్మప్రవచనం ఆయనకు ప్రధానం" అన్నాడు ఒక కప్పుర విడెమును పుక్కిట పట్టుతూ.

"జ్ఞానచక్షువు అర్ధసత్యాన్నే చూస్తుంది. అనుభూతి కూడా వుంటే కాని పూర్ణసత్యం సాక్షాత్కరించదు"

కాళిదాసు ఒకసారి పండితమండలి వంక చూశాడు తానన్న దాన్ని కాదనగల వారెవరైనా వుంటారేమోనని. అంతా చిరునవ్వులతో ఆయన వాదాన్ని అభినందించారు. కాళిదాసు అందుకొన్నాడు.

"కావ్యానికి జీవం రసం. రసాలలో మిన్న శృంగారం. అసలు శృంగార మొక్కటే రసం తక్కినవన్నీ ఆభాసలు అన్నా ప్రత్యవాయంలేదు"

ఆ వాదన నెవరూ కాదనలేదు. పైగా కొందరు మనసులలోనే దానికి కొనలు సాగించారు. దానితో రసవైశేషిక సిద్ధాంతాన్ని ప్రతిష్టించవచ్చునని పదకాలు వేశారు కొందరు వైశేషికులు. అన్ని రసాలూ శృంగారంలోంచే ఉద్బుద్ధమౌతాయి. అందులోనే లీనమౌతాయి మిగిలేది శృంగారరసం ఒక్కటే. సాధు సాధు! వాదన చాలా బాగుందనుకొంటున్నారు.

"అది కవి బ్రహ్మచారి. ఆయనకు శృంగారం ఊహామాత్రమేకాని అనుభూతంకాదు. అలాంటప్పుడు రామాయణంలో శృంగారంలేదని ఆది కవిమీద అలగడం అనవసరంగదా!"

మరొక తమలపు మడుపందుకొని చామరగ్రాహిణివైపు అలవోకగాచూశాడు కాళిదాసు. చామరగ్రాహిణి మొలకనవ్వు చిలకరించింది.

నాటికి కావ్య పఠనం ముగిసింది. పండితులు తాంబూలాలుకొని మహాకవిని మరొక్కసారి పొగిడి మరీ సాగారు.

పండిత గోష్ఠి ముగిసింది. విలాసినులతో ఆపాన గోష్ఠి మొదలైంది. విలాసినుల కలహాసంతో పోటీలు పడుతూ కాపిశేయ మైరేయాలు నురుగులు విరజిమ్ముతున్నాయి.

విలాసినుల చేలాంచలానిలం సోకిన దీపకళికలు వారిలేనడుముల్లాగ కనపిస్తున్నాయి. ఆకంపనలో ఒక్కొక్క దీపమే అనేక రూపులు దాల్చిరాసమండలంలాగ కనిపించింది. ఆ కేళికూటం రాసనృత్యం చేసే దీపకళికలతోజ్యోతిశ్చక్రంలా తిరుగుతున్నట్లనిపించింది. దీపకళికా కాళిదాసు కీర్తిని గానం చేస్తూ దిగంతాలలో అప్సరసలు లాస్యంచేస్తున్నారనిపించింది. అప్సరసల కాలిగజ్జెలు పండిత ప్రశంసను ప్రతిధ్వనిస్తున్నట్లు తోచింది.

ఒక్కొక్క చషకమే గొంతులోంచి దిగుతున్న కొద్దీ పండితుల ప్రశంసలు మహాకవి గుండెలలో మురజల్లాగ కాహళుల్లాగ దుందుభుల్లాగ మ్రోగుతున్నాయి.

విలాసినుల మేని వెచ్చదనమూ ఊర్పుల వేండ్రమూ అతని నెత్తురును కవ్వించి ఆమ్రోతలను ఇబ్బడిముబ్బడి చేస్తున్నాయి.

ఉండలుకట్టిన దూది నారిదెబ్బలకు తునాతునకలై రాసిపడినట్లు ఆమ్రోతలు కాళిదాసు మనసూ శరీరమూ తూలంలాగ తేలిపోతున్నాయి. ప్రశంసాత్మణావర్తంలో పడి గిరగిర తిరిగి ఎగిరిపోతున్నాయి. మనశ్శరీరాలను నిగ్రహించుకొనడానికి ప్రయత్నించాడు. కాని ఫలితం లేకపోయింది.

ప్రళయజంఝకన్న ప్రబలమైనది ప్రశంస. అది సోకుతేచాలు ఎలాంటి గురుపదార్ధమైనా తూలంలా తేలిపోతుంది.

దేవుడంతటివాడే స్తోత్రాలకు ఉబ్బిపోయి నిగ్రహశక్తినీ ఉచితానుచిత వివేచనను కోల్పోతాడు. కాకుంటే వృత్రాసురులూ భస్మాసురులూ హిరణ్యాక్షులూ అంతెంత వరాలెలాపొందగలిగేవారు? తానో ఒకమానవ మాత్రుడు. ఈ సుడిగుండంలోపడ్డాడు. బైటపడ్డానికి ఏదైనా ఆలంబనం దొరుకుతే బాగుండును అనుకొన్నాడు.

అంతలో ఏదో చల్లనిచేయి వెన్ను నిమిరింది. మనస్సు కాస్త నిలవరించుకొంది.

తెల్లని జడలతో హిమవంతుని లాంటి రూపు ఒకటి కట్టెదుట కానిపించింది. అక్షమాల దండం కమండలువు మూపున కృష్ణాజినమూ ముఖాన వెన్నెలలాంటి చిరునవ్వూ అంతా మనసులో మెదులుతున్నరూపే. అదే – అతడే – వాల్మీకి!

కాళిదాసు వినయంగా అభివాదంచేసి ఆశీస్సులందుకొన్నాడు. ఆయనకు ఆసనంచూపి అనుమతి బడసి తాను కూర్చున్నాడు కదులుతూన్న పెదిమలవంక చూస్తూ.

ఆయనకూడా తన కావ్యాన్నే మెచ్చుకొన్నాడు. తన కవిత్వాన్ని కొనియాడాడు. కాస్త నిలవరించుకొంటున్న మనస్సు దానితో మళ్ళీ మత్తిల్లింది. శరీరం శరన్మేఘంలాగ పరుచుకుంటూన్నట్లనిపించింది. అంతలోనే కశాఘాతంలాగ తగిలిం దొకమాట.

"నీ కావ్యం గొప్పతనాన్ని ఉగ్గడించుకోవడం మంచిదే. ఆత్మస్తుతివల్ల అంత ప్రత్యవాయం లేదు. కాని వర్ధిష్ణువువి పరనింద ఎందుకు బాబూ!" అన్నాడాయన.

ఆమాటతో తిరిగి ప్రకృతిలో పడ్డాడు కాళిదాసు. స్తుతికి అలవాటుపడ్డ మనస్సు సుత్తిదెబ్బలాంటి మాటల నోర్వలేదు.

సంస్కృతకవి ప్రపంచంలో సాటిలేనిమేటి అయిన తనను ఆత్మస్తుతీ పరనిందా దోషాలకు పాల్పడిన అధముడుగా లెక్కకడతాడా ఈయన అని రోషం వచ్చింది.

తనసంగతి తాను చెప్పుకోవడం దోషంకాదు. దానికి ఆత్మస్తుతి అని పేరుపెడితే ఏమనాలి? తానెన్నడూ ఒకరిని నిందించలేదు. అయినా ఆ దోషాన్ని ఈయన తన తలకు చుడుతున్నాడు. అదేదో తేల్చుకోవడం మంచిది అనుకొన్నాడు. ఆ విషయాన్నే అడిగేశాడు. రెప్పలార్పక ఒక్కక్షణం కాళిదాసు కళ్ళల్లోకిచూసి వాల్మీకి అన్నాడు.

"నా రామాయణంలో శృంగారం ఎక్కడా కానరాదన్నావు జ్ఞాపకంవుందా?"

అవును అన్నాడు. అందులో పరనింద ఏంవుంది. అది అక్షరాలానిజం. ఆ మాటే అనేశాడు కాళిదాసు. వాల్మీకి మరొక్కసారి తేరిచూశాడు.

'అదికాదుబాబూ, అసలు రామాయణాన్ని నీవు చదివావా?'

అలాంటి ప్రశ్న తానెన్నడూ వినవలసివస్తుందనైనా ఊహించలేదు కాళిదాసు. అనూహ్య అవమానం హఠాత్తుగా పైకొన్నప్పుడు క్రోధం సహస్ర ఫణాలు విప్పి బుసలు కొడుతుంది. అంతవరకూవున్న అస్వాధీనత ఆ ప్రశ్నతో అంతరించింది. కాళిదాసు కళ్ళు జేవురించాయి. నాసాపుటాలు కుంచించుకొన్నాయి. అదురుతూన్న అధరాన్ని మునిపంట నొక్కిపట్టి ఉద్రేకాన్ని ప్రయత్నం మీద అణచుకొన్నాడు.

రామాయణాన్ని తాను చదివింది ఒక పర్యాయంకాదు. ఇప్పటికి అనేక ఆవృత్తులయ్యాయి. అన్నిసార్లు సవిమర్శగా చదివినమీదటనే వాల్మీకికి శృంగారం తెలియదని తాను నిర్ధారణ చేశాడు.

ఈ వితర్కంతో ఆత్మవిశ్వాసం పెంపొందింది. క్రోధం కరిగిపోయింది. అదిరే పెదిమలు చిరునవ్వు చిందిస్తూ వికసించాయి. అవహేళనాతరంగం ఒకటి మనసులోంచి పొంగింది.

"అయితే తాతా త్రికాలవేదివి – నేను రామాయణం ఎన్నిసార్లు పారాయణ చేశానో చూడలేవా?" అని అడిగేశాడు.

'జ్ఞాన చక్షువు అర్థ సత్యాన్నే చూస్తుందికద బాబూ!'

ఆమాట చురకలా తగిలింది కాళిదాసుకి. పండిత గోష్ఠిలో వాల్మీకిని గురించి అతనన్నమాటే అది.

కాళిదాసు కొంచెం కలవరపడ్డంచూసి సంభాషణ తానే సాగించాడు వాల్మీకి.

"ఇరవై నాలుగువేల గ్రంథం-రామాయణం అంతా చదవడం సాధ్యం కాకపోవచ్చును. పోనీ ఒక్క కిష్కింధాకాండ అయినా చదివావా? నీ మనోవృత్తికి తగినకాండ అది"

ప్రతిమాటా చురకలా తగులుతోంది. అంతవరకూ స్వోత్కర్షతో తూలంలాపొంగిన కాళిదాసు ఆ చురకలకు కుంచించుకు పోతున్నాడు.

మళ్ళీ అందుకొన్నాడు వాల్మీకి.

'నీవు కుర్రవాడివి. సుకుమారివి. పఠనక్లేశానికి ఆగలేవు. కందిపోతావు. పోనీ కిష్కింధాకాండలోని శరద్వర్ణనను చదువు చాలును.'

ఏంజవాబు చెప్పాలో తోచడంలేదు కాళిదాసుకి. హిమాంబువుల్లాగ తొలుత గిలిగింతలు పెట్టిన వాల్మీకి వాక్కు ఇప్పుడు హిమానీనదంలాగ విరుచుకొని పడుతోంది.

వాల్మీకి కృష్ణాజినంలోంచి ఒక భూర్జపత్రాన్ని తీశాడు.

'పోనీ ఒక్కశ్లోకం, శరద్వర్ణనలోది ఇది.' అని ఆ భూర్జపత్రాన్ని కాళిదాసు కందించాడు.

భూర్జపత్రం మీది నల్లని అక్షరాలు కంటికి చిక్కకుండా పాముల్లాగ మెలి తిరుగుతున్నట్లనిపించింది కాళిదాసుకి. ఊపిరి బిగపట్టి దృష్టిని లగ్నంచేసి కంపిత స్వరంతో చదివాడు.

"దర్శయన్తి శరన్నద్యః
పులినాని శనై శ్శనైః
నవసఙ్గమసవ్రీడా
జఘనానీవ యోషితః" ♦

♦ నవవధువు సిగ్గుతో మెలమెల్లగా పావడ కొంగు పైకెగదీసి జఘనాన్ని చూపిస్తున్నట్లు శరత్కాలంలో నదులు క్రమక్రమంగా నీరుతీసి పులినస్థలిని బైటపెడుతున్నాయి.

అదిపదివి అప్రతిభుడయ్యాడు. కాని అంతలోనే తేరుకొన్నాడు. అంతవరకూ ముఖస్తుతులవల్లా ఆత్మస్తుతివల్లా మనసులో ఏర్పడిన ఉబ్బు తీసింది. వివేచన తిరిగి వచ్చింది. వాల్మీకి తనలో చూపిన ఆత్మస్తుతీ పరనిందా దోషాలేమిటో స్పష్టంగా కళ్ళకు కట్టాయి.

కన్నెత్తి వాల్మీకి ముఖం చూడలేకపోయాడు. పాదాభివందనంచేసి తల వంచి నిలిచాడు.

వాల్మీకి వాత్సల్యంతో కాళిదాసు తల నిమిరాడు. మునివేళ్ళతో చుబుకంపట్టి ఎత్తాడు. కాళిదాసు కళ్ళు చెమ్మగిల్లాయి. వెన్నెలలు వెదజల్లే వాల్మీకి పండు ముఖాన్ని చూసి ఆ తేజస్సుకు దోయిలించాడు. కంఠంలోంచి మాట వెలువడ్డంలేదు. నాభినుంచి బయలుదేరిన వాగ్ధార కంఠాదేశానికి వచ్చేసరికి శిథిలమౌతోంది. ఆ శిథిలవాక్కుతో అన్నాడు :

"శివ జటాజూటంనుంచి గంగ పుట్టినట్లు కవితా వాహిని పుట్టింది నీలోంచి. ఆ వాహినికి కాలవలు తవ్వి చిన్నచిన్న దొరువులు నింపిన మేము మహాకవులమని మురిసిపోతున్నాము."

వాల్మీకి వదనం వేయి పున్నమి చంద్రులలాగ వెలుగుతోంది. అంతకుముందు ములుకుల్లాంటి మాటలకు గాయపడ్డ కాళిదాసు మనస్సు ఆ వెన్నెలల చల్లదనానికి పుంజుకొంది.

"భూమిమీద కాలు జారినవారికి ఆ భూమే అలంబనం. అలాగే నీ పట్ల అపచారం చేసినవారికి నీవే శరణ్యం."

అని నుదుట కేలుమోడ్చి శిరస్సు వంచి నమస్కరించాడు కాళిదాసు. గంగానది తరగలగలగలలాగ నవ్వుతూ దీవించాడు వాల్మీకి.

కన్నెత్తి చూసేసరికి కట్టెదుట వాల్మీకి లేడు. ప్రాంగణంలో ఉషోదేవికి స్వాగతగీతాలు పాడుతున్న పిట్టల కలరుతాలు వినిపించాయి. రాత్రి రాసక్రీడలు సలిపిన దీపకళికలు కనులుమూశాయి. కాని తొలి సంజె కెంజాయతో ఇంకా కెంపెక్కిన విలాసినుల మధుకషాయిత నేత్రాలు దీపకళికల్లాగ కనిపించాయి.

---

శామ్యేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః॥

దుర్మార్గుడికి ఉపకారంచేసి వానిని దారికి తేలేము. ప్రత్యపకారం చేస్తేనే తగ్గుతాడు.

♦ ♦ ♦

విషవృక్షోపి సంవర్థ్య స్వయంఛేత్తు మసాంప్రతం॥

చేత్తో పెంచినది చెడ్డచెట్టయినా, కొట్టెయ్యడం భావ్యంకాదు.

♦ ♦ ♦

ప్రణిపాత ప్రతీకార స్సంరంభో హి మహాత్మనాం॥

మహాత్ముల కోపం నమస్కారంతో చెల్లు.

♦ ♦ ♦

కి మివహి మధురాణాం మండనం నాకృతీనాం॥

అందమైనవాళ్ళకేది పెట్టినా అలంకారమే.

## కాళిదాసు

# మేఘ సందేశం

## (ఒక ప్రవేశిక)

విద్వాన్ విశ్వం

కవి కులగురువు కాళిదాసు భావన కట్టలు తెగగొట్టుకొని మేఘసందేశంలో పరవళ్ళు త్రొక్కినది.

ఒక్క మబ్బుతునకను పట్టుకొని ముక్కోటి మురువులు చూపగల కవిత్వపాటవం ఇంతదీ అంతదీ కాదు.

ఎక్కడి కక్కడే ఏమాట కామాటే - ఎన్ని కావ్య ఖండికలనో ఆయింతలో వెదజల్లినా డాయన.

ఆదికవి నడచిన దారిలో నడుస్తున్నానేగాని నాదేమున్నదన్నట్లు రఘువంశంలో "మణినా వజ్రకీర్ణేన సూత్రస్యేవాస్తి మే గతిః" అన్నాడు. కవి (వాల్మీకి) కీర్తిని కామించి నవ్వులపాలవుతున్నాడేమోనని ఆనాడు అనుమానించినాడు.

పాతవానికున్న గౌరవం నా కొత్తరచన కెట్లా వస్తుంది—అని తటపటాయిస్తూనే మాళవికలో 'పురాణమిత్యేవ న సాధు సర్వం- నచాపి కావ్యం నవమిత్యవద్యం' అని సరిపెట్టు కున్నాడు.

మహోదాత్త వస్తుసంభరితమైన కుమార సంభవం 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా' అని ఆ విషయ గురుతను ఆదిలోనే చెప్పి అఖండ కవితా స్రవంతిని అలవోకగా నడిపించినాడు.

చిన్ననాడే పదిదిక్కులూ కొత్త పచ్చడాలు కట్టుకోవడంచూచి ఆరు ఋతువులనూ హాయిగా కొనియాడి ఆరితేరినవాడు.

మేఘసందేశం ఆరంభించేసరికి ఆ అనుమానాలూ లేవు; ఆ అవసరాలూ లేవు. అతిపరిణతమైన ఆయన భావన అంతరిక్షంలో అరవైనాలుగు విద్యలనూ ప్రదర్శించగలదన్న నమ్మకం గుమ్మటమై నిలిచినది.

అనగాఅనగా ఒకరాజు అన్నట్టుగానే ఒకానొక యక్షుడు - అని ఎత్తుకొని వస్తుపవిత్రతగాని, గురుతగాని కాక తదన్య మహత్త్వం చూపించనున్నాను సుమా అని హెచ్చరించాడు.

తన మహోదర్శమూర్తి వాల్మీకి హనుమత్సందేశం అంతరాంతరాలలో మంతనాలాడి ఉండవచ్చును. కాని అది ఒరవడి మాత్రంకాదు.

అట్లే అశోకచ్ఛాయలో అలమటించే సీతమ్మ విరహిణీ విశ్వరూప సందర్శనం చేయించి ఉండినా ఉండవచ్చును. కానీ అంతయెత్తు మనిషిని తానందుకోలేదు.

'ఈమెను వదలి రామచంద్రుడు బ్రతికి ఉన్నాడంటే ఆశ్చర్యమే' అని హనుమంతునకే అనిపించిన మహోన్నత మహిళను తాను పరిగ్రహించలేదు.

రామునివంటి లోకోత్తరవ్యక్తిని తాను ఆలంబనంగా చేసుకోలేదు.

ఆనాటికే జనమనఃకందరాలలో చిత్రించుకొన్న ఏ ప్రాచీనపాత్రనూ ఊదుకొని నడవలేదు.

ఒకానొక యక్షుడు, తన పనిలో పొరవడినందుకై యజమాని శపింపగా రామగిరి ఆశ్రమంలో ఉన్నాడు- ఆ రామగిరి ఆశ్రమ పదాలుమాత్రం పవిత్రమైనవని చెప్పదలచి, 'జనక తనయా స్నానపుణ్యోదకము'లని అన్నాడు.

అయినా అది రామగిరి. అక్కడ సీత తిరుగాడినది- అన్నంతమాత్రంతోనే తనకు రామాయణకావ్యంపైనా, వాల్మీకి కవిపైనావున్న పరమోత్కృష్ట భావాన్ని మాత్రం సూచించినాడు.

ఉపమానాలలో గాని, లలితపద ప్రసారంలోగాని ఉదాత్తగతిలోగాని; ఉత్తమశ్రుతిలోగాని- అన్నిటా కాళిదాసుకు అర్హమైన ఆదర్శం, ఆదికవి అపురూపమైన ఆ రచనా ప్రాగల్భ్యమే.

అంతేకాదు, ఆ ఆదికవి నందుకోగల ఔన్నత్యం కూడా కాళిదాసొక్కడే అంతైనా ఇంతైనా అందుకున్నాడు. మరొక ఏ కవికీ అంతటి పుణ్యం పట్టలేదు.

తన అంత ఉన్నతినీ ఆ యింతమేఘంలో కూరి కూరి పోసుకున్నాడు కాళిదాసు. ఆ మబ్బును మైనంలా

అటు ఒత్తీ, ఇటు ఒత్తీ అయిదువందల రకాలుగా గండరించుకున్నాడు.

నిజమే.అది కేవలం 'ధూమజ్యోతిస్సలిల మరుత్తుల' సన్నిపాతమే – అది సందేశహారమెలా అవుతుందంటే కామార్తులు ప్రకృతి కృపణులుకదా చేతనాచేతనము లన్నీ ఒకటే- అని ఇందులో ప్రధానమైనది ఆ విరహార్తుని విధురజీవన విరాడ్రూపమేనని నోరారా ముందే చెప్పివేసినాడు.

రామగిరిలోఉన్న ఆ యక్షుడు అప్పటికే చిక్కి సగమై ఉన్నాడు. ఆషాఢం వచ్చింది. మబ్బు కొండ చరియపై నెలకొన్నది. అతని కెందుకో కుతూహలం కలిగి అలా పరికించి పరికించి కలగుండువడి కన్నుల నీరు చిప్పిల్లగా విలవిల లాడినాడు.

"జలదాలోకమ్మున
మనసులు కలగున్
సతుల గూడి చొక్కువారికే!
తెలుపగవలెనా యిక,
చెల్వలకున్ దూరముగ
నున్నవారి యవస్థల్"

అప్పుడో కుసుమాంజలితో అయ్యా నీవు వెళ్ళి అలకాపురిలోఉన్న నా అంగనతో ఒక్కమాట చెప్పి రావాలిసుమా అని దారీతెన్నూ, ఆ నగరూ, ఆఅంగనా వరుసగా ఏకరువు పెట్టసాగినాడు.

"పనికాకున్న సరే
గుణఖని నే యాచింపవలయు;
ఖలుని యాచనన్
పనియైనసరే,
అడుగన్ చనదెప్పుడు......"

అందుకనే నిన్నడుగుతున్నాను మిత్రమా అని ఒకనీతిని కూడా సూత్రీకరించి యక్షుడు తన సొద వెళ్ళబోసుకున్నాడు.

ఈ కావ్యంలో ఇవీ పరిమితి – ఇందులోని పాత్ర లన్నీ మబ్బూ, మెఱుపూ, ఇంద్రధనుస్సూ, దారిలో నదులూ, కొండలూ, నగరాలూ, పల్లెలూ, పొలాలూ, అటుఅటున్న దేవాలయాలూ, అక్కడక్కడా కని పించే అంగనలూ వారూ వగైరా.

మరి వీనిలో ఒకచోటమబ్బు మరొకచోట ఉండి నట్లుండదు. ఒకసారి మెఱసినట్లు ఆ మెఱపు మరొక సారి మెఱవదు. ఒకచోట కనిపించినట్లు ఇంద్రధనుస్సు మరొకచోట కనిపించదు. ఒకనది మరొక నదిలా కానరాదు. ఒక నగరం, ఒక ఆలయం – మరొకదానితో పోలిఉండవు.

ఒక్క మబ్బునే ఎన్నెన్ని రకాలుగా రూపొందించి నవో ఆ కవిప్రతిభ చూడండి.

రామగిరి శిఖరంనుండి ఎగిరీ ఎగరగానే ఈ కొండ కొమ్మగాలికి ఎగిరి పోతున్నదేమిటి? – అని ముగ్ధ సిద్ధాంగనలు చూస్తారట.

ఆ మేఘం, పైపడిన ఇంద్రధనుస్సుతో నెమలిపురి తలపైదోపుకున్న బాలగోపాలకృష్ణునిలా ఉంటుందట.

సిద్ధాంగనలు అలా అనుకుంటే, ఆ ప్రక్కనే పల్లె పట్టులనున్న పడతులేమో ఆదర ముట్టిపడగా ఇక పంట పరవా లేదనుకుంటారట.

గవాక్షాలలోనుంచి వచ్చే కేశసంస్కార ధూపంతో బలిసి, బంధుప్రీతితో నెమళ్ళు నృత్యప్రదర్శనలు చేయగా చూచి అలత తీర్చుకొని మహాకాళానికి వెడితే అక్కడి ప్రమథగణాలు మేఘాన్ని, తమ పరమేశ్వరుని కంఠచ్ఛవిగా ఉన్నదే అనుకుంటారు.

అక్కడ మేఘం మహాకాళేశ్వరుని పూజా సమయంలో ఉరిమి బలి పటహమవుతుంది. అప్పుడుగానీ నీ స్నిగ్ధగంభీర ఘోషలకు ఫలమబ్బదు నాయనా యంటాడు యక్షుడు.

సాయంకాలం. కావిరంగు కలకలలాడుతున్న మేఘం కాళేశ్వరుని కప్పుకొనగా, అప్పుడప్పుడే తీసి నెత్తురు తడిలోనున్న గజచర్మంలా ఉంటుందట. అయితే అప్పుడు ఉద్వేగం తగ్గించుకొని పార్వతికూడా భక్తితో చూస్తుంది లెమ్మన్నాడు.

ఆ ఉజ్జయనిలో ఆరాత్రి ఉఱుములూ మెఱుపులూ లేకుండా ఉండమంటాడు. ఎందుకంటే.

"పురిలెక్కి చిమ్మచీకటి
పురవీథుల గ్రమ్మి
చూపు పొలకువ లార్చన్
తరుణులు రేయిన్
సరసుల సరసకు
చనుచుందు రా విశాలానగరిన్.
"జడివానల ఉఱుములతో
జడిపింపకు, వారు
గుండెచాలని బేలల్;
విడువక బంగరు మెఱుపుల
పుడమిన్ జూపించు
పుణ్యమున్ గొనుమయ్యా"

ఇక్కడ నెమ్మదిగా మెఱపు కండ్లతో దారి చూపించే మార్గదర్శి అయినది మేఘం.

ఇక వెళ్లమంటూ అందుకూ ఒక కారణం చెప్తాడు కవి.

"అది ప్రియులు ఖండితల
కనుతుదలన్ జిప్పిల్లు నీరు
తుడుచు వేళ; అంబుద !
కావున రవి మార్గము
వదలన్‌వలె నీవు
తెల్లవారిన తోడన్"

గంభీరానదిలో మేఘచ్ఛాయ పడగా ఆమె మీను చూపులను నిగిడిస్తుందట. విడిచిపోవద్దంటాడు.

అక్కడ ఒక చిన్నదృశ్యం అన్ని వివరాలతో కవి చూపుతాడు.

నది సన్నగా పారుతూఉంది. తీరంలో ప్రబ్బలి చెట్ల రెమ్మలు నీటిపై జీరాడగా నిలచి ఉన్నవి. ఆ నీటి చెఱగును ఆ రెమ్మచేతులతో పట్టుకున్నట్లున్నది. నీవు కాస్తా ఆ నీటి చెఱగును తొలగించవుంటాడు. అవును మఱి ఆకాసిని నీళ్లు తాగితే వద్దన్నా ప్రబ్బలి రెమ్మల చేతులు జారిపోతాయి.

నది దూరంనుంచీ చూస్తే భూమికి హారంలా ఉంటుంది. అందులో మేఘం వాలినప్పుడు – అది ఆ హారంలోని ఇంద్రనీలం (పతకం)లా ఉంటుందని చర్మణ్వతిదాపున ఉన్న మేఘాన్ని వర్ణిస్తాడు.

సరస్వతీ జలం త్రాగిన మేఘాన్ని పులుకడిగిన ముత్యంలా ఉంటావయ్యా అంటాడు – అయితే నలుపు ఒక్కరంగులోనే మిగుల్తుంది.

"కలదు సరస్వతి యట
ఆ జలముల సేవించి
కిల్మషమ్ము తొలంగన్
నలు పొక రంగున మిగులన్
పులుకడిగిన ముత్యమట్లు
పొలుచుమ లోనన్."

గంగానదిలో నీరు త్రావుటకై తలసాచి మేఘం ఐరావతంలా ఉన్నట్టుందట. ఆ తెల్లటి నదిలో ఈ నల్లటి మేఘం పడినతావు యమునా సంగమంలా ఉంటుందట.

కొండపైమేఘం గున్నయేనుగనుకొని శరభాలు ఎగురుతాయట. కానీ పాపం వెంటనే "అవి చప్పన నేలంబడును వెన్నుపూసలు విఱుగన్". ఔనుమరి "కొఱగాని పనుల కెగబడు తెఱవాటులన్ బ్రదుకు లిట్లె తెలతెలవారున్."

అక్కడే పశుపతి సంగీతానికి ఉఱుములతో మేఘం మద్దెల వాయిస్తాడు.

తెల్లటి వెండికొండపై క్రమ్ముకున్న మబ్బును, నల్లని వలువ కప్పుకున్న బలరామునితో పోలుస్తాడు.

అక్కడే మఱొక అతిలోకమూ అద్భుతమూ అయిన మబ్బురూపాన్ని మనకు చూపిస్తాడు – కాళిదాసు.

పార్వతి ఎంతయినా భయస్థురాలు – లలిత హృదయురాలైన లలన కదా. పాపం భయపడు తుందేమోనని తన చేతిలోఉన్న సర్పకంకణం తీసివేసి, నడవలేదని కైదండయిచ్చి ఈశ్వరుడు కాస్త విహారింతా మని నడిపిస్తూఉంటాడు. అప్పుడు మేఘుడేం చేయాలో ఎంత బాగా చెప్తాడు. వెంటనే నీటినంతటినీ స్తంభింప జేసుకొని తన శరీరాన్ని ఆమెముందు ముడుచుకొని మడతలు మడతలుగా సోపానపంక్తిగా తయారు కావాలట. ఎంత అపురూపమైన భావన !

"జలమున్ లోన బిగించుక
పలుమెట్లుగ మేను మడచి
పఱచుక, ఉమ ముంగల
రత్నతటారోహణములకై
సోపాన రూపమున్ గొనుమన్నా !"

అంతేకాక అక్కడ మేఘాన్ని మఱొక రూపంతో చూపుతాడు.

అంతదాకా చినుకు పడక మహా ఉక్కగా ఉంది. మేఘం కనిపించీ కనిపించగానే అక్కడి దేవకాంత లందఱూ వచ్చి గబాలున పట్టుకొని తమ గాజులతో గీరి గీరి ధారాయంత్రంలా చేసివేస్తారు.

అపుడు మబ్బును పట్టుకొని సూదితో కట్టితే నీరు చిమ్మదూమఱి – గీచినా అంతేకదా – అపుడు భావన పరాకాష్ఠ నందుకొన్న దిక్కడ.

"కరవలయ కులిశఘట్టన
సురయువతులు వచ్చివచ్చి
సురసుర నీటిన్
విరజిమ్మజేసి నిన్
సేతురు, ధారాయంత్రు
గృహముతో సరితూగన్."

అప్పుడేంచేయాలో ! ఆ అదేముంది–ఒక్కసారి గట్టిగా ఉరిమితే సరి ఎక్కడివారక్కడ పారిపోతారు !

ఇట్లా ఒకొక్కచోట ఒకొక్క తీరున మేఘాన్ని మైనమంటే మైనంగానే ఉపయోగించుకున్న కవి అమేయ ప్రతిభ అద్భుతం !

ఇక నదులను నాయికలుగా కట్టిన చీర కట్టకుండా తొడిగిన రవిక తొడక్కుండా ఎన్ని రూపులతో చూపించినాడు !

వింధ్యాద్రి ఉపత్యకపై రేవానది చెదరి పారుతూ ఉంటుంది. అదంతా రాలమయం గనుక చీలికలై పారు తుంది. అదెట్లా ఉన్నదంటే ఏనుగుమీద లిఖిత రేఖలను తీర్చినట్టుగా ఉంటుందట.

"కరిమదతిక్తపరిమళ భరితము
జంబూనికుంజ పరిహృతరయము
అవ్వర వారి ద్రావి
ముందటు కుతేసిన సత్త్వమ్ము
తిరుగ గూర్చుక చనుమా !

అంతస్సారం ఉంటే అప్పుడు నిన్ను గాలి కదపలే దంటూ అక్కడే ఒక నీతి చెప్పాడు.

"రిక్తుండెంతయు లఘుతరుడగు
పూర్ణాంతరునకు
గౌరవము తనంతన వచ్చున్."

ఆ తర్వాత నిర్వింధ్యను వర్ణిస్తాడు.

"అల చిందుల మొఱసెడు
నంచల మొలనూల్,
జాఱునడల సొరుల్,
సుడి పొక్కిలిజూపు హొయలుగల
నెచ్చెలి నూ నిర్వింధ్య
దారిచెంగట నుండున్.
"జవరాలా నిర్వింధ్యన్
గవసి రసాభ్యంతరుడవు
కమ్ము వయస్యా
చవులూఱుచు పోడుము లే
పువుబోడుల మొదటి
వలపు పుత్తడి పలుకుల్.
"దరులుగల తరులు రాల్చిన
పరిణత పత్రముల
పాండు వర్ణాంబువులన్
చిరుపాయగట్టి సగమై
తెఱవ నినుంబాసి
వనట దేలుచునుండున్."

ఆమెను అలరించి పొమ్మంటాడు—

గంభీరానది నీరు నిర్మలమైన మనస్సులా ఉంటుం దట! ఎంత ఉదాత్తమైన పోలిక. కటిజార్చిన ఆమె చెలువము ముందే మనం చూచాము. ధరణీహారంవలె కనిపించే చర్మణ్వతినీ చూచాము.

సరస్వతీజలం త్రావితే నీవంటి నల్లనివాడి మన సంతా తెల్లనైపోతుందంటూ అంటాడు.

"తన రేవతి కనుగుఱుతుల
మునికొని చవులూర్చు
కల్లుమంత విడిచి
త్రావెను బలభద్రుం
డీ జలము నె—"

అవును ఎంతగొప్ప యోగ్యతాపత్రం. త్రావుడు అన్నింటికంటే ఆనందకరం. అందులో తన ప్రేయసీ భార్యా రేవతి కళ్లందులో ప్రతిఫలించగా అందిస్తూ వున్నదాయె. అలాంటి దానినే నిత్యపానాసక్తుడైనా బలరాముడు వదలి ఈ నది త్రావినాడట !

ఇక హిమాద్రితనయా, సగరనందన స్వర్గ నిశ్రేణికా అయిన గంగానది ఎంత ముచ్చటగా గీసి చూపించినా డని !

"తను గని,
గౌరి బొమల్ ముడిచిన,
నురుగుల నవ్వి
తరగ చేతుల నెలవంకను గదిసి
శివుని సిగబట్టిన
గడుసరి గంగ..."

అమ్మమ్మ! తెలిపటికరాలవంటి ఆ నీరు త్రావ మన్నాడు.

ఇక కొండలను చూచి ఊహించుకున్న పదచిత్రాలు సహజ మధురాతి మధుర స్వరూపాలు.

రామగిరి రామపదపంకరుహాంకిత మన్నాడా! ఆ తర్వాత ఆమ్రకూటం నిన్ను నెత్తిన పెట్టుకుంటుం దంటూ ఒక సామాన్య సత్యం చెప్తాడు.

"తన కాశ్రయ మిమ్మని
వచ్చిన మిత్రుని క్షుద్రుడైన
కృతము నెఱిగి
రమ్మనకుండ లేడుగద !
అంత నగాధపు మాట
వేఱె తలపగవలెనా ?"

నీవు ఆ కులపై వాలినపుడు ఆ గిరి ధరణీమాత పయోధరంలా ఉంటుందంటాడు. ఎంత గొప్ప మనసైతే నోగా ఇంతింత ఊహలు-బ్రహ్మాండాన్నంతటినీ చిన్న యిల్లులా భావించి ఏడు నిలువుల ఎత్తున బారెడు కుంచెతో చిత్రించే మహాస్వరూపాలు-అందటికీ అందు బాటులోకి రాగలవా !

నీచైర్గిరి ఊరికి దగ్గరలో వుంటుంది. అక్కడి జవ్వనులా యువకులా పొరలాటలు మరి తప్పవుకదా-

"వారస్త్రీ రతి పరిమళ
మూరించెడు నచటి
కొండ యుప్పరిగలు,
వేనోరుల నాగర యౌవన
సారము సత్త్వమ్ము
దెసల దాటుచు నుండున్"

ఇక హిమాలయంలో విడిసిన కస్తూరిమృగాల కస్తూరి వాసనలు ఘుమఘుమలాడించినాయి. ఆ కొండ మీద ఉన్నదేమో గట్టిమంచు. మేఘం దాని మీద కాస్త మెత్తగా ఉన్నప్పుడు ఈశ్వరుని గిత్త తొక్కగా ఏర్పడిన అడుగులులాగా ఉంటుందట.

పాపం ఆ కొండనిండా దేవదారు తరువులే. తటాలున కాఱుచిచ్చు లేస్తుంది. చమరి మృగాలకు వాలాలు రోమరాశులే కదా - వానికి నిప్పు తగలదా - ఆ పర్వతం బాధపడుతుంది. కాస్త వాన కురవాలట.

"పరసంకటముల తీర్చుటకే
చిక్కటి గుండెల వారి
కలిమి కడిది పయోదా!"

ఆ కొండలో

"వెదురుల దూఱుచు
తెమ్మెఱ కొదమలు
కలరవము సేయు
గొంతు కలిపి
పాడుదురు చెలికాడ!
కిన్నర మదవతు లట
త్రిపుర విజయమధుర పదమ్ముల్"

అప్పుడు మేఘం మద్దెల వాయించడం తప్పదు కదా?

ఇక కైలాసం నిర్జర వనితా దర్పణమే. శివుడు ముందే అతి ధావళిచ్ఛాయ కలవాడు. ఆయన రోజూ నవ్విన నవ్వులన్నీ ఒక్కచోట రాసి వోసినట్టుగా వుందట కైలాసం! అంతేకాదు. అపుడపుడే కోసిన గజదంతంలా ఉందట!

మరి ఒకొక్క నగరం ఆ ప్రత్యేక క్షణంలో ఎట్లా ఎట్లా ఉంటుందో అట్లట్లే చెప్పడంలో ఎంత విశిష్టతను కనబఱచినాడని కాళిదాసు!

ప్రారంభంలోనే అలకను ఒక్క మాటలో అన్నాడు:

"అరుగవలెన్ నీ
వలకాపురి
కుద్యాన స్థిర త్రిపురవైరి
శిరస్స్ఫురదిందు కళా
ధవళిత వర హర్మ్యమ్మునకు
యక్షవాసమ్మునకున్."

వివరం తర్వాతకు ఉంచుకొన్నాడు.

ఉజ్జయినికి వెళ్ళితీరాలి అంటూ

"మిలమిల మెఱుపుల నట,
చంచలనయనల కన్నుగొనల
చకిత చకిత దృక్కుల
మొల్కలెత్త జేయక
కలుగదు నీ జన్మ సార్థకత్వము"

అంటాడు.

తమ పుణ్యమయిపోగానే అమరలోకాని కేగినవారు తిరిగీ వస్తూ, కాస్త మిగిలిన పుణ్యంమూలంగా స్వర్గాన్ని ఓ ముక్క విఱుచుకొనివచ్చి యిక్కడ ఉంచారా అనిపిస్తుందట ఆ ఉజ్జయిని.

ఆ ఊరిమీద వీచే శిప్రావాతమూ విశిష్టమేనట!

"సారస మద కలకూజిత
సారస కాసార కరణచణమై,
వికస న్నీరజ పరిమళ
మైత్రీ సౌరభ యుతమై,
సుఖాతిశయ కారణమై;
ఊరించు చటూక్తుల
కై సారించు వయస్యువలె
నుమస్సుల
శిప్రావారి సమీరము వీచు
నొయ్యారుల సురతాంత
తాంతి నపనయించుచున్."

ఇక అక్కడి హార్మ్యాలు లలనా పదరాగాంకితములు; వాని సొంపులు చూస్తూ అలత తీర్చుకోవాలన్నాడు. ఇక అలక!

హిమవంతం చతియపై గంగాంశుకం జారుతుండగా అలక, మబ్బుపట్టి వాన గురుస్తుండగా ముత్యాలను ముంగురులలో తురుముకున్న ముగుదలా ఉంటుందట.

అక్కడ సౌధాలు మబ్బులవంటివట. ఇక అంగనలా చెప్పతరంకాదు. వారి "పూలంగిసేవ" ఏమని చెప్పను!

"కరముల లీలాకమలము
ధరియింతురు;
కురులగట్టెదరు నునుమొల్లల్;
పరిపాండురతను సాధింతురు

లోధ్రప్రసవ రజముతో
వదనములన్.
"క్రొమ్ముడుల కురవకము,
కర్ణమ్ముల దిరిసెనలు,
వానరా విచ్చిన నీపమ్ములు
సీమంతమ్ముల
కొమ్మలు పురమందు
పెట్టుకొందురు జలదా !"

యక్షులు సౌధోపరిభాగాలపై నృత్యవాద్రిత్రాలతో ఆనందించడం అటుంచి, గంగా నదీతీరంలో గాలిని సేవిస్తూ కన్యలుంటారట.

వారు ఆ బంగారు ఇసుకలో మందారాల నీడనుచేరి ఆడుకుంటారు. వారు మటిపూచికపుల్లలతో ఆడుతారా? సువర్ణ సైకతాలలో చిఱుమణులను నాటుతారట. మామూలుగా పిల్లలు ఇసుకను పోడవుగా చేతులతో రాసిపోసి, అందులో ఎక్కడో ఒక పుల్లను దాస్తారు. మరోపిల్లను వ్రేళ్ళు పైవేసిదాని మీద ఆ పుల్లఉన్న చోటే పెట్టమంటారు. సరిగాచేయి అక్కడపడితే దాని క్రిందనే పుల్లఉంటే ఆమె గెలిచినట్లు. దానిని "చిట్టిచిట్టిపుల్ల, సీకురేణిపుల్ల..." అంటూ అదేపేరుతోనే రాయలసీమలో ఈనాటికీ వెన్నెలలో ఇసుకలో ఆడుతుంటారు. మటి దేవగంగాతీరం, మందార చ్ఛాయా యక్షకన్యలూ కనుక ఇక్కడ బంగారు ఇసుకా చిఱుమణులూ కవి ఉంచాడు.

ఇక వేడుకకత్తెలూ, వగకాండ్రూ చేసేపనులకు అంతూపొంతూ ఉంటుందా ?

ఆ వేడుకల్లో ఆ పల్చటి వలువలు జాటిపోతుంటే మెల్లగా ప్రేమికులు జారలాగ చూస్తారు. అప్పుడు సిగ్గుపడివారు మామూలు దీపాలనుకొని మణిదీపాల మీద, అక్కడేఉన్న కుంకుమాగందమూకూడా గుప్పిళ్ళతో తీసి చల్లుతారట. అవి ఆరవుగా, పాపం వారి పనంతా దండుగే అవుతుంది – అవి మణిదీపాలు !

ఆ మేడల మేల్కట్టులకటు ముత్యాల జాలరులు కాదు, చంద్రకాంతపు మణుల జాలరులు దిగవేసి ఉంటారు. అవి వెన్నెలకు కఱగి బొటబొట నీరు కార్చుతాయి. ఆ ఉదక కణ లవాల మీదుగా వీచే గాలి జవ్వనుల అలతను తీరుస్తుందట.

వారి యిళ్ళగోడలనిండా చిత్తరువులేనట. వానిపై చెమ్మచడజేసి మబ్బులు గవాలున తప్పుకాదా అని పారిపోతూ ఉంటాయట !

ఇక ఆ పట్టణంలో యక్షగృహం ఏచిత్రకారుడూ చిత్రించలేనంత వివరంగా వ్రాసివేసినాడు కవి.

ఆయింటి తోరణం ఇంద్రధనుస్సులా ఉంటుంది. దాపున బాలమందారం. ఒక సరస్సు. దానిలో హంసలూ అవీ. ప్రక్కనే క్రీడాశైలం. దానిచుట్టూ అరటిచెట్లు.

రక్తాశోక కేసరవృక్షాల దగ్గర గోరంటచెట్లు చుట్టూఉన్న మాధవీమంటపం. ఒక బంగారు శిల. దానిపై పాలరాతిపలక. దానిమీద చాకుడు నెమలి.

ఇక అసలు భవనంలో ద్వారాని కటూ ఇటూ పద్మశంఖచిత్రాలు.

అక్కడ ఉంటుంది తన లేమ అంటాడు యక్షుడు. ఆమెను వర్ణించిన ప్రతిపద్యం ఒక్కొక్క చిత్రంగా గీయవచ్చును.

కాళిదాసు కవిత్వంలోనే అదొక విశిష్టలక్షణం. ఆయన ప్రతిదృశ్యాన్ని వివరంగా, అతి వివరంగా, స్పష్టంగా, అతిస్పష్టంగా భావించుకుంటాడు. భావనలో ఉన్నంత స్పష్టంగానూ పదాలలో తీర్చిదిద్ది ఒక శిల్పంలా చిత్తరువులా మనముందు నిల్పి చూడమంటాడు.

మహాకవులలోని మహత్త్వ పరాకాష్ఠ, తామూహించుకున్న భావచిత్రం పదచిత్రంగా అంతప్రస్ఫుటంగానూ కానరాజేయడంలోనే ఉంటుంది. అందులో సిద్ధసంకల్పుడు కాళిదాసు.

"అటనుండు తన్వి, జవ్వని,
కటితనుతర, శిఖరిదశన,
కాతరహారిణీ చటులేక్షణ
పరిపక్వస్ఫుట బింబఫలోష్ఠి
ఒక్కసుందరి సఖుడా !
సతి జఘనభరాలసగతి
నతనాభి, పయోధరాల్పనమ్ర
యువతి సంతతి విషయమునం
దాయమ
చతురానను నాద్యసృష్టి
సరణిన్ దోచున్"

ఆమె కనులు ఏడ్చియేడ్చి ఉబ్బిఉంటాయి. వేడి నిట్టూర్పులతో పెదవి నల్లవడి ఉంటుంది. మబ్బుల దూలిన నెలలా ముంగురులు జారినముఖం.

ఆమె బహుశా మేఘం వెళ్ళినప్పుడు ఏంచేస్తూ ఉంటుందా అని యక్షుడు ఆలోచించి చెప్పాడు.

ఆమె పూజలు చేసుకుంటూనైనా, నా రూపు గీసుకుంటూనైనా ఉంటుంది. లేదా పంజరంలోని గోరువంకను 'ఏమే నీ వెప్పుడైనా ఆయన్ను తలుచుకుంటూ ఉంటావా?'' అని అడుగుతూనైనా ఉంటుంది.

కారుంటే.

"తను నాపేరన్ రచియించిన
గేయము పాడదలచి,
చెలివీణెను, మాసిన చీరపయిని
తొడపై నునుచుక
కూర్చుండిదియైననుండు పయోదా!
"నయన జలార్ద్రిములగు
వీణియ తంత్రుల నెట్లో
తుడిచి, నెలత
నిజ కృతమ్మయినట్టి
మూర్ఛనను ఆ పయి
సారెకు మఱచి, మఱచి
పరితపియించుచున్''

ఎంత కరుణా ప్రపూర్ణ దృశ్యం. తానే ఆయన్ను గూర్చి పాటరాసింది. ఆ మాసిన చీరె ఒడిలోనే వీణను ఉంచింది. పాట చూచుకొనేలోగా కళ్ళ నీరు చిప్పిలినవి. తంతులు తడిస్తే పలకవని తుడిచింది - అతికష్టంమీద అనికూడా ఇక్కడ కవి చెప్పాడంటే ఎంత విశిష్టదృష్టి - సరేకదా అనుకుంటే ఈలోగా తాను కూర్చుకున్న స్వరంకాస్తా మఱచిపోయి పరితపిస్తుంది..!

అలాకాకపోతే గడప మీద విరులు కుప్పవోసి నెలలో పూర్తిగా క్రింద పెట్టుతుంది. ఆ కింద నున్న పూలెన్నో ఎంచుకుంటూనైనా ఉంటుంది. అవును మఱి ఎప్పుడొస్తాడో అనేకదా ఆమె ఆవేదన!

ఆమె పడుకొనియుంటే పడకమీద నెలవంకలా వుంటుందట.

ఇలా ఎన్నెన్ని తీరులో చెప్తుంటే చదివితేనే గుండె నీరైపోతుందే ఆ భావించిన కవిహృదయం ఎంత వజ్రకఠోరమో ఎంత సుమపేశలమో!

ఇక సందేశంలో కాళిదాస ప్రతిభ అనన్య సామాన్య రీతిగా కానవస్తుంది. మచ్చుకు

''పలుతలపుల నను నేనే
నిలబెట్టుకొనంగ జూతు,
నీవును నట్లే
చలదలికుంతల!
ఊఱక కలగుండు వడంగబోకు
కాతర వగుచున్.
ఎందుల కేవల సుఖమో
క్రందుగ దుఃఖమ్మొ వచ్చు
కథ విన్నామా?
క్రిందగు మీదగు దశ -
ఇంతెందుకు! సుమగాత్రి
చక్రనేమి క్రమమై''

ఇంతకూ నాలుగు నెలలు కాస్త కన్ను మూసుకో, వచ్చివేస్తానని చెప్పుకుంటాడా విరహి యక్షుడు.

మరియింతా అయినా మేఘం పలకదూ ఉలకదూ కదా. ''ధూమజ్యోతి స్సలిల మరుత్తుల సన్నిపాత'' మన్న ముందటి సమర్థన మా యక్షునిదృష్టిలో ఎలా చెప్పించాడో

''సరియని చెప్పకపోయిన
సరియే!
ఈ మిత్రకార్య సందర్భమున్
పరిపూర్తి సేతువని
జలధరపతి! నమ్మకమా
కలదు-ఉదారుడవు కదా."

అని ''పనిసేయుటె పెద్దలు సెప్పు జవాబుగద సదా అర్థులకున్'' అంటాడు.

కట్టకడపట వెళ్ళమంటూ యక్షుని శుభాకాంక్ష ఎంత విశిష్టమో చెప్పతరం కాదు.

''నీకు మెఱపున్ గొమ్మకు నెడబాటు కలుగకుండుతి మెపుడున్''

అవురా అనిపించే అంతిమవాక్యం అది, కాళిదాసే అనగలడు.

ఇంతకూ కొండ అద్దంలో చిన్నదైనట్లే నా వివరణలో మేఘసందేశం మంచురేకగానే తోచినా అది విశ్వాంతరాళవ్యాప్తమైన మహేంద్రధనుస్సు.

దానిని అనువదించి నందుకే నన్నా మేఘం వదలక అన్ని తిప్పలు పెట్టినది. ఆ తిప్పలను ఆనాడే అనువాదం ముగిసిననాడే అనుకున్నాను. ఆ మాటలతోనే ఈ ప్రవేశిక ముగిస్తాను.

ఆలోచననేకాదు. ఆనందానుభూతీ అలత కలిగిస్తుంది.

శరీరశ్రమేకాదు, సౌందర్యాస్వాదనమూ సొక్కిపోజేస్తుంది.

దార్శనిక చర్చ కాదు, కావ్యగానమూ ఉక్కిరి బిక్కిరి చేసివేస్తుంది.

మంచుకొండ అంచుల కెగబ్రాకడం ఎంత కష్టమో, మంచుమీగడ మెఱపు బయళ్ళను కుంచెతో గీయడంకూడా అంత కష్టమూ.

మంచుకరిగించే ఎండలో నడవడ మెంత పరిశ్రమో, రాలను కరగించే వెన్నెల కుప్ప లలో కూర్చోవడమూ అంత పరిశ్రమే.

అందాలను మందుగా శాస్త్రప్రమాణంలో పుచ్చుకోగలగినంతమంది, సౌందర్యాన్ని జుబ్బన జూఱలుగా జుట్టుకోలేరు.

సంస్కారం పెరిగి నట్లెల్లా, హృదయం వికసించి నట్లెల్లా, ఆ రసానుభూతి నిశితమూ, గభీరమూ అయిపోయి మరింత మైమరపింప జేస్తుంది.

అందువల్లనే కావచ్చు అనేక మహా కావ్యాలను అతి సమర్థంగా వ్యాఖ్యానించిన మహోద్దండపండితుడు మల్లినాధసూరి ఒక్క గుక్కలో అన్నాడు:

"మాఘే మేఘే గతం వయః"

మాఘకవి శిశుపాలవధం, కాళిదాసు మేఘసందేశం—వీనిలోనే తన ప్రాయం పండి పోయినదట.

తలను తొలిచివేసిన మాఘం మాత్రమే కాదు, హృదయాన్ని రసపరిప్లుతం చేసిన మేఘం కూడా ఆయన జవసత్త్వాలను తిని వేసినది.

ఇరవై సర్గలదాకా విస్తృతమై, ధర్మార్థ కామశాస్త్ర విషయాల మొదలు కేవల మహాపండితైక సాధ్యములైన ఏకాక్షర ద్వ్యక్షర శ్లోకాల దాకా కడుపున దాచు కున్న మాఘం మాత్రమే కాదు, చిట్ట చివరిదాకా చూచినా నూటా పదిహేను పద్యాలు దాటని మేఘం కూడా ఆయన తలను పండిపోజేసినదట !

ఔను ! ఒకొక్క శ్లోకం చదివి ఆయన ఎన్నిరోజు లట్లా మైమఱచి ఆస్వాదిస్తూ కూర్చున్నాడో !

అందా లన్నీ టినీ కుప్పవోసి ఆవురు బావురు మని బామకోలేము.

అద్భుత గాన స్రవంతిలో కుత్తుక బంటిగా దిగి నిభాయించుకోలేము.

ఒక్కసారి వీణెమీటి ఝమ్మనిపించినా, ఆ ఝుంకారం మనసు-తుమ్మెద మన్వంతరాల దాకా మననంచేస్తూ ఉండిపోగలదు.

ఆ మనసు సునిశితమైనకొలదీ, సంస్కారం గభీరమైనకొలదీ, అనుభవనపాటవం విస్తృ తమూ విశిష్టమూ అవుతుంది.

విడదీయరాని ముడిని తడుములాడి విప్ప కోవడం, అనాకొనా తెలియకుండా అలాంటి ముడిని బిగించడం తడవ తడవా అలవాటైన పండితుడైనా, అద్భుత భావుకత మెఱపు తీవియలా మిఱుమిట్లు గొలుపగా కను లప్ప గించి, తనివిదీరా రసాస్వాదనం చేస్తూ సొమ్మసిలి పోవలసినదే !

ఎక్కడిమబ్బుతునక ? ఎవ్వడుయక్షుడు ?? ఏమిసందేశం !!! ఆయింతలో ఎంత మహా కావ్యం రచించినావయ్యా కాళిదాసూ !

అంత ఉత్తమ సంస్కారమూ, ఉన్నత మనోధర్మమూగల మల్లినాథుని మాటను— అంత మాటను – సర్వసామాన్య వ్యక్తిని నే ననలేనుగానీ, నీమేఘం నన్ను వదల కుండా పట్టుకున్నది!

ఆగడపలను చూడగా ఆ మేఘశకలాలు నీవన్న అనేక కామరూపాలతో సాక్షాత్కరించి అనుక్షణం నన్ను కలతరపరుస్తున్నవి.

ఎంత భావుకుడవయ్యా నీవు!

అనువదించిన దోషానికా నీవూ నీ మేఘమూ నన్ను మఱోపద్యం రాయనీయకుండా, ఆ వాతావరణం నుండీ బయటపడనీకుండా అల్లరి పెడుతున్నారు?

అల్పుడను స్వామీ! నే నింత రసానుభూతిని భరించలేను – అందాలను పంచిపెట్టి పుట్టినవాడను కాను.

అందుకనే వేడుకుంటున్నాను – నన్ను నీ అమేయ భావనాబలంతో వివశుని చేసివేయకు.

నా పిచ్చికగూళ్ళు నన్ను కట్టుకోనీ!

[ఈ వ్యాసంలోని ఉదాహృత పద్యాలన్నీ నా మేఘసందేశం అనువాదంలోనివే.]

---

అనుభవతి హి మూర్ధ్నా పాదప స్తీవ్ర ముష్ణం।
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానాం

సూర్యుని వేడికి నెత్తి కాలుతున్నా చెట్టు తనను ఆశ్రయించిన వాళ్ళకి ఎండ తగలనీయదు.

♦ ♦ ♦

తమ స్తపతి ఘర్మాంశౌ
కథ మావిర్భవిష్యతి

చుర్రుమనిపిస్తూ సూర్యుడుండగా చీకటెంకెందు కుంటుంది?

♦ ♦ ♦

ఉచ్ఛేత్తుం ప్రభవతి య న్న సప్తసప్తి
స్తన్నైశం తిమిర మపాకరోతి చంద్రః

రాత్రి చీకట్లను సూర్యుడు నిర్మూలించలేకపోయినా, చంద్రుడు తోసివేయగలడు.

# అతడు - ఆమె

## శ్రీ పుప్పల లక్ష్మణరావు

(గత సంచిక తరువాయి)

## ఆమె - 7

అమ్మ, పాపాయి రైలులో వచ్చారు. నాన్న బెంగుళూరు వెళ్ళారట - అక్కడ జరుగుతూన్న ఒక పెద్ద వాణిజ్యంలో ఇంగ్లీషు కంపెనీవాళ్లకి సలహా ఇవ్వడానికి. జనార్ధనరావు రైలుకు రాకుండా వుంటాడా అని నాలుగు నిమిషాలు అటూఇటూ చూశాను. "ఏం? తెలిసిన వాళ్లెవరైనా రైల్లో కనిపించారా ఏమిటి?" అని అమ్మ అడిగింది. "లేదు. సూళూరుపేటలో ఎవరో రైలులో ఎక్కుతూంటే, తీర్థగిరి అనుకున్నాను. కాని మరెవరో" అనేశాను. జనార్ధనరావుని టెలిఫోనులో రైలుకి వస్తావా అని నేను అడిగితే 'ఆఁ! ఆఁ!' అన్నాడు. ఏంచేత రాలేదో మరి?

భోజనం చేశాక అమ్మ అడిగింది, సోమవారమే బయలుదేరుతానని అన్నావే విశాఖపట్నంనుంచి ఫోను చేస్తూ, మరి ప్రయాణం ఆలస్యం అయిందేమి అని. "శివ్వమ్మగారు బొబ్బిలినుంచి ఆదివారమే వచ్చేసినా బలవంతంచేసి రెండురోజులు ఉంచేసింది. మనవడు పుట్టాడని పార్వతీశంగారు మహా ఆనందపడి పోతున్నాడు' సింగరాజుగారి ఆస్తి ఇక మనదే కదా అని చంకలుగుద్దుకుంటున్నాడాయన. మాలతికి పురుడు యెలా వచ్చిందని కాని, బాంబులు పడుతూంటే ఆస్పత్రికి ఎలా తీసుకువెళ్లావని కాని నన్ను వాళ్లడగనూలేదు నేను చెప్పనూ లేదు. వాళ్లు ఇంటికొచ్చేసరికి వంటబ్రాహ్మడూ, బంట్రోతులూ, పనిమనిషి నాపుణ్యమా అంటూ ఒక్కొక్కళ్లే యథాప్రకారంగా పనిలోకి వచ్చేశారు. లేకపోతే ఇల్లుచక్కబెట్టు టంతా నామీదే పడేది! తండ్రికి తల్లికి వచ్చినరోజంతా మాలతిని, మనవడిని ఆస్పత్రిలో చూడ్డంతో సరిపోయింది; భోజనాలకి మాత్రం ఇంటికి వచ్చేవారు. శివ్వమ్మగారితో ఇంటికొచ్చిన రెండోరోజున: "మాలతికి పురుడొచ్చింది, మగపిల్లాడు పుట్టాడు. నేనింక ఈవేళ మెయిలుకి చెన్నపట్నం వెళ్ళిపోతాను" అని నేనన్నాను. "నువ్వు వెళ్ళిపోతానంటే యెలాగు అమ్మడూ? అంతదూరం నుంచి రానేవచ్చావు చింతపండు పిక్కతీయించి, దిమ్మలు చేయించి అటుకుమీద సర్దించాలి. సాయానికి నాకు మరెవ్వరున్నారు చెప్పు? పిక్కతీసేటప్పుడూ, తూనికవేయించి దిమ్మలు చేయించేటప్పుడూ స్వంతమనిషిధరణా కూచోకపోతే కూలిముండలూ, బంట్రోతు వెధవలూ యేకమై చింతపండూ, నూనె పిక్క అన్నీ వాళ్ల ఇళ్లకి తరలించేసుకుపోయి, యిల్లు గుల్ల చేసేస్తారు. ఆయన వున్నారన్నమాటేగాని వుత్త సత్యకాలపు మనిషిగదా! ఎంతసేపు దస్తావేజులు తియ్యనూ, వడ్డీలెక్కలు కట్టిపద్దులు వేసుకోనూ ఇదే గొడవకాని సంసారం ఎలా వెళ్తూందని ఆలోచనే లేదుకదా ఆయనకి. నీకు తెలియనిదేముంది అమ్మడూ? ఇంట్లో ఆడబొట్టెవికాబట్టి నీదగ్గర నా గొడవ వెళ్ళబోసుకుంటున్నాను. అంచేత నువ్వుండి కాస్త అజమాయిషీ చేసిపెడుదూ! పాపం నువ్వుండే చింతపండంతా ఎండలో వేయించావు కూడాను! అది బాలింతరాలై కూచుందాయె!" అని బలవంతాన్ని నన్నుంచేసింది, ఆవేళ ప్రయాణం మానిపించి. ఏంచెయ్యను మరి? ఆవేళ్లా మాలతిని చూడనేలేదు. మర్నాడు మాలతిని చూసి - "మెయిల్లో బయలుదేరి వచ్చాను" అన్నా. "బాంబింగు విశేషాలు- మాలతిని ఆస్పత్రికి తీసుకు వెళ్ళడం - అన్నీ మరో మాటు చెప్పు - శుభ! ఆవేళ టెలిఫోనులో సరిగ్గా వినపడేలేదు" అంది అమ్మ. విశేషాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాను. "మదనం సంగతి చెప్పావు కావు" అంది అమ్మ. అతను వూరినుంచి పారిపోవడం - క్రితం రాత్రి క్లబ్బులో విందు - అతని వికార చేష్టలు చెప్పా. అమ్మ కడుపుబ్బేటట్టు నవ్వి - నన్ను కౌగలించుకుని ముద్దుగా నా బుగ్గమీద చరిచింది! "మదనం బొబ్బిలి నుంచి వచ్చాక ఏమన్నాడు?" అని అడిగింది. "ఏమని

అడగడమేమిటి? 'నా కోసం ఎవరేనా వచ్చారా?' అని అడిగేడు - రాగానే. 'నువ్వు వూళ్ళో లేవని తెలిసి టోజో ఇక్కడ దిగలేదనీ - మళ్ళీ క్రిస్టమస్‌కి వస్తాననీ - అప్పటికి నిన్ను తప్పకుండా ఇక్కడ వుండమనీ - మనిషిచేత ఖబురు చేశా'డన్నా. 'మనిషి యెలా వచ్చాడు?' అని అడిగేడు. 'ఎలా రావడమేమిటోయ్ వెర్రి నాయనా! గాలి గుమ్మటం మీదనుంచి ఎగిరి మీ డాబామీద వాలేడు. తారాచువ్వ నడుముకి కట్టుకుని చక్రని ప్లేనులోకి మళ్ళా ఎగిరిపోయాడు!' అన్నా. అంత ఐ. సి. యస్. వాడు నమ్మేడు సుమా - అమ్మా! నేను వెళ్ళిపోయేటప్పుడు 'మళ్లీ యెప్పుడు రావడం?' అని అడిగేడు. 'పెళ్లిముహూర్తం నిశ్చయంచేసి రాయి. తప్పకుండా వస్తాను' అన్నా. పరమానందభరితుడైపోయి - ఫలహారాలశాల నుంచి ఆపళంగా నాలుగు చేక్లెట్టు డబ్బాలు తీసికొచ్చి ఇచ్చాడు. నేనలా అనడంలో తప్పేంలేదు కదే, అమ్మా? అన్నాను. అమ్మనన్ను కాగలించుకుని 'శ్లేష వేసి ఆశచూపించావు!' అంది నవ్వుతూను. 'వుత్త నీచుడమ్మా!' అన్నాను. అని 'నాన్నేమంటారోనే - అమ్మా?' అన్నా. 'నాన్నేమంటే నీకేం! నీ మనసే నీకు ప్రధానం!' అని నన్ను ముద్దుపెట్టుకుంది.

నాన్న బెంగళూరు నుంచి సాయింత్రం కారుమీద వచ్చారు. రాగానే నన్ను పలకరించారు. "ఒసేవ్ - సుబ్బడూ! ఎప్పుడొచ్చావేవ్? మదనం యేమంటున్నాడు?" అన్నారు. మదనం బొబ్బిలి పారిపోవడం - చడీచప్పుడు లేకుండా మూడో నాటికి విశాఖపట్నం వచ్చి కచేరీచేయడం చెప్పాను. అతను ఇచ్చిన చాక్లెట్టు డబ్బాలు చూపించి - నాన్నకి నాలుగు చాకలెట్లు ఇచ్చాను. "మహారుచిగా వున్నాయే! వాడు భలేగడుసువాడు సుమా! నేను చెబుతున్నాను విను: జపానువాడురానీ - బ్రిటిషువాడే వుండనీ, లేదూ స్వరాజ్యమే వచ్చిపడనీ మదనం మంచి అదృష్ట జాతకుడు. వాడికి అష్టైశ్వర్యాలు - అష్టభోగాలు - రాసివుంటే - రెవెన్యూ బోర్డుమెంబరుగిరీ గవర్నరుగిరీ ఎవడు తప్పించగలడంటా? ఇప్పుడు మేనల్లుడికి నాలుగైదు లక్షల ఆస్తి దఖలుపడుతూంది. పార్వతీశంగారి సంపాదనేవుంది పదిలక్షలు! వాడికోసం తెరవెనుక యెవర్తి వుందోకాని, మహారాణి భోగం అనుభవిస్తుందనుకో!" అన్నారు నాన్న నాబుగ్గ గిల్లుతూ. "సర్వేరాళ్ళు మార్చి, స్థలాలు అమ్మించి లంచాలు కాజేసి సంపాదించిన డబ్బులేగా!" అన్నాను నేను ఉండబట్టక. దాంతో నాన్నకి ఎక్కడలేని కోపమూ వచ్చింది. "ఈ కమ్యూనిస్టు మాటలు ఎన్నాళ్ళయి నేర్చావంటా? ఈమాటు అన్నావు సరిపోయింది. మళ్లీ యీముక్కలు నీనోటంట విన్నానా - నేను ఒప్పుకోనేది లేదు - శుభ! ఇప్పుడే చెపుతున్నాను. తరువాత నన్నని లాభంలేదు! శాంతం! నీ నించే అది చెడిపోతూంది!" అన్నారు నాన్న విరుచుకుపడుతూ. "శాస్త్రి! నేను స్వచ్ఛమైన గాంధీవాదినై యుండీ - దానికి కమ్యూనిజం నేర్పుతున్నానా? మనకీ వాళ్లకీ పచ్చగడ్డేస్తే భగ్గుమని మండుతుందికదా. ఆ మాటకే కనకవస్తే - రాజగోపాలాచారిగారి నాయకత్వం కింద మీ 'లెజిస్లేచరుపార్టీ' తీర్మానానికిన్నీ - కమ్యూనిస్టుల విధానానికిన్నీ నాకేం తేడా కనిపించడంలేదు. 'నేషనల్ ఫ్రంటు - ఫ్యాసిస్టు వ్యతిరేకత'వాళ్లు మొదటనుంచీ అంటున్నారు. మీరు యీ వాళ అంటున్నారు. జిన్నాతో పొత్తో అని మీరూ చెవికోసుకున్న మేకలా అరుస్తున్నారుగా!" అంది అమ్మ. "శాంతం! నువ్వేన్నన్నా సరే. కమ్యూనిస్టులు మాత్రం ముమ్మాటికీ దొంగలు! నిన్నటివరకూ సామ్రాజ్యవాదుల యుద్ధమా? రష్యా యుద్ధంలో చేరగానే ప్రజా యుద్ధంగా మారిపోయిందీ? నాలిక యెలా తిరుగుతే అలాగే? వాళ్లు స్టాలిను గులాములు. బ్రిటిష్‌వాళ్లపంచమాంగ దళం. దేశద్రోహులు. ఛీ!" అన్నారు నాన్న. "కాంగ్రెసు వాళ్లుకూడ అలాగే అనలేదూ? మొదటిలో ఇది సామ్రాజ్యవాదులు వాళ్లలో వాళ్లు చేసుకునే యుద్ధం - మాకేం సంబంధంలేదు. ఇప్పుడిది ఫ్యాసిస్టు వ్యతిరేక యుద్ధం - చైనా, రష్యా చేరాయి కనుక - అని కాంగ్రెసువాళ్లు అన్నారుకారూ? క్రిప్సు వెళ్ళిపోయాక నిన్న అన్నాడు జవహర్‌లాలు 'మనదేశాన్ని రక్షించడానికి అమెరికావాడూ, బ్రిటిషువాడూ సాయపడుతూంటే నేనేం చెయ్యడంలేదే' అని నెత్తీ నోరూ కొట్టుకోలేదూ? ఈ మాటలు కాంగ్రెసు వాళ్లనొచ్చా - బోసు జపానువాడితో చేతులుకలపొచ్చా. ఏమిసబబే? ఇంతకీ నేనేమిటన్నానని? అమ్మా!" అన్నాను కొంచెం జోరుగానే. "అదంతా రాజకీయం - ఇదంతా గృహచ్ఛిద్రం. అందుచేత కమ్యూనిస్టుప్రలాపాలు ఇక్కడ పనికిరావు! బోధపడిందా? బోధపడిందను!" అన్నారు నాన్న గద్దించి.

"శాస్త్రి! యీ దబాయింపులు నేను సహించను. ఈ యింట్లో మాత్రం ఎవరి అభిప్రాయాలు వాళ్లవే - ఎవరి స్వేచ్ఛ వాళ్లదే. దాని కిష్టంవుంటే కమ్యూనిస్టుల్లో చేరుతుంది - హిందూమహాసభలో చేరుతుంది - దాని స్వతంత్రం దానిది!" అంది అమ్మ.

"హిందూమహాసభలోచేరితేనాకేంఅభ్యంతరంలేదు ! దాని స్వేచ్ఛని నేను పూర్తిగా మన్నిస్తాను" అన్నారు నాన్న.

"నేను యింతవరకూ యే రాజకీయపక్షంతోనూ చేరలేదు. చేరబోనేమోకూడా, నాన్న !" అన్నా.

"ఆమాట ముందే యేడ్చుంటే — యీ రాద్ధాంతం అంతాలేకపోనే !" అన్నారు నాన్న.

అమ్మ, నేనూ నవ్వాపట్టలేకపోయాం. "నేను యెప్పుడేనా చేరితే, కాంగ్రెసు సోషలిస్టుల్లో చేరతా నేమో !" అన్నా.

"సరి ! యేలేశ్వరం వెళ్ళినా శనేశ్వరం పోలేదన్న ట్టుంది. ఆ సోషలిస్టుకూడా ఎందుకు ? కాంగ్రెస్సే చాలు — అన్నింటికీ కన్నతల్లి !" అన్నారు సహం నవ్వుతూ, సహంకోపంగానూ.

"నాకింకా యెన్నో పుస్తకాలు చదవాలని వుంది నాన్న ! అవన్నీ చదివాక, యేదోవకటి నిశ్చయిస్తా. నేను సీమనుంచి తెచ్చిన పుస్తకాలు పుస్తకాల్లాగే వున్నాయి !" అన్నా.

"ఆ చెత్తంతా అలాగేవుంచేయి. వాటిని చదివి బుర్ర పాడుచేసుకోకు. నా లండను స్కూలు ఆఫ్ ఎకనామిక్సు పుస్తకాలు లాస్కీ, వెబ్సు, బెర్నార్డుషా, వెల్సు, గ్రహాం, వాల్లేసు, హెన్రీజార్జి, సామ్యుయల్, బట్లరు బోలెడున్నాయి. మీ అమ్మదగ్గిర గాంధీ సారస్వతం బీరువానిండా బీరువాడుంది. నీ యిష్టం వచ్చిన పుస్తకం చదువుకో నాకేం అభ్యంతరం లేదు. పుస్తకం చదివేముందు మాత్రం నన్నడుగు మంచి పుస్తకం అయితే నేనే తీసి ఇస్తాను. నీస్వేచ్ఛకేం అడ్డులేదు" అన్నారు నాన్న. "నాన్న ! సోవియటు కమ్యూనిజం మీద వెబ్సు కొత్తపుస్తకం రాశారట కదా, నాకది కొని పెట్టరూ?" అని అడిగా. "వాళ్ళు అవసానదశలో రాశారు ఆ పుస్తకాన్ని. అంచేత చిన్న పిల్లలు చదవదగ్గ పుస్తకంకాదు. చిన్న పిల్లలేమిటి పెద్దవాళ్ళుకూడాను. నేనూ చదవలేదూ. అది చదవదగ్గది కాదు. వాళ్ళింకా లక్షాతొంభై పుస్తకాలు రాశారు. అవేవి చదివినా ఫరవాలేదు !" అన్నారు. మధ్యాహ్నమే మౌంటు రోడ్డు వెళ్ళి పుస్తకం కొనుక్కొద్దాం అనుకున్నా మనసులో.

"అవునుగానీ శాంతం ! అమృతరావు అని కొత్త డ్రైవరుని పెట్టావు స్టూడ్‌బేకరు కారుకి. వాడెవడో, వాడిపుట్టుపూర్వోత్తరాలేమిటో దర్యాప్తుచేసే పెట్టావా? సరికొత్తకారుకూడాను ! మొన్నవాడి చేతిలో తెలుగు పత్రికేదో చవకబారు పత్రిక చూసినట్టయింది. ఏమిట్రా ఆ పత్రిక అని అడుగుదాం అనుకున్నాను. కాని వాడు తిరగబడతాడేమో అని భయంవేసి అడగ లేదు. కొంపతీసి దండకారణ్యంలో మాయలేడిలాగు అజ్ఞాతవాసంలో వున్న కమ్యూనిస్టు కాడుగద ?" అన్నారు నాన్న ఆదుర్దాగానూ.

"అతను తెలుగువాడు కాడు. తంజావూరు మహారాష్ట్రుడు నాన్న !" అన్నాను.

"చంపేశావు ! మహారాష్ట్రుడవుతే వాడు చదువుతూంది 'క్రాంతి' పత్రికే అయివుంటుంది ! శాంతం ! నువ్వు అడ్డమైనవాళ్ళనీ తీసుకొచ్చి నౌఖరీలో పెడుతున్నావు. మొగాణ్ణి నేనంటూ వున్నానుగా, నాతో చెప్పకూడదూ ? ఏంతొందర మునిగిపోయిందని ? వాడు ముమ్మాటికి కమ్యూనిస్టే ! ఏ ఆక్సుఫర్డు గ్రాడ్యుయేటో ఏ మిల్లు మజ్దూరో ?" నాన్న చిందులు తొక్కుతూ అరిచారు.

"శాస్త్రీ ! అతని ముఖంమీద రాసివుంటుందటోయ్ కమ్యూనిస్టు అని ? అడుగుతే మాత్రం చెబుతాడా ? లైసెన్సు చూశాను. మచ్చలేకుండా అద్దంలాగుంది. కొత్త కారుని అతి జాగ్రత్తగా నడుపుతున్నాడు. ఏదేనా అడుగుతే మర్యాదగా ఇంగ్లీషులో జవాబు చెబుతాడు. అడగకపోతే ఏ విషయంలోనూ అనవసరంగా జోక్యం కలుగజేసుకోడు" అంది ఉత్సాహంగాను.

"అదిగో — దానివల్లే తెలుస్తూంది వాడు కమ్యూనిస్టు అని. అతి వినయం ధూర్తలక్షణం అన్నారు. ఆ నక్క వినయాలు వాడున్ను. పిశాచాలు వేదాలు వల్లిస్తాయట. మనం కాంగ్రెసు వాళ్ళమికదా, ఇలాంటి రౌడీల గురించి యెంత జాగ్రత్తగా వుండాలి ! మనం మాట్లాడుకునేవన్నీ ఇహ పోలీసువాళ్ళ దగ్గర జారేస్తాడు" అన్నారు నాన్న చికాకుపడిపోతూ.

"కమ్యూనిస్టు అవుతే వజ్రాల తమ్మెట్లు పెట్టుకుంటాట్ట నాన్నా ?" అన్నాను నేను నవ్వుతూనూ.

"అబద్ధపు పెళ్ళికి యేదో వాయిద్యం అన్నట్టు అవి దొంగసొత్తో మాయ వజ్రాలో నీకేం తెలుసు ? కమ్యూనిస్టుల కేమిటి తమ్మెట్లూ పెట్టుకుంటారు, జంధ్యమూ వేసుకుంటారు. అవసరమైతే బోడింగుండూ చేయించుకుంటారు. వాళ్ళ మతం అలాంటిది !" అన్నారు నన్ను చివాట్లు పెడుతూ.

ఈ ధోరణిలోంచి మళ్ళించుదాం అని: "నాన్న ! కమ్యూనిస్టులమీద ఆంక్షని తీసేస్తున్నారటగా గవర్నమెంటు ?" అన్నా.

"అవునే. సి. ఐ. డి. కమిషనరు శివరాజన్ నాతో రహస్యంగా చెప్పాడే. పోలీసువాళ్ళని మాత్రం యెవడు నమ్మగలన్నాడే? శాంతం! కొంపముంచి కమ్యూనిస్టు మెంబర్లు పదిహేనుమందీ అలహాబాదు ఏ. ఐ. సి. సి. సమావేశానికి తయారవుతారా యేమిటి తగుదునమ్మా వాయనానికని ?" అన్నారు గాభరాగా నాన్న. కాస్త ఆలోచించి: "అయినా వీళ్ళంటే గవర్నమెంటుకీ భయమేనే. అందుచేత కేడెంచి మేలెంచమన్నారు. అంత తెలివితక్కువపని చెయ్యకూడదు గవర్నమెంటు మరి!" అని ధైర్యం తెచ్చుకున్నారు మళ్ళీ.

"వాళ్లొస్తే మీ లెజిస్లేచరు పార్టీ తీర్మానికే చేతులెత్తుతారుగా! వాళ్ళు అలహాబాదు వెళ్ళేదీలేనిదీ అమృతరావుని అడుగుతాలెండి" అన్నా.

నాన్న కుర్చీలోంచి చెంగునలేచి గుమ్మాని కడ్డంగా నిలబడి, "అదుగో నువ్వు మాత్రం ఆ తెలివితక్కువ పని చెయ్యకు! నేనే అడుగుతా నాకేం భయమా, నన్నేం మింగేస్తాడా? వాడిని అడిగితేనే తెలిసిపోతుంది" అన్నారు నాన్న హడావిడిగా.

"అతన్ని పిలుస్తునా - నాన్నా?" అని అడిగా.

"నేను శివరాజన్ని అడుగుతానే! వీడినికాదే!" అన్నారు నాన్న, నేను అమృతరావుని యెక్కడ పిలిచేస్తానో అని. అమ్మా నేను నవ్వలేక నవ్వలేక చచ్చాం! నాన్నకి మా నవ్వుచూసి కోపంవచ్చింది. ప్రసంగధోరణి మార్చేద్దాం అని నే నన్నాను.

"నాన్నా! అలహాబాదు సమావేశానికి అమ్మకి టిక్కెట్టుకొని రైలులో స్థలం ఖాయం చేశారా?"

"ఆ! నేనుకూడా వెళుతున్నా. ఇద్దరికీ ఫస్టుక్లాసు అప్పుడే తీసుకున్నా. మా తీర్మానానికి వోట్లు సంపాదించాలి. ఇక్కడ ఇటు బుర్రవూపినవాళ్లు, అక్కడ ఆ ఆజాదునిచూసి అటు బుర్రవూపితే కష్టం!" అన్నారు నాన్న.

"మీ తీర్మానం ఎలాగా వీగిపోతుందనుకోండి! అప్పుడు రాజాజీ కాంగ్రెసులోంచి వెళిపోవడం ఖాయం. మరి మీరుకూడా కాంగ్రెసుకి రాజీనామా ఇచ్చేస్తారా?" అని అడిగా.

"ఐతంపూడి ఉద్యోగం ఐతే, గియితే - ఈ ప్రశ్నలన్నీ నీకెందుకే - సుబ్బడూ! మనిషిని యిరుకునపెట్టే ప్రశ్నలిని వేస్తావు నువ్వు, పాడు అలవాటు?" అన్నారు కోపంతో.

"శాస్త్రీ! నేనూ అదే అడగాలనుకుంటూండగా, అమ్మాయే అడిగింది" అంది అమ్మ నన్ను వెనకేసుకొస్తూ.

"నేను మాత్రం కాంగ్రెసునుంచి బైటకిరాను సుమా - శాంతం! ఆంధ్రులం మనం కాంగ్రెసునే నమ్ముకుని వుండాలి. రేపొద్దున్న సంయుక్త మంత్రివర్గం వచ్చినా - ఆంధ్రరాష్ట్రం వచ్చినా - మన మంత్రిస్థానం మనకి ఖాయంగా వుండిపోతుంది. ఒకరిని నమ్ముకుని మనమేం బాగుపడతాం అంటూ?" అన్నారు నాన్న.

"శాస్త్రీ! ఇన్నాళ్లు నీతో కాపురం చేశానుకాని - నీ అపరచాణక్యంచూసి నవ్వాలో - యేడవాలో తెలియకుండా వుందోయ్!" అంది అమ్మకొంచం విసుక్కుంటూ.

"ఏమిటి శాంతం, కుర్రదాని ఎదట ఆ మాటలు? సరే. అది ఏలాగూ వింటిలే. నువ్వు నన్నుచూసి యేడవావొద్దు - నవ్వావొద్దు. ఎప్పటిలాగునే ప్రేమించు - నన్ను!" అన్నారు నాన్న, అమ్మని బుజ్జగిస్తూ. "అవునుకాని - శాంతం! అలహాబాదు యెలాగూ వెళుతున్నాం. గయకూడావెళ్ళి గయావర్జనంచేసేస్తే తీరిపోతుంది. యేటా ఈ తద్దినాలుపెట్టలేక మన తద్దినాలు దగ్గిరకొస్తున్నాయి!" అన్నారు.

"గయావర్జనం యెందుకు? యేకంగా బ్రహ్మకపాళమే వెళ్ళి అక్కడ ఘటాశ్రాద్ధం పెడతానుఅన్నావు కావు, మన తద్దినాలుకూడా కలిసొస్తాయని!" అంది అమ్మ మహాకోపంతో, నాన్న చాదస్తానికి.

"ఈ రాజకీయ తంత్రాంగంచూస్తే - వైస్రాయి ఎగ్జిక్యూటివు కౌన్సిలుకి మనకే పిలుపురాకూడదూ? యీ వున్నవాళ్ళకంటే మనం యేంతీసిపోయామా? వాళ్ళకే ఖాయమా? అప్పుడు ఢిల్లీనుంచి రాజవైభవంతో యేటా బ్రహ్మకపాళం వెళ్ళొచ్చు - దర్జాగా! సరే ఆ మాటంటే నువ్వు మరీ విరుచుకుపడతావు. మాటవరసకి అన్నాననుకో!" అన్నారు నాన్న వెర్రిగా నవ్వుతూ - మిడతంభొట్లులా చేతిలో చిక్కిపోయానే అని నోరు కరుచుకుంటూ.

అమ్మేదో ఘాటుగా అనబోతూంది. ఇంతలో పాపాయి మేడమీదికివచ్చి:

"సుభక్కా! నీకోసం ఎవరో టెలిఫోనులో పిలుస్తున్నారే!" అంది.

"ఎవరో అడగలేదే - పాపాయీ?" అన్నారు నాన్న.

"నేనడగలేదే - నాన్నా" అంది పాపాయి.

"ఎందుకేనా మంచిది - ఎప్పుడూ ఎవరు టెలిఫోనులో పిలుస్తున్నారో అడిగి తెలుసుకోవాలి - అమ్మాయీ! ఈమాటు మర్చిపోకేం!" అన్నారు నాన్న.

నేను నవ్వుకుంటూ కిందకెళ్లి పోయాను.

# అ త డు - 8

సుభ వచ్చినరోజు నేను స్టేషనుకి వెళ్లేలేను. అన్నీ అలా వచ్చాయి ఆనాడు. ఏంచెయ్యనూ ? ఆదివారం వస్తున్నానని మొదట టెలిఫోనుచేసింది. ఆ వేళ సెంట్రలుస్టేషనుకి వెళితే రాలేదు. వాళ్ళ వాళ్ళెవరూ రాలేదు. స్టేషనుంచి నేను కచేరీకే వెళ్లిపోయి, కొత్తరైల్వేలైను గొడవల్లో పడిపోయాను. ఢిల్లీనుంచి 'వార్ డిపార్టుమెంటు' తాలూకు మిలిటరీ ఇంజనీర్లువస్తే వాళ్ళతో సరిపోయింది రోజంతా. సోమవారం, మంగళవారం, బుధవారం – అవుసరం అయితే గురువారంకూడా – వాళ్ళతో ఆరంబాకం ఉప్పుగల్లీలు, గుమ్మడిపూడి వెళ్లి – స్థలం తనిఖీచేసి – ఆఖరిఏర్పాట్లు నిశ్చియంచేసి కంట్రాక్టర్లకి పని వప్పచెప్పేద్దాం అనుకున్నాం. వాళ్ళతో సమావేశంలో వున్నాను. సుభదగ్గిరనుంచి ట్రంకు టెలిఫోను – బుధవారం వస్తున్నాను – రైలుకురమ్మని. జవాబు యేం చెప్పేది ? తెనుగున మాట్లాడితే – కూడా వున్న మిలిటరీదొర్లు యేం అపార్థం చేసుకుంటారో ? ఇంగ్లీషున మాట్లాడితే – నేను రాగలనో – రాలేనో అని తర్జనభర్జన వీళ్ళముందర ఎందుకు – అని ఇంగ్లీషునే – 'సరే-సరే' అనేసి టెలిఫోను పెట్టేశాను.

మధ్యాహ్నానికి అసలు కంట్రాక్టరు, పెద్దదొర మేనల్లుడు డిక్సనూ – వాడి టెక్నికల్ సెక్రటరీ ఎడిసన్నూ, గులాబ్‌చందుగారూ – నలుగురు కచ్చీ చిన్న కంట్రాక్టర్లూ – అందరూ పోగయారు – నా కచేరిలో ఆరంబాకందగ్గిర మార్షలింగుయార్డులో. 'షటింగుమూపురం' వకటి చూపించివుంది ప్లానులో – నూరుగజాలు పొడుగు – పదిఅడుగులు ఎత్తున్నూ. అంత ఎత్తూ ఎందుకు–ఆరుఅడుగులకి తగ్గించేద్దాం అంటాడు– ఎడిసన్ను.

"ఎత్తుతగ్గించేస్తే–'గ్రేడియంటు' ఎలా సరిపోతుంది? రోజుకి ఇటు ఆరురైళ్లు, అటు ఆరురైళ్లు అని కదా లెక్క. రైలుకి అరవై బళ్లు, బండికి రెండు ఇరుసులు. ఇరుసుకి పదిహేడు టన్నులు వేసుకోండి. అమెరికను ఇంజను, టెండరుబొగ్గూ, నీళ్ళు అంతా బరువు మూడు వందల యాభైటన్నులు కట్టండి. అందుకు కావలసిన వేగం, 'బ్రేకింగుశక్తి', 'ఈడ్పుబలం' ఎక్కడ నుంచి వస్తుంది – గ్రేడియంటు తగ్గించేస్తే ? స్లయిడు రూలుతో లెక్కకట్టిచెప్పండి!'అని అడిగే ఎడిసన్ను ని?.

దాంతో ఒకరి ముఖం వకరు చూసుకున్నారు. ఎడిసన్ను నసికేడు.

గులాబుచందు ఆరంభించాడు: "పోనీలెండి. శాస్త్రరీత్యా వీలులేకపోతే మేం మాత్రం యేం అనగలం లెండి ? చూశారూ – కెప్టెను రావుగారూ ! అక్కడ మీరు బ్లూప్రింటులో చూపించిన ఆరు లూపులైన్లు నాలిగింటికి తగ్గించేసి – మూడో ఫర్లాంగు దగ్గిర 'కత్తిర పాయింట్సు'తో క్రాసింగువేసి అసలు లైనుతో కలి పేస్తే సరిపోతుంది కదండీ" అన్నాడు.

నేను కెప్టెను రైటుకి ప్లాను చూపించి "మూడో ఫర్లాంగు దగ్గిర 'కాంటూరు' బాగా మెరకగా వుంది. కత్తెర పాయింట్సు సరిపడదే ?" అన్నాను. దాంతో రైటు, వీలరు, డిక్సను, జెంకిన్సు, గులాబుచందు వకరితో వకరు యేదో గొణుక్కున్నారు.

కెప్టెను రైటు అన్నాడు. "కెప్టెను రావుగారూ ! మనకి 'లంచి' వేళైంది. 'లంచి' పూర్తిచేసుకుని ఒకసారి స్థల పరీక్షచేసి – పరిస్థితులు తనిఖీచేస్తే – యేదో విధంగా సరిపెడదాంలెండి. ప్లానులోది ప్లానులో వున్నట్టే చూపిద్దాం. మనం అక్కడికి వెళ్ళి – కాస్త యిటు అటుగా – తుని తవ్వు చేసేస్తే పోతుంది. లేకపోతే కంట్రాక్టర్లు దెబ్బతింటారు. మన పని జరగదు. ఈ లోపున అమెరికానుంచి రైలు ఇంజన్లు, మందుగుండు సామగ్రి రవాణా అయి వచ్చేసిందంటే – మనం పని పూర్తి చెయ్యలేకపోయామని – 'వార్ డిపార్టుమెంటు' మననీ కంట్రాక్టర్లనీ – గుండేసి పేల్చేస్తారు ! ఎందుకొచ్చిన గొడవ ? సుఖాన్ని వున్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకోవడం ! గులాబ్‌చంద్ గారూ! మా సెలూనులో 'లంచి' త్వరగా బందోబస్తు చేయించండి ! ఇదిగో – నావి గోల్డుఫ్లేకు సిగరెట్లు. డిక్సన్ ! మీవి స్టేటు ఎక్స్‌ప్రెస్సే – కెప్టెను వీలరు ? మీ సిగరెట్లు ఛెస్టరుఫీల్డా ? కెప్టెను రావు మీ కేవి నచ్చితే అవి కాల్చండి !"

"నాకు పొగాకు అలవాటులేదండీ – క్షమించండి!" అన్నాను.

"పొగాకు అలవాటులేకపోతే, భోజనం ముందు ఆకలిపుట్టించడానికి ఒకగ్లాసు క్లారెట్టు తీసుకోండి లేదంటారా – ఇంకా బలమైనది – అబిసింతు పుచ్చుకోండి ! అటుయిటూగా వుంటుంది షెర్రీ సేవించండి! డిక్సన్ ధర్మమా అని అన్నీ తెప్పించాడండీ ! సేట్‌జీ ఇలారండి !" అని కేకవేశాడు, కెప్టెను రైటు.

"చిత్తం ! వస్తున్నా ?" అన్నాడు తెల్లటోపీ సేటుజీ.

నాకు మహాకోపంవొచ్చింది. "నావంట్లో అంత తాజాగాలేదండీ" అని అనబోతున్నాను. నా మాట కడ్డం వొచ్చి, సైటు :

"ఆ మాటముందే చెప్పారు కారేం? సేట్జీ! మా బట్లర్‌తో చెప్పి వెంటనే 'డ్రైమార్టినీ' కాక్ టెయిల్ ఒకటి తీసుకురమ్మనండీ! అది పుచ్చుకుంటిరట్టాయనా ఒక్క నిమిషంలో మీ సుస్తీ అంతా మాయం అయిపోతుంది!" అన్నాడు.

"నన్ను క్షమించండి. నాకు వంట్లో కులాసాలేదు. వైద్యుడు పత్యం చెప్పాడు. నేను నా సెలూను కెళ్తాను. 'లంచి' అయ్యాక మళ్లీ కలుసుకుందాం!" అని వాళ్ళని వదుల్చుకొని బైటపడ్డాను. వాళ్ళందరూ నాకేసి తెల్ల బోయి చూస్తున్నారు, నా వ్యవహారం యేం బోధపడక నేనేదో వకరకం జంతువులాగు. ఎడిసను మాత్రం మర్యాదకోసం నా సెలూను వరకూవచ్చి: "మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి! 'లంచి' అయాక మేము ఖబురు పెడతాంలెండి" అని వెళ్ళి పోయాడు.

బతుకు జీవుడా అనుకున్నాను. అయ్యారు - పప్పు అరటికాయ ముక్కలు, గోంగూరపచ్చడి, ఆవకాయ, సాంబారు, పెరుగు భోజనం వడ్డించాడు. హాయిగా భోంచేశాను.

మధ్యాన్నం - ఆరంబాకం దగ్గర మళ్ళీయిదే నాటకం 'వాళ్లతో వీళ్లు మరీకు!' ఎలాగేనా సరిపెట్టే యండి. వెనకనుంచి చూసుకుందాం లెండి! ఇప్పటికిలా కానిచ్చేతురూ! కంట్రాక్టర్లు చెడిపోతారు పాపం!' ఇదేపాట ఈ వార్ డిపార్టిమెంటు ఇంజనీర్లు. ఆ పాటకి వంత డిక్సను, గులాబ్‌చందు కచ్చీవాళ్లున్నూ. సరి పెట్టేడానికి నీయిష్టమా నాయిష్టమా? ప్లాన్లున్నాయి-బ్లూప్రింట్లున్నాయి. అంచనాలున్నాయి. 'చెక్కు' కొల్తలున్నాయి. తనిఖీలున్నాయి. ఆడిట్ వుంది. "ఆ గొడవలు అన్నీ వారు పడతారు. మనం సంయ నంటేసరి - కెప్టెను రావు!" అంటాడు సైటు సిగ్గు బిడియం లేకుండా, కంట్రాక్టర్ల యెదుటే!

"కెప్టెను వీలర్! ఇక్కడ ఎలా అతక బడతాయి కత్తెర పాయింట్లు? పెద్ద గ్రేడి యంటుంది కదా - లూపులైను మార్షలింగులో రైలుకు రైలే బోల్తా పడదూ? మీరే చెప్పండి సలహా?" అన్నా.

అతడు ఎడిసనువేపు చూశాడు. ఎడిసన్ను గులాబ్‌చందువేపు చూశాడు. "ఆ - అతుకోక్క పోవడ మేంలెండి! మీరలా సెలవిస్తే చెప్పలేంగాని! రైలు బోల్తాకొడుతుందన్నారూ - ప్రత్యేకంగా బ్రేక్లున్నాయి - ప్రత్యేకం 'బ్రేకుడౌను రేకే' వుంటుంది సిద్ధంగాను. మీ దయుంటే - అప్పుడూ ఆ పనీ మాకే కంట్రాక్టు ఇప్పించండి!" అన్నాడు చిరునవ్వుతో. వీళ్లిల్లు బంగారంగానూ! వీళ్లు పుట్టు వెంద్రుకలు తీయించుకున్నప్పుడే -వాటితో కూడా సిగ్గుబిడియాలు కాశీలో వదిలిపెట్టేసినట్లున్నారు!

"మనం 'ఒ. కె.' అంటె - ఆ తరవాత యేమైనప్ప టికీ మనకీ పూచీవుండదు - వాళ్లకీ పూచీవుండదు. మొదటి 'పదిరోజులూ మిలిటరీ రన్నింగు స్టాఫ్'తో కంట్రాక్టర్లు చూసుకుంటారుగా, ప్రమాదాలు వెంటనే జరగవులెండి! వాళ్ల యేర్పాట్లు వాళ్ళకున్నాయి! మనం ఇందుకు ఒప్పుకోవచ్చు!" అన్నాడు వీలరు.

కచ్చీ కంట్రాక్టర్లు అందుకున్నారు: "అస్సాం - దిమాపూర్ - లింకులైనులో మేం అలాగే కత్తెర పాయింట్సువేసి అతికేశాం! అబ్ ఫికర్ మత్ కరీయే"

ససేమిరా-నేను ఒప్పుకోలేదు. తు.చ. తలవెంద్రుక వాసి తప్పకుండా ప్లానులో వున్నట్టు పని జరిగి తీరవలసిందే - అని మొండిపట్టు పట్టాను. ఇలాగే రామ రావణ యుద్ధం ఆ సాయంకాలం అంతా సాగింది.

మర్నాడు పొద్దున్న వంతెనల వివరాలు చర్చించాం. రియిన్‌ఫోర్సుమెంటికి అంగుళం ఖడ్డీలు 'టెస్టెడ్'వి వెయాల్సింది-అని డిజైనులో ఒప్పందం. కార్లు లారీలు ప్రక్కలంట నడిచే రహదారికి 'మువ్పావువేస్తే సరిపోతుంది. మమ్మలిని ఇప్పటికే కోసుకు తిన్నారు' అంటాడు గులాబ్‌చందుసేటు! ఇప్పుడు మువ్పావుకి తలవూపితే - అసలుకాడికి అంగుళానికే మోసం! నేను వాటం కాదన్నాను. "అమెరికన్ భారీ లారీలకీ వాటి ట్రైలర్లకీ, పక్కనినడిచే రైలు కదలికకీ నమూనాలు తయారుచేసిన ఇంజనీర్లు అంత తెలియక వెయ్యలేదు. అవి అలాగే వుంచేయండి" అన్నా కఠినంగా.

"అమెరికను డిజైనర్లకేం పోయిందిలెండి! తనది కాకపోతే - కాశీవరకు డేకమంటారు. వాళ్ళ సలహాల ప్రకారం పనులుచేస్తే మనదేశం దివాళా అయిపోతుంది. ఆ మాత్రం దేశభక్తేనా మనకి వుండాలి. నా తలమీద టోపీ చూశారుకద. నేను కట్టుకున్న ఖాదీగుడ్డలు చూస్తున్నారుకద. ఇకనేం! అయినా - కెప్టెను రావుగారూ! అమెరికాలోలాగు లావాదేవీలు మనదేశంలోవుంటే అంగుళం ఖడ్డీలు కాదుకదా - ఏకంగా నాలుగుఅంగుళాల గడ్డర్లేవేస్తేస్తాం మీ శలవు అవుతే!" అన్నాడు సేటుజీ - ధోర్లవేపుచూసి నవ్వు తూను...ఆ పద్దుకి నేను చెప్పినట్టే వొప్పుకున్నారు వాళ్లు, చివరికి ఈ మొండిఘటంతో లాభంలేదనుకుని.

'డెకింగు'కి 'వైబ్రేటర్లు' ఉపయోగించాలి. చేతితో కూరిస్తే వీలుపడదు అన్నాను. కంట్రాక్టర్లు వకటే సణుగుడు, 'డెకింగు' వేసింతరవాత అందుపైన నాలుగు అంగుళాలు మట్టిపోసి తడపాలి అన్నా. "పుస్తకాల్లో రాసినట్టు మమ్మలిని పనిచేయమంటే పనులు జరుగుతాయండీ? పుస్తకాలదారి పుస్తకాలది-పనులదారి పనులది!" అన్నాడు డికన్సు.

"అవును. పుస్తకాల్లో చెప్పినట్టు యుద్ధవ్యూహాలని నడిపిస్తే - యీపాటికి మనం బెర్లినులో వుండవలసింది. హిట్లరు చూడండి! శాస్త్రం-గీస్త్రం వాడికి నైజాంతా! వాడి 'మైన్ కాంఫే' వాడికి శాస్త్రం! కనిపించిన చోటల్లా దెబ్బకొట్టడమే! వాడికివాడే సమానం అండీ! మనవాళ్ళేమిటి - చచ్చు!" అన్నాడు కెప్టెను రైటు ఇంత 'వార్ ఆఫీసు' వీరుడున్నా!

"మావాళ్ళూ అదే అంటారు. శాస్త్రప్రకారం అవుతే కుక్క పిల్లలు పుడతాయని! యేదో సంసార పక్షంగా పోవాలిమరి!" అన్నాడు సేట్జీ. అందరూ ఫక్కుని నవ్వారు. సేట్జీ నా దగ్గిరకొచ్చి "మనం హిందువులమని అడుగుతున్నాను. తమ కెందరండి మగ సంతానం?" అన్నాడు కాస్త మెల్లిగా నలుగురికీ వినిపించేలాగే. ఈ భోగట్టా నీకెందుకయ్యా - అనబోయి - యేదో పెద్దముండావాడు, ఖద్దరు కట్టుకున్నాడు - మర్యాదగానే జబాబు చెబితే పోతుందని.

"సంతానం అసలు లేదండీ" అన్నా.

"అయ్యో! మనధర్మశాస్త్ర ప్రకారం ద్వితీయ కళత్రాని చేసుకోలేకపోయారా?" అన్నాడు ఎంతో విచారిస్తూ.

"నేను బ్రహ్మచారినండీ. వివాహం చేసుకోలేదు!" అన్నా నవ్వుతూను.

"మీబోటి భీష్ములు సత్యాగ్రహాల్లో వుంటే ఈ పాటికి గాంధీమహాత్ములు స్వరాజ్యం సంపాదించేవారు! యేదో సుభాషుబాబు ధర్మమా అని స్వరాజ్యం కనుచూపుమేరలో వుంది. కోహిమా దాటిందంటే మనవాళ్లే పక్షట్టే! ఏమిటో యీ కాంగ్రెసు వైఖరి? ఘడియ కొక మాట - నిమిషాని కొక బేరం! ఇంగ్లీషు వాళ్లని నానాతిప్పలూ పెడుతున్నారు. పోనీలెండి. బ్రిటిషువాడుంటే భూదహనం అంటున్నారు సోషలిస్టులు. ఎలాగేనాసరే-మాలాంటివాళ్ళకి చేతినిండా పని దొరుకుతుంది!" అన్నాడు మనస్ఫూర్తిగానే సేట్జీ.

"నాకు రాజకీయాలు తెలియవండి!" అన్నాను.

"అవును నీతీజాతీఅంటూ ఇంకా పొరులాడుతున్న మనబోటిగాళ్ళం ఈరాజకీయాలతో వేగలేమండి! అయినా-వంశపారంపర్యా వస్తూన్న వృత్తిని వదలుకోలేక మన సాంప్రదాయం అనుసరించి - యీజన్మ గడుపుకుంటున్నానండి! మావాడున్నాడన్న మాటేకాని ఎందుకూ..." అన్నాడు ఆయన. నాకేమిటనడమో తెలిసిందికాదు. పోనీ వాళ్ళబ్బాయి గురించి పరామర్శించుదాం అని: "మీ కుమారుడు - ఏంచేస్తున్నాడండి?" అడిగేను.

"వాడిని ఇంజనీరింగుకి సీమ పంపించి బి. యస్ సి. ఆనర్సు ప్యాసుచేయించానండి. గవర్నమెంటు నౌఖరీ మాకు అచ్చిరాదని - పుస్తకాలచదువు యెలావున్నా - నాదగ్గిరే వుంచుకుని-అన్ని విషయాల్లోనూ క్షుణ్ణంగా తర్ఫీదు చెయించానండి. వాడు బాగా చేతికి అందుకొచ్చే వేళకి - కాంగ్రెసులో చేరాడు. కాంగ్రెసు సభలు, సమావేశాలు, బొంబాయి, కరాచి, చెన్నపట్నం, అలహాబాదు, కాన్పూరు ఎక్కడ జరిగినా భోజనాలకీ పందిళ్ళకీ పాకలకీ గుడారాలకీ దీపాలకీ పంఖాలకీ ఒకటేమిటి శానిటరీ వగైరా సమస్త సప్లయిలకీ మావాడిదేనండి కంట్రాక్టు. అటు దేశసేవా, యిటు నాలుగు డబ్బులూ చేసుకుంటున్నాడండి! రేపు పొద్దున్న స్వరాజ్యం వచ్చిందంటే మనం ముందుకొచ్చి నలుగురిలోనూ తలెత్తుకుని తిరగాలంటే యెన్నో భారీపనులు చేయించాల్సుంటుంది. ఆ పనులన్నీ డిపార్టుమెంటు చేయించగలదా అండి, కంట్రాక్టర్లంటూ వుంటేగాని! మీరు పిన్నలైనా బుద్ధిలో భీష్ములు.బహుయోగ్యులు! మీతోసాంగత్యం లభించడం చేత యేదో నా సంసారంగోడు మీముందు వెళ్ళబోసుకుంటున్నాను! మీరు మరోలాగ భావించకండి అని నా ప్రార్థన! యీ దొర్లతో చెప్పుకోగలనా - చెప్పుతే వాళ్లకి బోధపడి యేడుస్తుందా? నన్ను మన్నించాలి-మీ కాలం చాలా వృధాచేశాను! వాళ్లేదో జల్సాఖబుర్లు చెప్పుకుంటున్నారు లెండి!" అన్నాడు సేట్జీ వాళ్లవేపుచూసి చిరునవ్వు నవ్వుతూ. దొర్లు విస్కీ-సోడాలు పూర్తి చేసుకున్నారు.

"కెప్టెను రావు! మనం డెకింగు తడపడం గురించి చర్చించాము. మట్టివేసి తడపాలని మనం అంటున్నాం. వాళ్లు...డికెన్సు! మీరేమంటారు?" అన్నాడు కెప్టెను వీలరు.

"సిమెంటు సంచులు పరిచి తడుపుతాంలెండి" అన్నాడు ఎడిసన్ను.

"సంచులు మీవికావు. అవి డిపార్టుమెంటువి. సిమెంటు మీరు సరఫరా చెయ్యడమే మా వంతు. మిక్సరుల్లో బస్తాలు వెలిపి - మూర్తికి మూర్తీ - వెంటనే సంచులు లెక్కకట్టి ఉత్తరరక్షణం వప్పగించవలసిందే - డిపార్టుమెంటు అసిస్టెంటు ఇంజనీరుకి! ఆ విషయంలో నేను మీకేం సదుపాయం చెయంలేను అని ఖచ్చితంగా చెప్పేశా." సేట్జీ దొరలు ఒకరి చెవిలో ఒకరు గుసగుసలు ఆడుకున్నారు.

"పాణీఘర్ లోనూ - లఖింపూరులోనూ - హొళెహళ్లీలోనూ-మొన్న ఇక్కడ భోగాపురంలోనూ సంచులని కంట్రాక్టరుకే ఇచ్చేశాం కదూ - సేట్జీ! అక్కడో పద్ధతీ, ఇక్కడో పద్ధతీ అవుతే, ఆడిట్ ఆభ్యంతరం వుంటుంది. అంతా వకటే పద్ధతి అవలంబించి సంచులు వాళ్ళకే ఇచ్చేస్తే యేబెడదా వుండదు. అలా చేద్దాం- క్కెప్టెన్ రావు!" అన్నాడు రైటు.

"అవునండి - వెనక అలాగే జరిగిందండి. ఆడిట్ యేమీ అభ్యంతరం చెప్పలేదండి" అన్నాడు సేట్జీ. ...పిల్లికి ఎలక సాక్ష్యం - కంచే చేనుని మేయడం. "నేను అంగీకరించనండీ! టెండరులో రాసుకున్నట్టు జరగవలసిందే!" అన్నాను కఠినంగా - లాలూచీ సహించలేక.

...ఇంతట్లో - మెయిలుమాట జ్ఞాపకం వొచ్చింది. స్టేషను మేష్టరుకి ఖబురు పంపించి - మెయిలు యే వేళకి యిలా వెళుతుందో కనుక్కోమన్నా. స్టేషను మేష్టరే స్వయంగా రొజుకుంటూవచ్చి "అప్పుడే రెక్కవాలింది. మరి రెండు నిమిషాల్లో వస్తుందండి. మెయిలుని ఆపించమని శెలవా?" అని అడిగాడు...నా మనసులో వున్నది అతను ఎలా గ్రహించాడో! ఒక్క నిమిషం ఆలోచించా...రైలుని ఆపిస్తేనా శుభని నేను పలుకరిచండం వీళ్లు చూస్తారు. ఇక వెంటనే పని కట్టేసి, వస్తువాహనాలు - నగలు నాణ్యాలు - బహుమతులు విందులు - ఆమె కివ్వడం మొదలెడుతారు. నా మర్యాద, ఆమె మర్యాదాకూడాపోయి అపఖ్యాతి పాలవుతాం. వొద్దు అనుకుని, స్టేషనుమేష్టరుతో యేమీలేదు, - వూరికే భోగట్టారు అడిగేనని సర్దేశాను. "చిత్తం!" అని కొత్తగా నేర్చుకొన్న మిలిటరీ సలాం కొట్టి వెళ్ళిపోయాడు...

...సరి, మధ్యాహ్నం మళ్లీ కథ ప్రారంభం! 'డెకింగు' విషయం మళ్లీ వాళ్లెత్తారు. ఆ విషయం ఉదయం తేల్చేశానుగా, తిరిగీ ఎందుకు లేవనెత్తడం అని నేను విసువుగా అన్నాను. అనవసరపు పని, వృధా ప్రయాసం, కొత్తపద్ధతీ - ఎందుకండీ - లేనిపోనిది, అన్నారు ఎడిసన్ను, కచ్చీవాళ్లున్ను. వాళ్లు పాడిన పాటకి దొరలు తాళం వేయడం. గులాబ్ చందు సేటు అన్నాడు:

"క్కెప్టెను రావుగారూ! యీ మిలిటరీ వంతెనలు మఖలోపుట్టి, పుబ్బలో విరిగి - ఉత్తరలో వృత్తికాస్నానం చేస్తాయి. ఆచంద్రతారార్కం వుండిపోయేటట్టు మీరు కట్టనంటారు. జపానువాడు రేపు క్రిస్టమసుకి, కలకత్తా, చిటగాంగు, చెన్నపట్నం విధిగా బాంబు చేయబోతున్నాడని నాకు నిక్కచ్చిగా జపాను శిబిరంనుంచే - అక్కడ మా తమ్ముడు నేతి కంట్రాక్టరు లెండి, వాడిద్వారా - తాజా కబురు వచ్చింది. ఈ పరిస్థితుల్లో - మమ్మలిని నాలుగు డబ్బులు చేసుకోనీయకుండా, ఇలా చిత్రహింసచేయడం బ్రాహ్మణ ధర్మం కాదు. ఇవి చేతులు కావు - కాళ్లనుకోండి. మిమ్మలిని బతిమాలుకుంటాం! జపానువాడి ధర్మమా అంటూ - యీ వంతెనలు కూలిపోయాక యీ సంచులమాట ఎవడిక్కావాలి? ఈ వైబ్రేటర్లవూసు ఎవడెత్తుతాడు? అంగుళం ఖడ్డీల విషయం ఎవడు పట్టించుకుంటాడు? మీరు మా మీద కాస్త దయవుంచుతేకాని - దూర దేశాలనుంచి వచ్చాం - చితికిపోతాం సుమండీ! ఆ తరువాత మీ చిత్తం!" అన్నాడు సేట్జీ ఒక్కధాటీని.

"ఔను సుమండీ క్కెప్టెను రావు! మొన్న కలకత్తానుంచి అమెరికను ఇంటెలిజన్సు ఆఫీసరొచ్చి మెస్సులో సరిగ్గా యీ సంగతే చెప్పాడు మా అందరితోనూ అతిరహస్యంగా! రేపటి క్రిస్టమస్‌లో జపానువాడి ప్లేనుల దాడితో యుద్ధం త్వరగా అటో ఇటో తేలిపోతుంది అని అందరం సంతోషించాం" అన్నాడు క్కెప్టెను వీలరు.

"జపానువాడి ఉద్దేశాలు నాకు తెలియవు. కాని ఇంజనీరింగుశాస్త్రం ప్రకారమున్నూ టెండరు షరతుల ప్రకారమున్నూ - పనులు చేయించడం - నాకు తెలుసు!" అని కాస్త గట్టిగానే అన్నాను ఈ బేరసారాలు ఆపుచేద్దాంఅని. ఏముంది - నేను అవునని వాళ్లు కాదని, నేను కాదని వాళ్లు అవునని, యిలాగే వెళ్ళింది సాయంకాలంఅంతా. ... చీకటి పడ్డాక - నా సెలూనికి వెళిపోతూంటే ఎడిసన్ను, నన్ను సాగనంపడానికి వచ్చి: "రాత్రి పదిగంటలకి అమెరికన్ ఆఫీసర్సు స్పెషల్ యిలా వెళుతూంది.

స్పెషలుని యిక్కడ ఆపించి, ప్లాటుఫారంమీద డిన్నరు యేర్పాటు చేయించారు డికిన్సుగారు. మీరు రావలిసిందని మరీమరీ కోరుతూ నన్ను పంపించారు. మీరు తప్పకుండా దయచెయ్యాలి!" అన్నాడు.

"నాకు ఆరోగ్యం సరిగా లేదు. డికిన్సుగారితో నన్ను క్షమించండని చెప్పండి. మీకు ధన్యవాదాలు!" అని చెప్పేసి, సెలూన్‌లోకి వెళ్ళిపోయాను. మరోగంట పోయాక సెలూనులో వంట పూర్తిచేసి – అయ్యరు అరిటాకులో అన్నం వొడ్డించి భోజనానికి రమ్మనమని పిలిచాడు. బంగాళాదుంప మసాలాకూర, మైసూరు కట్టుచారు, నక్కదోసకాయ ఆవకాయి-సొంఠి, అల్లం, కరివేపాకు వేసిన ఫ్రిజిడేరు మజ్జిగ – ఇక – భూప్రపంచంమీద కావలిసిన దేంవుంది! అమ్మ యెప్పుడూ అనేది. భోజనం అయాక – రెండు తమలపాకులూ వక్కపీటీ ఆరంగంతో తాంబూలంవేసుకుంటే నోటికిశుద్ధి వొంటికి మంచిది అని. అలాగే తాంబూలం వేసుకుని సాయంకాలం చెన్నపట్నంనుంచి వచ్చిన పత్రిక చదువుదాం అని పడకదీపం వేశాను సెలూన్‌లో. ఇంతలో సేట్జీ వచ్చి నమస్కారంచేసి, "అమెరికన్ ఆఫీసర్సు స్పెషలులో అసలైన 'స్టోర్సు'ని దిగుమతి చేయిస్తున్నాను. రాత్రికి పద్మినీ, హస్తినీ, చిత్తినీ, శంఖినీ – అన్నిరకాలు యేర్పాటు చేయించాను. తమ ఆజ్ఞ..." అని చేతులు నులుపుకుంటూ నిలబడ్డాడు. నాకు తలప్రాణం తోకకొచ్చింది. "ఫో, యిక్కడనించి ఫో" అని అనబోయి మళ్ళీ నాలిక కరచుకొని: "మీరు దయచేసి వెళ్ళండి! మరెప్పుడూ నా సెలూను దగ్గరకి రాకండి! నమస్కారం!" అని అతని ముఖంమీద తలుపుమూసి లోపలి ఘడియవేశాను. "చిత్తం!" అంటూ సేట్జీ వెళ్ళిపోయాడు. 'శివ-శివా!' అనుకున్నాను.

ఉదయంలేచి పత్రిక చదివేను:

"...చెన్నపట్నం కాంగ్రెసు లెజిస్లేచరుపార్టీ సమావేశంలో పార్టీ నాయకుడు శ్రీమాన్ రాజగోపాలాచారిగారు ప్రతిపాదించే తీర్మాన పాఠం: భారతదేశాన్ని ఎదుర్కొంటూనట్టి అత్యంత క్లిష్ట పరిస్థితులను గమనించి, భవిష్యత్తులో భారత రాజ్యాంగ ప్రణాళికను సిద్ధముచేయు సమయమాసన్నమైనపుడు ముస్లింలీగు నేడు కోరుచున్నట్టే భారతదేశమునుండి వేరుపడుటకేనిశ్చయించినయెడల అట్టి కోరికను మంజూరు చేయవలయుననిన్నీ ప్రస్తుత అత్యవసర పరిస్థితుల దృష్ట్యా ముస్లింలీగుతో సంప్రతింపులు జరిపి సంయుక్త జాతీయ గవర్నమెంటును స్థాపించుటకు వారిని ఆహ్వానించవలసినదిగా యీ సభవారు అఖిలభారత కాంగ్రెసు సభవారికి సిఫార్సు చేయుచున్నారు.... యీ ప్రమాద భరితమైన పరిస్థితులలో భారతదేశమందలి యీ దక్షిణ భూభాగములో నివసించు ప్రజలు తమ విధ్యుక్తధర్మమును నిర్వర్తించుటకుగాను తగిన రీతిని అవకాశములను కలిగింపగలిగే జాతీయ గవర్నమెంటును యీ రాష్ట్రంలో స్థాపించుట మిక్కిలి అవుసరమని యీ రాష్ట్ర ప్రజలు గాఢముగా వాంఛించుచున్నారు. ఈ రాష్ట్ర ప్రజల మనోభీష్టములను నెరవేర్చి సంయుక్తమైనట్టిన్నీ కట్టుదిట్టమైనట్టిన్నీ ప్రజారాజ్యాంగమును నెలకొల్పు యత్నములో ఉచితరీతిని పాల్గొనవలసినదిగా ముస్లింలీగును ఆహ్వానించవలయునని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు...."

రాజాజీధోరణి నాకు పూర్తిగా నచ్చింది. ఆయన ఎంతో ధైర్యంఅయిన పనిచేశాడు. ఉన్న విషయాన్ని కుండబద్దలుకొట్టినట్టు ఏమీ దాపరికం లేకుండా చెప్పేశాడు. అంతా బాగానేవుంది. కాని, యీయనతో కమ్యూనిస్టులు చేతులుకలిపితే 'అసలు ప్రజాభిప్రాయం సహిస్తుందో సహించదో? గాంధి, పటేలు, నెహ్రూ. అజాదులుకి యిది నచ్చుతుందా? జిన్నా ఏమంటాడో? శాస్త్రిగారి నక్కజిత్తులు బాగా ఫలించాయి! ఆయన రొట్టె నేతిలో పడ్డట్టే! దీంతో వైస్రాయి ఎగ్జిక్యూటివు కౌన్సిలులో ఆయనకి స్థానం ఖాయం అన్నమాటే! శాంతంగారు మాత్రం పెనిమిటితో ఢిల్లీ వెళతారా? లేకపోతే – కాంగ్రెసులోనే వుండిపోతారా? ఆయనకి అంత గొప్ప హోదా లభిస్తూంటే కాంగ్రెసుని అంటిపెట్టుకుని ఆమె కూచుంటుందా? ఇక నాకు సభ అన్నివిధాలా దూరం అయిపోతుంది! ఇక నాపని యింతే...

(ఇంకా వుంది.)

# ఆమ్రపాలి

## 'ధనకుధరం'

శరణము కోరి వచ్చితిని శాక్యమునీ! కరుణాపయోధి! నీ
చరణ రజోలవమ్ము శిరసా వహియించిన చాలు పాపముల్
పరుగిడిపోవునో పతితపావన! నీ చిరునవ్వు వెన్నెలల్
విరిసిన గాదె మా బ్రతుకువెల్గులు తోచిన విన్నినాళ్ళకున్.

సిగ్గగుచున్నదో ప్రభు! వచింపగ; నా కలుషప్రవృత్తిలో
మ్రగ్గిన జీవిత మ్మొడద రాపిడిపెట్ట సహర్నిశమ్ము లి
ట్లగ్గి నొడిన్ ధరించితి రహస్యముగా; మరి నేట రేపటన్
భగ్గున మండకుండునె? స్వభావము దాగునె దాచిపెట్టినన్.

వ్యభిచారమ్ము కులక్రమాగతముగా వాదించి, ఒప్పించి న
న్నభినందించిరి; నాదు జవ్వనము సర్వామోద యోగ్యంబుగా
అభిమంత్రించి, రతోత్సవాదికము లత్యంతంబు గావించి, నా
కభయం బిచ్చిరి దీన కిల్బిషము లేదంచున్ మదాత్మీయులున్.

స్వానుభవమ్ము భాష్యముగ చాదిరి కామకళారహస్య వి
జ్ఞాన పయోధిగా నను; రసజ్ఞ వశీకరణైక చాతురీ
ధీనిధిగా సమగ్రముగ దిద్దిరి, నాట్య విశేష గీతికా
గాన చమత్క్రియాదిక వినోదములన్ మురిపించి రెంతయున్.

చదివితి కావ్యశాస్త్రములు చక్కగ; టక్కుటమార విద్యలన్
మెదిగితి; లోకవృత్తము సమీక్ష యొనర్చితి; వృత్తితంత్ర మం
దెదిగితి; చిత్తమేర్చు బలహీనత నార్చితి; రాటుదేలితిన్
తుది; కులవృద్ధులెల్ల సయిదోడులు గాగ సమస్త విద్యలన్.

నే నెరజాణనై గుణఖనీ! ఇక చూడుము, పట్ట పగ్గముల్
లేనటు సంచరించితి; కులీనుడుగాని మరింక నెవ్వడే
గాని ధనాఢ్యుడైనసరి గణ్యత చూపినటుల్ నటించుచున్
వాని సమస్త సంపద నివాళుల నందితి నా ఉపజ్ఞకున్.

# కవి

## శ్రీ సి. నారాయణరెడ్డి

ఇంద్ర ధనుస్సునుండి ఒ
క్కింత వన్నె స్వీకరింతు
చిరుతారలనుండి కొంత
జీవకాంతి దొంగిలింతు.

చంచలాలతికనుండి ర
సస్పందన మడిగికొందు
మధుమాసమునుండి కొంత
మత్తు కొల్లగొట్టికొందు.

గ్రుడ్డి జవ్వనమ్ము నడిగి
కొందు కొంత బిబ్బోకము
ఉన్మాదము పెంచు అంద
మొసగె నాకు హేవాకము.

చెదరిన కిరణమ్ముల కన్
తుదల నేరుకొని తెత్తును
బెదరిన స్వరములను గూర్చి
హృదయగీతి నిర్మింతును.

స్వర్గస్మృతిలో కూర్చొని
చక్కని మూర్తిని మలతును
మొండిరాతిలో సైతము
గుండె చప్పుడును కూర్తును.

(ఉర్దూకవి మక్దూం మొహియొద్దీన్ 'షాయర్' గీతానికి అనువాదం)



మణులున్ వజ్రములున్ సువర్ణచయముల్ మాగాణముల్ సౌధముల్
గణనాతీతముగా గడించితిని, శాక్యక్షీరవారాశి పా
ర్వణ చంద్రోదయ ! నాదు పొందె సశరీర స్వర్గ సౌభాగ్య ల
క్షణమంచున్ రసికుల్ శతాధికులు వేడ్కన్ కాన్క లర్పింపగన్.

ఏమని చెప్పుకొందు నిసిసీ ! యెల జవ్వన మమ్ముకొన్న నా
కాముక జీవితమ్ము నరకప్రతిమానము, సంఘగౌరవ
క్షేమహరమ్ము కేవలము కృత్రిమ మీ బ్రతు కాత్మ వంచనన్
స్వామి! ఒకింత తేరుకొనజాలదు సంపద లెన్ని గల్గినన్.

# గతకల దారి

## శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

చీకటి పడింది. స్టేషన్‌కు బయటవున్న విద్యుద్దీపాలలో కొన్ని వెలగడంలేదు. ఆ సగంసగం వెలుతురులో మనుషులూ, మనుషుల నీడలు కలిసి చిత్రవిచిత్రంగా కదులుతున్నాయి. ప్లాట్ ఫా ర o మీాదికి రైలు వచ్చింది. బండివాళ్ళ కేకలు, ప్రయాణీకుల హడావిడీ, కూలీల అరపులు, ముష్టివాళ్ళ మూలుగులు అన్నీకలసి ఒకే శబ్దంగా వినిపిస్తున్నాయి. బళ్ళవాళ్ళంతా ప్రయాణీకులకు స్వాగతమిచ్చి తమ బళ్ళలోకి ఆహ్వానిస్తున్నారు. అదృష్టవంతులకు మంచి బేరాలు దొరుకుతున్నాయి, లేనివాళ్ళకి లేదు.

బండిలో కునుకు తీస్తున్న వెంకయ్య లేచి, ఆవులించి, వొళ్ళు విరుచుకుని నిద్ర మత్తు వదుల్చుకోడానికి ప్రయత్నించాడు. కాని యింకా బద్ధకంగానే వుంది. కొంచెం దూరంగా తన ఎద్దు పడుకుని నింపాదిగా గడ్డి మేస్తూంది. వెంకయ్య లేచి నిలబడి బండిపూసి, కనబడినవాళ్ళను "బండి కావాలా బాబూ" అని అడుగుదామనుకుంటూ మానేస్తున్నాడు బద్ధకంమూలాన. రైలు దిగిన ప్రయాణీకులు కొందరు జట్కాలమీాద, కొందరు రిక్షాలమీాద, కొందరు నడిచీ పోతున్నారు. ఎక్కువ సామాన్లుంటేనే తప్ప ఒంటెద్దుబండీ ఎవడెక్కుతాడు? అంచేతే ఊళ్ళో యీ బళ్ళు తగ్గిపోయాయి. ఆరోజు స్టేషన్ దగ్గర వెంకయ్య బండి వొక్కటే ఎద్దుబండి. అయినా బేరం రావడంలేదు.

"మెయిలెల్లి పోయిందేట్రా, ఎల్లయ్యా" అన్నాడు వెంకయ్య రెండడుగులు ముందుకు వేసి.

"ఆ...ఎంతసేపని కూకుంటాది."

"ఎంతకు కట్టినావ్ బేరం?"

"రూపాయి. దాసన్న పేట. నువ్వేటలా నిలబడ్డావ్?"

"బేరం నేదెస్"

"అడుగో ఎనకాల సావుకా రొస్తున్నాడు, సూడు, సూడు. గొప్ప పిసనారిలే" అని రిక్షా తొక్కుకుంటూ వెళ్ళిపోయాడు ఎల్లయ్య.

వెంకయ్య ఆ షాహుకారి ఎవడా అని చూస్తున్నాడు. షాహుకారి పావుగంటయి బళ్ళవాళ్ళతో బేరమాడిఆడి ఏమీాతోచక నిలబడ్డాడు. అప్పటికే బళ్లవాళ్లంతా వెళ్లిపోయారు. షాహుకారి దగ్గర ఒక చిన్న మూటతప్ప మరేం సామానులేదు. షాహుకారి మూట పట్టుకొని మెల్లగా అడుగులు వేసుకుంటూ తనవేపు రావడం చూసి 'ఇది నడిచివెళ్లే బాపతు కాదులే' అనుకున్నాడు వెంకయ్య.

"ఏయ్, బండి కడతావా?"

"మరెందుకున్నాను బాబూ, చెప్పండి ఎక్కడికో" అన్నాడు వెంకయ్య బద్ధకంగా ఆవులిస్తూ.

"కంటోన్మెంటు పోస్టాఫీసు దగ్గరికి."

"సాల దూరం బాబూ, రూపా యవుతాది."

"రూపాయే. ఎవడేనా నవ్వుతాడ్రా నాయనా. ఒరే, నలభైమైళ్ళ దూరం రైలు మీద రూపాయి టిక్కెట్టు కొనుక్కుని వస్తే మైలుదూరంకూడా లేదుకదా, రూపాయేమిటి, న్యాయమేనా చెప్పు."

"కంటోన్మెంటు పోస్టాఫీసుకాడికి రైలు బండి నేదు. ఉంటే ఆడు అణాకే తీసుకెళ్లును."

"ఈ అధిక ప్రసంగమంతా ఎందుకు? ఇంతకీ బండి కడతావా కట్టవా?"

"ఎందుకు కట్టను బాబూ. కాని, రూపా యవుతాది."

"తగ్గవా? అర్ధరూపాయిస్తాను."

"ముప్పావలాకి తక్కువ రాను బాబూ." షాహుకారి స్థితి గ్రహించేడు వెంకయ్య. 'వీడు నడిచి పోగలిగేవాడులా లేడు. బళ్ళ వాళ్ళంతా వెళిపోయారు. ఎవడికోసం యిస్తాడు, ఏం, లేనివాడా?' అనుకున్నాడు మనసులో వెంకయ్య.

"సరే, కానీ" అంటూ షాహుకారి మూట బండిలో పడేసి తనుకూడా ఎక్కి కూర్చున్నాడు.

బండి మెల్లగా చీమలా నడక ప్రారంభించింది. వెంకయ్య బండి కొమ్ముపట్టుకుని నడుస్తూ బండి తోలుతున్నాడు.

"ఒరే అబ్బీ, మహాకుదుపురా నీబండి, ఇంటికెళ్లేసరికి ఒళ్లంతా నొప్పులు పడుతుంది" అన్నాడు షాహుకారి. నడుస్తూ బండి తోలుతున్న వెంకయ్య వెనక్కితిరిగి చూశాడు. చీకట్లో షాహుకారి మొహం కనబడలేదు.

"ఏటి బాబూ, ఏటన్నారు, కుదుపా? అసలు రోడ్డు మంచిదికాదు బాబూ. ఒట్టి గతకలదారి, ఏటి సెయ్యమంటారు సెప్పండి...నెగయ్యా, నెగు నెగు...తప్పుకో బాబూ...టుర్...టుర్...ఒహోహో, ఏటీ గొడ్డు....నీ తల్లిసిగ గొయ్యా.....పోగాలమంటే నీకు...నడవలేవా తిన్నగా...డొక్క సీరేస్తాను తెలిసిందా...ఊ...నడు..."

"కొట్టకురా కొట్టకు. నోరులేని జంతువు నెందుకలా బాదేస్తావ్?"

"సూడండి బాబూ...దొంగగొడ్డు...దీని తల్లిసిగగొయ్యా తిన్నగా నడవక దిక్కులు సూస్తాది. ఎక్కడేనా గడ్డిపరక కనబడితే నడక మానీసి మూతిపెడతాది...ఛత్తెరీ..."

"దానికి తిండి సరిగ్గా పెట్టవుకాబోలు."

"ఎందుకు నేదు బాబూ. ఏదో గడ్డి గాదరా తినకపోతే ఎలా బతుకుతుంది?"

"మంచి తిండి పెట్టాలికదా?"

"ఖరీదైన దానా ఎట్ట మంటా రేటి, మంచొరే, మాకే నేదు మంచి తిండి... అయినా ఉన్నకాడికో ఉలవగింజ వోడేస్తామనుకోండి."

"అందుకే అది చచ్చేటట్టు వుంది."

"దాని తీరేఅంత బాబు. ఇంతకుముందు నాకాడ రెండెద్దు లుండేయి. ఎలాంటెద్దు లంటారు? మహా గనమైన ఎద్దులు బాబు? ఆటికిమాత్రం ఏటి పరవాన్నం ఎట్టేమేటి. ఎలాగుండే వంటారు? సింవాల్లాగుండేయి బాబు. తరవాత సచ్చిపోనాయనుకోండి. ఏ దుండిపోతాది చెప్పండీ, మనంమాత్రం వుండిపోతామేటి? ఇదేనా మంచి ఎద్దే బాబూ. అలాగుందిగానీ మహా గట్టిది. నింపాదిగా ఎల్లినా ఎంతదూరమైనా ఎల్లగలదు. ముసిలయిపోయినా నాలాగే దానిదికూడా గట్టిశరీరం బాబూ. సూడండి, నాకింత

వొయసు వొచ్చిందికదా అయినా రాయినా గున్నాను. సీకట్లో కొంచెం చూపు ఆనదు అంతే. నాకంటె సిన్నోళ్లు నాకళ్ళముందే ముసిలయి ఎల్లిపోనారు బాబూ, ఈ గటాని కింకా కాలం మూడనేదుగాని."

"దృష్టి సరిగ్గా లేదంటున్నావు. బహు చీకటిగావుంది. బండి దేనికేనా గుద్దించేగలవు జాగ్రత్త సుమా."

"లేదు బాబు ... రోజూ తోలుతున్న వోడినేకదా. అసలు ఎద్దుకే దారి అలవోటే బాబూ. బళ్లొస్తే అదే తప్పుకుంటాది ... తప్పుకో నాయనా ... తప్పుకో...టుర్... టుర్ ... తప్పుకోవయ్యా నాయుడూ ... ఇయాలా నిన్నా బాబూ, సిన్నప్పటినుంచి తోలుతున్నాగదా, గుద్దించేస్తానా? చూపు సమంగా నేదంటారూ, నిజమే. ముసలికాలం గదా మరి...అందుకే ఎప్పుడూ సీకటిపడ్డాక బండికొమ్ముపట్టుకు నడుస్తూనే తోలుతాను. కష్టమే అనుకోండి ... నేకపోతే పొట్ట ఎలా గడుస్తాది బాబూ. పోనీ ఆదుకునేవో డెవడూ నేడాయె. ఒకేఒక గుంటడు. ఆడేదో యింత గంజి పోస్తాడని ఆశపడ్డాను బాబూ. కాని సెడిపోనాడు...మా ఆడదాయికాడ మూడు తులాల బంగారముంటే ఆడే తగలేసినాడు. పోతేపోనీ, ఆడేనా దక్కినాడుకాడు బాబూ ఇల్లొగ్గిసి పారిపోయినాడు. మరి పత్తా నేదు...... ఔను బాబూ......నిజవే... ఎందుకు సెప్పండీ బతికి, సుకం నేక పోయినాక...... నా కళ్లముందు పుట్టి పెరిగినోల్లు ఎల్లిపోతున్నారు బాబు, ఈ గటాని కింకా కాలం మూడనేదు. బంగారం నాంటి కూతురు సచ్చిపోయింది గదా ... నా ఆడది నానంటే పడిసచ్చేది. ఎన్ని సికాకులు పడింది బాబూ ... నాను తప్పతాగి సితకదన్నినా నానంటే పడిసచ్చేది...మీకు తెలీదు బాబూ, బూదేవినాంటి ఆడది... నాకు మరి దక్కనేదు. బొట్టికోసం, బొట్టెడు కోసం బెంగెట్టుకుసచ్చిపోయింది...దానికెన్ని బాదలు పెట్టినాను ... దాని ఉసురు నాకు తగిలింది బాబూ. సేసినపాపం ఎక్కడికి పోతాది సెప్పండి ? అందుకే నాకేటి మిగిలింది బాబూ? ఏమిటి మిగిలింది?...

"సిన్నప్పుడెంత జలసాగా బతికినాను బాబూ...సెబితే నమ్మరుగాని వోరానికి నాలుగైదుసార్లు సుక్క పడవలసిందే. ఇంటికాడ మాంసంగాని, సేపలుగాని కూర నేకపోతే మెతుకు సొక్కేది కాదు...రోజుకు రెండుమూడు రూపాయిలు దొరికేవి బాబూ, సెప్తే నమ్మరుగాని. ఆ రోజుల్లో ఏటి అంతా కారుసవక గదా......మహాజలసాగా ఎల్లేది ఎవ్వారం. ఎక్కడలేని సుట్టాలూ వొచ్చి తినేవారు బాబూ. మరిప్పుడో..........

"...సేతిలో బెల్లం ఉన్నంతవరకే
కాకి బల్గమంటూ
సేతిలో బెల్లం జారిపోయిన
ఎవరురారు వెంట"...

అంతేబాబు నోకం, అంతే ... కట్టుకున్న ఆడది నేక, కావలసినోల్లు నేక, సుట్టాలు పక్కాలు నేక ఒంటెద్దుబండినాగ ఎందుకు బాబూ యీ జలమ ? ... బాబూ నిద్దరోతున్నారేటి ? వొచ్చేసినాము అదుగో ఆ మలుపు తిరిగితే అదే ... ఇదొక గతకలదారి బాబూ ... రోడ్డు సన్నం, రద్దీ ఎక్కువ. గూడుసెడ్డు సామాన్లబళ్లు, ఫేకటరీబళ్లు, పల్లెటూరోళ్ళ సంతబళ్ళూ అన్నీ యిక్కడే తగుల్తాయి బాబూ ... టుర్, టుర్...నెగు,

నెగు, తప్పుకోవయ్యా తప్పుకో ... ఏయ్ బండోడా, ఎడవఁకి తోలురా ఎడవఁకి ... అరెరె ... పల్లెటూరి బైతులు ... నిద్దరోతున్నావేట్రా ... అరెరె ... సూసుకోవేం, కల్లునేవేటి? ఓరి నీ..."

ఒంటెద్దుబండి మరొక బండికి గుద్దుకుంది. ప్రమాదమేమీ లేదుకాని కొద్దిగా సందడి జరిగింది. జనం మూగేరు.

ఆ స్థలంవద్ద రోడ్డుదీపం వెలగడంలేదు. ఆ చీకటిలో ఒకరి మొహాలు ఒకరికి సమంగా కనబడకపోయినా 'నీదితప్పంటే నీదితప్పని' పోట్లాట జరిగింది. దారిపోయే పెద్దమనుషులు, చుట్టుపట్ల దుకాణదారులు వచ్చి తగవు తీర్చగానే ఎవరుమాన వారు చెదిరిపోయారు. మళ్లీ బండి నడక ప్రారంభించింది. బండికొమ్ము పట్టుకుని నడుస్తూ వెంకయ్య ఆ పల్లెటూరి బండివాడిని బూతులు తిడుతూ బండి తోలుకెళ్తున్నాడు.

"సూడండి బాబూ, పల్లెటూరి నంజాకొడుకు ఈడి తల్లీసిగగొయ్యా. కుడిసేతి పక్కనుండి బండి నడుపుతూ నాది తప్పంటాడు. పోలీసుజవాను నే డక్కడ. ఉంటే ఆడి పనౌను. నాకు సూపు సమంగా ఆనదు నిజవేఁ కాని తప్పెవడిదో మీరే సెప్పండి...బాబూ, నిద్దరోతున్నారా?" అని బండిలోకి తొంగి చూశాడు వెంకయ్య. బండిలో షాహుకారి లేడు. బండి నిలబెట్టి, వెనక్కి పరుగెత్తి బండి గుద్దుకున్నచోటికి వెళ్ళి చూశాడు. షాహుకారి కనబడలేదు. కేక లేశాడు, బూతులు తిట్టేడు, మొత్తుకున్నాడు.

వెంకయ్య మరి యింటికి వెళ్ళలేదు. ఎందుకూ యింటికి? బండి మళ్ళీ స్టేషనుకే తోలుకుపోయాడు.

---

కామార్తా హి ప్రకృతికృపణా
శ్చేతనాచేతనేషు॥

కామోద్రిక్తులైనవాళ్ళకి ఇది ప్రాణీ, ఇది ప్రాణం లేనిదీ అనే జ్ఞానం వుండదు.

♦ ♦ ♦

యచ్ఞా మోఘా వర మధిగుణే
నాధమే లబ్ధకామా॥

నీచుడు ఇస్తే పుచ్చుకోడంకన్న ఉత్తముణ్ణి అడిగి లేదనిపించుకోడం మేలు.

# సేవాపరాయణుడు

## మా గోఖలే

గురూజీగారి లోకబంధు పత్రిక, లోకబంధు ప్రెస్సు, లోకబంధు బుక్ పబ్లిషింగ్సు వగైరా సంస్థల్లో నాలుగు నెల్ల కిందటే వందరూపాయల వుద్యోగానికి కుదురుకున్న గుర్నాథానికి, ఓరోజు బాంబుగుండు పేల్చినట్టు యింకో వందరూపాయలు యింక్రిమెంటయింది.

ఈ సంఘటనపై ఏ మనస్తత్వ పరిశీలకుడైనా గుర్నాథం మనసులో ఏం జరుగుతున్నదీ పరిశీలించ పూనుకోడం ఏమంత తెలివైన పనికాదు.

ఎందుకంటే తను గురూజీగారికి ఏ యింత లాభసాటి పనో చేసి, ఆయనచేత అమాంతం యింత యింక్రిమెంటు యిప్పించుకునే సందర్భంలో ఆయనకు స్వల్పంగానైనా శ్రమ కలిగించి వుండొచ్చని గుర్నాథం తన్ను తను ఎన్నయినా తిట్టుకుంటాడు కూడా.

ఏమైనా గురూజీగారికీ, గురూజీ కుటుంబానికీ, కుటుంబ పరివారానికీ కృతజ్ఞత తెలుపుకోంది తన మనసు శాంతించ దనుకున్నాడు గుర్నాథం. అందుకే- బీదగా వుందనుకున్నా సరే- రెండు డజన్ల యాపిల్సూ, రెండుంబాతిక శేర్ల పచ్చి కిసుమిసూ, యింకొన్ని వగైరాల్ని బుట్టలోవేసుకుని గురూజీ బంగళాకు బయలుదేరాడు.

గుర్నాథంభార్య దుర్గాభవాని వెంకాయమ్మ గుమ్మందాకా వచ్చి “మరీ నీరసంగా వుంటున్నారు, రెండుమూండు యాపిల్లో, కాసిని కిసుమిసో వుంచుకుని పోరాదూ?” అని అనిచూసింది.

నిజానికి వొంటికి మంచిచేసే ఖరీదుగల వేట్నయినా పచ్చి విషంగా తన పెనివిటి జమకడ్తాడని తెలిసినా, యీ సందర్భంలో అడిగిచూసింది దుర్గాభవాని వెంకాయమ్మ.

కాని గుర్నాథం పిడిరాయివంటి మనిషి “ఏమిటీ? యాపిలుపళ్లూ కిస్మిసా? నీకేమన్నా మతిపోయిందా ఏం? నా జన్మలో యింట్లాంటివి తిననని నీ కెన్నిసార్లు చెప్పానూ?” అన్నాడు గుర్నాథం.

“బాగుంది వాట్ని మనంగా మనం కనుక్కోలేదుగా! వారి కెట్లాగో యిస్తున్నాం గనక రెండు వుంచమన్నాను!” అంది దుర్గాభవాని వెంకాయమ్మ.

“కొన్నాం! కనుక చస్తామా? ఆ మహారాజులు వీట్నితప్ప తినరు గనక కొన్నాం! లక్ష చెప్పు! నాలుక పీకినాసరే వీట్ని తిననూ, తినేందుకు నా చేయి రాదు!” అన్నాడు గుర్నాథం దులిపేసుకుని బుట్టతో వీధిలోకొస్తూ.

“గుర్నాథంగారా? పొద్దున్నే పెద్ద బరువు మీద వేసుకున్నారే?” అన్నాడు గురూజీ సంస్థలో యింకో వుద్యోగయిన సీతాపతి, గుర్నాథాని కెదురై.

“ఎబ్బే మనవేపు మాగాణీ ఒంకాయలు! ఎవరో స్నేహితుడు పడేసి పోతేనూ కాసిని మన గురూజీగారికి రుచి చూపిద్దామనీ-” అనేశాడు గుర్నాథం.

“అన్నట్టు మీకు యింక్రిమెంటిచ్చార్టగా? బియ్యేఫస్టున పాసై పదేళ్లుగా నమ్మకంగా పనిచేస్తున్నా నా దౌర్భాగ్యాని కేనాడూ యింత అదృష్టం పట్టలేదు. అయినా మీ అదృష్టానికి సంతోషించకుండా వుండలేను” అన్నాడు సీతాపతి.

“మీ బుద్ధి మంచిది గనుక ఆ మాటన్నారు! నాకీ యింక్రిమెంటిచ్చినందుకు ఆఫీసులో ఎంతమంది ఎందుకు కళ్ళకు కారం రాసుకుంటున్నారో నా కర్థంకాకుండా వుంది. చూశారా మనవాళ్ళ తీరు ఎట్లా వుంటుందో? ఈ రకంగా వలవల ఏడవడం మానిపోయిన మర్నాడు మనజాతి బాగుపడ్తుంది! అసలు నాకీ యింక్రిమెంటిచ్చినప్పుడే గురూజీగారు నన్నో విషమపరీక్షకు గురిచేస్తున్నా డనుకున్నా. నలుగురు నాలుగురకాలుగా అనుకునేట్టు యిది గావడం ఏమిటోగా వుంటుంది చూడండి! ఆ మాటకువస్తే నా అదృష్టం నా చేతిలో వుందా? ఆ గురూజీగారు యింత పెడ్తే తింటాం లేకుంటే నోరెత్తం! ఈ వ్యాపారం వారిది చూడండి!” అన్నాడు గుర్నాథం.

“కావచ్చుగానీ మనం పడ్తున్న శ్రమకు లాభాలుంటున్నందువల్లే మనకు కొంత న్యాయంగా ముట్టవలసుంటుందని మన మెందుకనుకోగూడదూ?” అన్నాడు సీతాపతి.

“అబ్బో అవి పెద్దమాటలు! ఆ పిచ్చాలోచనలుండే మనం చెడుతున్నాం! నేను పెట్టుబడిపెట్టి

నా తెలివితేటల్తో లాభాలు సంపాయించుకుంటూ డబ్బు నా యిష్టప్రకారం వినియోగపర్చుకోవచ్చు నంటారా లేదంటారా? మనకు తెలివితేట లున్నయ్యీ కాని డబ్బులేదు. అందుకే మనం యింకోరి దగ్గిర వుద్యోగం చేసుకుంటున్నాం. అంతేగాని వారు బాగుపడ్తున్నారని ఆడిపోసుకుంటామా? ముఠాలుగట్టి వారిమీద తిరుగుబాటు చేస్తామా? ఎంత నీచం! ఎంత పాపం!పూర్తిగా తప్పుదారి! అన్నట్టు ముఠా లంటుంటే మంచి విషయం జ్ఞాపకం వచ్చింది! మన ఛీఫ్ కంపోజిటరు వెంకటేశ్వర్లు ఎంత తమాషాచేశాడో చూశారా?" అన్నాడు గుర్నాధం.

"అతన్ని పన్లోనుంచి గురూజీ డిస్మిస్ చేశార్టగా? పాపం పిల్లలుగలవాడు!'' అన్నాడు సీతాపతి.

''వాణ్ణి పాపం తలచటం కూడా పాపమే! లుచ్చాపని! ఎంతద్రోహం చేశాడో చూశారా?'' అన్నాడు గుర్నాధం.

''ఎవరికీ?'' అనడిగాడు సీతాపతి.

''ఎవరికేమిటి! మన కంపెనీకీ, గురూజీకీ! ఏరు దాటి తెప్ప తగలబెట్టే రకం! ఆయన అన్నం తింటూ ఆయన్నే మోసం చేయటమా?'' అన్నాడు గుర్నాధం.

''ఇంకా నయం! వెంకటేశ్వర్లు మీ దగ్గిర అప్పు చేసి ఎగవేశాడనుకున్నా!'' అన్నాడు సీతాపతి.

''అంతకన్న ఘనకార్యమే చేశాడు! అసలు వాడిమీద పితూరీలు చెప్పి వాణ్ణి డిస్మిస్ చేయించింది నేనేనని అందర్తో టాంటాం గొడ్తున్నాట్ట! చూశారా యీ విచిత్రం?'' అన్నాడు గుర్నాధం.

''అనే నేనూ విన్నాను'' అన్నాడు సీతాపతి.

''ఇంకేం! మీదాకా గూడా వచ్చిందీ? అమ్మ పిడుగా! అసలు నేను వచ్చి నాలుగు నెల్లయినా గురూజీగారు నన్ను కాస్త యిదిగా చూట్టం మొదలు పెట్టేసరికి ఎంతమందికి ఎంతెంతగావుందో చిలుము మింగిన ట్టా మొహాలే చెబుతయ్! ఇదిగో నేను యిందాకనే అన్నానే? మనపూర్తిగా మనమెంత నమ్మకంగా గురూజీగారి పనిచేస్తే వారంత యిదిగానూ మనల్ని చూస్తారు. వీడున్నాడే - యీ వెంకటేశ్వర్లు? ఎంతడబ్బు వుట్టుడియంగా కాజేసేవాడో మీకు తెలుసా?'' అన్నాడు గుర్నాధం, సీతాపతి మొహం దగ్గిరకొస్తూ.

''ఎవరివీ?'' అనడిగాడు సీతాపతి.

''ఇంకా ఎవరిదేమిటి! మన గురూజీగారిదే! ఓవరు టైము పనిచేసినట్టు నటించి ఓ వారంరోజులకు వాడికీ, యింకో పదిహేనుమంది వాడి ముఠాకూ ఓవర్ టైము వేసేశాడు!'' అన్నాడు గుర్నాధం.

''నటించట మేమిటీ? మామూలు టర్నో వర్కిబట్టి ఓవర్ టైము పని సక్రమంగా జరిగిందీ లేందీ తెలిసి పోతుందిగా? యీ విషయం యివ్వాళ కొత్తకాదే'' అన్నాడు సీతాపతి.

''ఇంకా నయం! అసలు మామూలు పనిగంటల్లోనే వీళ్లు సహాంపనే చేస్తుండిరి! ఇంక ఆ రోజు ఓవర్ టైము పనిచేసిందంతా కంపెనీకి దండగేగా? వెనక నేను వుద్యోగాని కొచ్చిన ఒకటి రెండు రోజుల్లోనే యీ విషయం కనిబెట్టి గురూజీగారితో అని చూశా. అప్పుడు ఆయన నన్ను దోరకంగా చూసె.ఆయన మటుకు సామాన్యుడా? ఆవలిస్తే ఎన్ని పేగులయిందీ లెక్క చెప్పేస్తాడు! పాపం పండినట్టే యీ వెంకటేశ్వర్లు దొంగ ఓవర్ టైముకు డిమాండు పెట్టి వాడి ముఠాతో స్ట్రయికు చేస్తానన్నాడు! సరే! ఎవ రెంత చేసుకుంటే అంత!'' అన్నాడు గుర్నాధం. ''ఏమైనా వెంకటేశ్వర్లు పని వూడ్డంలో పరోక్షంగా మీ చెయీ కొంత వుందనాల్సిందే." అన్నాడు సీతాపతి.

''రామరామ! ఎంతమాటన్నారు! అన్యాయంగా ఒకరినోటికూడు కొడ్డ వచ్చానంటే పురుగులుపడి పోతాను! ఆయన వ్యాపారం, సంస్థ మంచీ చెడులు నిర్ణయించుకునేది ఆ గురూజీగారే. నాకుమటుకు ఆయన వుప్పుతింటూ ఆయన కన్యాయం చేయడం వల్లకాని పనీ - నా మిత్రు లెవర్నికూడా అట్లా చెయ వద్దని పదేపదే చెబుతాను. నిజానికి మన ప్రెస్సూ, ఆఫీసుల్లో ఎన్నెన్ని దురాగతాలు జరుగుతున్నయ్యో చూసి, నేనెంతగా కుమిలిపోతున్నానో మీ కెట్లా తెలియ చెప్పను చెప్పండి?''అన్నాడు గుర్నాధం నిట్టూరుస్తూ.

"టేబిలు దగ్గిరదించిన తలఎత్తకుండా పనిచేసుకు పోతుంటంవల్ల మీకు తెలుస్తున్నన్ని విషయాలు తెలుసుకోలేక పోతున్నందుకు మిమ్మల్నిచూసి యీర్ష్యగావుంది.ఆమాటకొస్తే మీరు ఫలానా పనంటూ చేస్తున్నారనిగాని, మీ వుద్యోగం ఏదయిందనిగాని నా కివాల్టివరకూ తెలియదంటే నమ్మండి" అన్నాడు సీతాపతి.

"నాబొంద నాకుమటుకు తెలిసేడ్సిందీ! పనివాళ్ళ పని కనిబెడ్తూ పనిచేస్తుండమనే ధ్వనితో గురూజీగారు ఏదో అంటే నే నేదో చేసుకుపోతూ మొదట్లో తికమక

పడ్డా. అయినా ఏ పనిచేసినా గురూజీగారి పనే చేసినట్టవుతుందిగా !"

ఎట్లాగవుతేనేం సీతాపతిని తెంచుకుని గురూజీ బంగళా కెదురుగావచ్చి నుంచుని ఒక్కసారి తృప్తిగా నిట్టూర్చాడు గుర్నాథం.

గురూజీ బంగళా మెయిన్‌గేటు పక్క దిమ్మమీద గిల్టులో :—ది హౌవుస్ ఆఫ్-లోకబంధు పత్రిక, లోకబంధు ప్రెస్, లోకబంధు బుక్ పబ్లిషర్సు - అని మెరుస్తున్న అక్షర పంక్తుల్ని చూసి తల ఆడించాడు గుర్నాథం.

గుర్నాథాన్ని చూసి 'ఠీక్ హై' అన్నాడు గేటు ఘూర్కా. గేటు ఘూర్కాను ఆప్యాయంగా ఆపాద మస్తకం చూస్తూ అవ్యక్తంగా నవ్వాడు గుర్నాథం.

పోర్టికోలో గురూజీ సెవెన్ నాట్ సెవెన్ సెవెన్ సెవెన్ గచ్చకాయరంగులో కన్నుల కింపుగా కనుపించక పోయేసరికి మనసు కాస్త చిబుకుమంది బుట్టతో పోర్టికోలో కొచ్చి నుంచున్న గుర్నాథానికి. గురూజీ బంగళాలోంచి బయటకు వెళ్ళేవేళలు షుమారుగా తెలుసు గుర్నాథానికి. అయినా వేళగాని వేళ యివాళ గురూజీ బయటికి పోయినట్టే వుంది.

ఇతరత్రా కూడా యివాళ పోర్టికో వెల్తిగావుంటం ఓ పక్క ఆశ్చర్యం కలిగించినా, గురూజీ పెంపుడు కుక్కలు పోర్టికో మెట్లమీద ముక్కుపుటలు ఎగర వేస్తూ గొంతుకూచుని వుండకపోటానికి యింకోపక్క గుర్నాథం తృప్తిపడకపోలేదు.

కాని, గుర్నాథం పొరపాటు పడ్డాడని చప్పున బయటపడింది.

అకస్మాత్తుగా టఫీమని రహస్యద్వారాలు తెరుచుకుని కత్తులు కఠార్లతో అక్కడి కక్కడ ప్రత్యక్షమైనట్లు టాయితుపాకుల్తోనూ, కారు హారన్లతోనూ బండిచక్రాల్తోనూ స్తంభాలచాట్నుంచీ, గచ్చరుగుల మెట్లనుంచీ, క్రీపరు తీగెలచాట్నుంచీ సైజువారీగా అరడజను గురూజీ సంతతి బరబర వచ్చి గుర్నాథాన్ని వాటేసుకున్నారు.

"ఎందుకొచ్చా ?" అన్నాడు టాయితుపాకి.

"ఏంతెచ్చా ?" అన్నాడింకో ఫుట్‌బాల్ బనీను.

"ఏమిటాబుట్ట ?" అన్నాడింకో గడ్డి హాట్.

"అందులో దేంటి ?" అన్నదో ఎర్రబిళ్ళల గౌను.

"పప్పులుంటే పెట్టు !" అన్నదో బండిచక్రం. ఇంకో క్షణానికి గుర్నాథం చేతిలో పళ్ళబుట్ట పగిలి చిందరవందరగా పక్కలకు పోయినన్ని పోగా అందిన వాట్ని పీక్కుదింటం మొదలుపెట్టారా టాయిటుపాకీలు.

"రైలుబండి ఆడ్తాం !" అన్నాడు కారు హారన్ గుర్నాథం చొక్కా వెనక పట్టుకు వేళ్ళాడ్తూ.

"నేను గుర్రమెక్కుతా !" అన్నాడు టాయి టుపాకీ గుర్నాథం మెడమీద కెక్కుతూ.

"నేను యిమానం ఎక్కుతా !" అన్నాడు గడ్డి హాట్ గుర్నాథం బుజంకుండా పాకుతూ.

"ఆ జోబిలోదేంటి ఎల్లగా ?" అంది ఎర్రబిళ్లలగౌను గుర్నాథం జేబులో పెన్ను ఎగిరి వాటేసుకుని వేళ్లాడ్తూ.

ఇంకొంచెం సేపటికి ఒక జేబూ, ఒక చొక్కా చెయ్యీ, గూళ్లమధ్యా, పంచదిగువనా ఫట్రున చిరిగి చీలికలు పేలికలుగా నుంచున్నాడు గుర్నాథం !

"ఏయ్ ! పిల్లలూ ఏమిటా ఆటలు. ఎవరు? నువ్వా గుర్నాథం. నయం ఇంకెవరైనా పెద్దమనుషులొచ్చినా యింతేగా యీ పిల్లలూ ? వీళ్లుబాగా ఆటలాడిస్తున్నట్టున్నారే నిన్నూ ?" అని పలికింది పోర్టికో స్తంభాల మధ్యకొచ్చి నుంచున్న గురూజీ విగ్రహం.

"అబ్బే-నేనంటే తమరి పిల్లలకు చనువు-"అన్నాడు గుర్నాథం చీలికలు పేలికల్ను సున్నితంగా సర్దుకుంటూ.

# కపోత పునరాగమనం

శ్రీ రమణా రెడ్డి

నేను :

“ వేసంగి సంజెవేళా
ఒకమారు,
గుడి గాలిగోపురముపై
అంచుపై
చిలకల్ల సరసచేరీ,
అపుడపుడు
సుమగంధవాహాసరసీ
చొరబారి,
తొలకరుల తుంపురులతో
బాసాడి,
శిశుదర్శనోత్సుకమునా
చనుదెంచు
ఆల్మగల నెచ్చరించీ,

“ తొలితార, గుండ్రడ తలకూ
మణికాగ,
మిన్నెగసి మంచుకరచీ,
దిగుడీది,
అంతరపు గాడ్పు సుడియా
వలయముల
పల్లటీలను కొట్టుచూ,
ఉండగానే జూచితీ
చిననాడు,
ఆనాడు మొదలుకాగా,
ఈదనుక
మరల దర్శింపనైతీ,
నీరూపు
రేఖలన్నీ మరచితీ.
ఎందుండి చనుదెంతువూ
ఇన్నాళ్ళు
చూపులే కరువాయెనూ;
మొక్కట్లు
ఇక్కట్లుపడినయట్లూ
తెలిపేను !
మెడనాడి చేవచెడెనా ?
లేకున్న
కూజితం బొనరింపవే ?
మెడపట్టు లేయాకెలూ
దువ్వడా
నీ మగడు తోడులేడా ?
చిరుకడుపు చెరువాయెనే,
ఏదేది
నీ సంతు కనిపించదే ?”

అది :

“ ఏమంటి వేమంటివీ
నా తండ్రి
ఎంతదయ చూపిస్తివీ !
ఇన్నాళ్లు
కనకష్టముగ బ్రతికితీ
ఈశ్రద్ధ
ఎవరు చూపగ నోచనూ;
నా వనట
వినిపింపగా వెరతునూ;
లోకులకు
కనిపింపగా వెరతునూ;
భయమేదో

నాదు మదిలో మెదలునూ;
చేవ చెడి
చాటుమాటుగ పోదునూ.

“అనుభవం అల్పమైనా
చెప్పెదను
నే చూచి నంతకైనా :
కత్తుల్లకోవనుండీ
వస్తుంటి
శక్తుల్ల లోవనుండీ;
డేగల్ల దేవిడీలూ
చూచాను
కాకుల్ల చావిడీలూ;
పాపాల నల్లపంటా
చూచాను
పాపల్ల చితులమంటా;
ద్రోహాల పేరోలగం
చూచాను
దుర్మోహ సింహాసనం;
రాకాసి కొండబిలమూ
చొచ్చాను
మానవుని మందిరమ్మూ;
నిరుపేద మట్టియిల్లూ
దూరాను
అలకాధిపతుల మహలూ;
ధని యేలికైన రాజ్యం
పోయాను
ధని కూలబడిన రాజ్యం;
స్వేచ్ఛకలిగినవారినీ
కలిశాను
స్వేచ్ఛమాలిన వారినీ.

“ఆయుధాగారాలనూ
చూచాను
అస్త్ర సన్యాస సభలూ.
లాభాల వేటగాళ్లూ
తినుచుంట
మానవుల నెత్రుకూళ్లూ.
పరిశుద్ధ భక్తియనుచూ
వెంటనే
విధ్వంసనాలు చేస్తూ
స్వేచ్ఛనే దాస్య మనుచూ
మసిపూసి
మారేడుకాయ చేస్తూ
యుద్ధ ప్రయత్నాలనూ
శాంతి యని
పందినే నంది చేస్తూ
ఉన్నారు వున్మత్తులై
దుష్టులై
వారె నను పట్టినారూ
అగచాట్ల పాల్జేసిరీ
నా సఖుని
దయలేక చెరపట్టిరీ
నా కడుపు కాల్చినారూ
చిరుగుడ్లు
నిష్ఫలము చేసినారూ
ఎట్లొ తప్పించుకొని నే
నిక్కట్లు
గడచి చనుదెంచినాను.”

నా టి క

# అందని అందలాలు

**కపులారి**

పాత్రలు:

శారద — 25 సం॥రల వయస్సు.
సుదర్శనం—30 సం॥రములు దాటుతయ్. శారద భర్త.
సత్యం — ,, సుదర్శనం స్నేహితుడు.
సూర్యం —28 సం॥రలు వయస్సు. శారద బంధువు.

[సుదర్శనం ఇల్లు; మధ్యనహాలు; హాలుకు రెండు వైపుల గదులు. వెనుకభాగములో వంటగది. హాలులో 'హాంగర్సు'కు సుదర్శనం విలువైన బట్టలు వ్రేలాడు తూంటయ్. హాలులో అందమైన కుర్చీలు. సమయం రాత్రి. తెరలేస్తుంది. నే పథ్యంలో.

ఓ, ఓ హైహో', 'ఓ ఓ హైహో' బీబీ అని అందలంమోత వినిపిస్తూంటుంది.]

(సుదర్శనం, సత్యం ప్రవేశం.)

సుద: ఈ రోజుల్లోకూడ అందలా లున్నాయిరా ?

సత్య: నీ బోటివారికోరకైనా అవి ఉండితీరాలి.

(అశబ్దం క్రమంగా సన్నగిలిపోతుంది).

సుద: సరేగాని బ్రదర్, మా బోటి వాళ్ళమీద బొత్తిగా శీతకన్ను వేశావేమిటి ?

సత్య: భలేగా వేశావురా, ముందుకాళ్లకు బంధం.

సుద: (ఏమీ ఎరగనట్టు) అదేమిట్రోయ్ ?

సత్య: ఆ! ఏముంది! గురివెందగింజకు తన నలుపు తనకు తెలీదటలే.. ...నీకు గల పెద్దపెద్ద స్నేహాల ముందు, నీ దర్జాముందు, నేనెంతరా బ్రదర్! నాబోటివాడు నీ కంటిలో దూరతాడట్రా ?

సుద: ఎంతమాటన్నావురా బ్రదర్! నే నావిధంగా ఎప్పుడు ప్రవర్తించానో చెప్పు. ఏదో అనాలని అనడంగాని...ఇంతకూ అసలుసంగతి చెప్పెయ్యమంటావా ? ఏమిటి ?

సత్య: నేను నీ కెంత పనికిరాకపోయినా, మాటవరుసకైనా కూర్చోమనవచ్చునేమో.........అయినా ఆ గౌరవమర్యాదల ఘనత నీకెందుకులే దక్కనీయడం ? (అంటూ కుర్చీలో కూర్చుంటాడు.)

సుద: Excuse me brother ఏదో మాటల్లో మరచిపోయారా.

సత్యం: ఏదో వేశాకోశానికన్నా గాని.

సుద: అదేమీ కాదురా బ్రదర్. నీవు చెబితే నమ్మవు గాని, నీవంటే నా కెందుకో తగని భయంరా.

సత్య: అరే, నేను మనిషినిగాని, రాక్షసుణ్ణి కాదు రోయ్.

సుద: ఆ సంగతి నాకూ తెలుసు.

సత్య: పోనీ, తిండికి నోచుకోకపోతె మానె, ఒక గ్లాసు మంచినీటి ద్రవపదార్థానికైనా నోచుకోలేదేరా.

సుద: (నిట్టూర్పుతో), నీ వనడానికి, నేను చేయడానికి సరిపోయింది. (శారదా, శారదా మంచినీళ్లు పట్టుకురా. తీసుకువస్తున్నా అన్న శారద గొంతు వినిపిస్తుంది.)

సత్య: శారద ఇక్కడే ఉందన్నమాట. (ఇంటివంక చూస్తూ) బావుందిరా యిల్లు.

సుద: ఏం నవ్వుతావులేరా! శారదా, నిన్నే. ఎవరో కాదులే, మన సత్యమే. (శారద మంచినీటిగ్లాసుతో ప్రవేశిస్తుంది.) సిగ్గంతా పెళ్లినాడే ఖాళీచేశావనుకున్నానే!

శారద: ఆడదానికి పుట్టుకతో వచ్చిన సిగ్గు పుడకలతో గాని పోతుందా ?

సత్య: బాగా చెప్పావు, సమాధానం. (సత్యం మంచి నీరు త్రాగుతూంటాడు. సుదర్శనం ఎందుకోగాని గాభరాపడతాడు. అతణ్ణి చూసి శారద గాబరా నటిస్తుంది.) ఏమిటి మీ రిద్దరూ కంగారు పడుతూన్నట్లుంది.

శార: ఎవరయినా మా యింటికి వచ్చినపుడు, అది మా కానవాయితీయేలెండి. ఇంతకూ అడగడం మరచా, ఎప్పుడొచ్చారు ?

సత్య: ప్రొద్దున్నొచ్చాను. ఎందుచేతనో సుదర్శనం చూపు దారితప్పి నామీద పడింది.

శార : మూపురేనాడో దారి తప్పినయ్. (సుదర్శనం కంగారుపడి శారదవంక చూస్తాడు)

సత్య : చిన్ననాటి స్నేహితులమాయె! పిలిస్తే రాక తప్పుతుందా ? (సుదర్శనం శారదవంక చూస్తూ, భోజనముందా అన్నట్లు సంజ్ఞతో అడిగితే, ఒక్కరికే ఉన్నదన్నట్లు శారద సంజ్ఞ చేస్తుంది.)

శార : మా యింటికి రావడానికి మీకూ బాధగానే ఉందా ?

సత్య : అదేంకాదు. తీరా వచ్చిన తర్వాత, నోరూరుకోదు. సుదర్శనానికి కోపమూ రాక మానదు.

శార : అరెరె! ఎంతమాటన్నారు. మావారికి కోపమా! కోప మనేది ముక్కునే - కాదు, పొరబాటు - లేదు. వారి జీవితనడవడికలో ఉన్న సౌఖ్యాన్ని పొందేభాగ్యం బహుశా నాకే దక్కిందేమో. అయితే, అట్లా చెప్పడం అతిశయోక్తో, అపహాస్యమో తెలీదనుకోండి. (సుదర్శనం ముఖ కవళికలు మారుతూంటయ్. కోపపు ఛాయలు గోచరిస్తయ్).

సత్య : ఏరా మాట్లాడంవేంరా ? ... శారదకు సిగ్గు పోగొట్టలేకపోయినా...

శార : తప్పు, తప్పు. అలా అనడం నేను నేర్చుకున్న నాగరికతనే అవమానించడం. ప్రపంచంలో సిగ్గూ ఎగ్గూ లేని ఆడదానిని నేనేనని వారొక సర్టిఫికేట్ కూడా యిచ్చారు.

సుద : ఇక ఎంతసేపూ నీ గొడవేకాని, సత్యానికి మంచీ మర్యాదా చేయడం లేదేమిటి ?

శార : ఆ గౌరవం, మగవారైన మీకే దక్కితే బావుంటుందని.

సత్య : శారదకు మంచి ట్రైనింగే యిచ్చావు.

సుద : కన్పిస్తూనేవుందిగా (అని అసహ్యభావంతో అంటాడు) లే భోజనానికి.

సత్య : నేను భోజనంచేసే వచ్చాను.

సుద : ఇక్కడ భోజనంచేస్తే తప్పనుకున్నావేమిట్రా.

శార : మనకొక పూట కలిసివచ్చినా, కలిసివచ్చినట్లే అనుకున్నారు కాబోలు.

సత్య . మీ భోజనాలు కానివ్వండి.

శార : ఆకలి యీమధ్య మామీద సత్యాగ్రహం చేసిందిలెండి!

సత్య : పిల్ల లెంతమందిరా ?

సుద : ఇద్దరు.

సత్య : ఇందులో ప్లస్ ఎంత, మైనస్ ఎంత ?

సుద : ఒకటి ప్లస్, ఒకటి మైనస్.

శారద : ఈ భాషేమిటండోయ్.

సత్య : ఇదంతా కట్నాల భాష.

శార : కట్నాలిచ్చే విషయంలో మేం సంస్కర్తలం.

సుద : ప్రొద్దుబోయింది. పడుకుందామా ?

సత్య : ఈరోజు కాస్త టైం స్పేర్ చేయరా.

శార : అదేమీ లేదులెండి. మేల్కోవడం పరిపాటే.

సత్య : ఏమి టలా ఉన్నావు శారదా ?

(సుదర్శనం చెప్పేస్తుందనే భయంతో శారదవంక ఆతృతగా చూస్తాడు. చెప్పేస్తానన్నట్లు శారద బెదిరిస్తుంది.)

సుద : ఆ! ఏమీలేదు. ఆ వేషం శారద కలవాటే.

శార : ఆదర్శజీవితానికి యిరుగు పొరుగుకు నమూనా మేమే. రేపంటే మీకే తెలుస్తుంది.

సుద : (చిరాకుగా) ఇక చాలించండి. పడుకుందాం.

[శారద వెళ్లిపోతుంది. లైట్లు ఆరిపోతవి. వారిద్దరూ, హాల్లో మంచాలమీద పరుంటారు.

తెర అలానే ఉంటుంది. తెల్లవారుఝామున సత్యం వెళ్ళిపోతాడు. వెళ్లేటప్పుడు సుదర్శనాన్ని లేపినా లేవడు. - తరువాత తెల్లవారుతుంది.

నేపథ్యంలో : ఏవమ్మో, శారదమ్మగోరు, శారదమ్మగోరు, పాలడబ్బండి అన్న కేక విన్పిస్తుంది.

శారద వచ్చి, అటువైపు వెళ్ళేందుకు రెండడుగులు వేసి, ఆలోచించి వెనక్కివచ్చి సుదర్శనాన్ని లేపుతుంది.]

శార : మిమ్మల్నే, ఏమండోయ్ - మిమ్మల్నే, పలకరేమిటి ?

[నేపథ్యంలో : ఏవమ్మో పలకరేంటి, అరిసి అరిసి నోరు పడిపోతుంటేను. రోజూ పలకనన్నా పలికేది అమ్మ. ఇయ్యాల్ల లదీ లేదు.]

శార : వస్తున్నా తాతాయి. ... ఏవండోయ్ ? ఎన్ని పిలిచినా, మిమ్మల్ని కాదన్నట్టు పడుకుంటారు.

సుద : ఎవ రది ?

శార : నేనే.

సుద : (కళ్లు తెరవడు. అటూ యిటూ దొర్లుతూ) నేనే అంటే.

శార : అంటే శారదను. లేవండి. అవతల పాలవాడు పిలుస్తున్నాడు.

[ఈసారి తలుపు దబా ,దబా కొట్టినధ్వని వినిపిస్తుంది.]

సుద : నేను నిద్రపోతూంటే చూడలేవా ఏమిటి ?

[నేపథ్యంలో అయ్యగోరు, అయ్యగోరు అన్న కేక విని] ... ఎవ రది ?

శార : ఎవ రుంటారు మీ స్నేహితులు.
సుద : అంటే ?
శార : అంటే అప్పుల స్నేహితులు.
[నేపథ్యంలో : ఏమండోయ్, మిమ్మల్నే.]
సుద : పొమ్మందూ, రేపు రమ్మను.
శార : ఆ ముక్క మీరే చెప్పండి.
[నేపథ్యంలో : ఎందుకమ్మా, మమ్మల్నిట్టా ఏడిపించుకుతింటం. బాకీ ఇవ్వలేమంటే పోతాంగా.]
సుద : వీడెవడో, మహారాజులా మాట్లాడుతున్నాడే-రేపు రావోయ్.
[నేపథ్యంలో : ఇట్టా ఎన్ని రేపులయ్యా. అవతల మాకప్పిచ్చినోరు లగాలేటుండారు].
సుద : సరే. రేపు తప్పక ఇచ్చేస్తాం.
[నేపథ్యంలో : ఈయ నెవరో నాకన్న మొండోడులా గున్నాడు.]
సుద : వీడెవడో, నోరు మా పారేస్తున్నాడే. మంచం మీద లేవకముందే మొదలు! వెధవలకు మంచీ మర్యాదలు తెలిస్తేగా. (లేచి మంచంమీద కూర్చుంటాడు.)
శార : మీకు తెల్లవారలేదని, వాళ్ళకు తెల్లవారదా ఏమిటి. మీకు గడుస్తుందని, అందరకూ గడుస్తుందా.
[నేపథ్యంలో : సుదర్శనంగారూ, సుదర్శనంగారూ అన్న మరో కేక.]
సుద : వీడెవడు ? అబ్బబ్బా ! వీళ్లు ప్రాణాలు కొరికేస్తున్నా(రా బాబూ.
[నేపథ్యంలో : ఇంట్లో ఉండే పలకరేమిటి ?]
సుద : ఆరి భగవంతుడా ! మంచంమీదనుండి లేవక తప్పలేదురా. వీడెవడో కాకిగోల చేస్తున్నాడు. (వెళ్లి సద్దుబాటుచేసి తిరిగి వచ్చి)...ఈ రోజుకు పీడా విరగడైంది. (అంటూ లోనికి వెళ్తాడు.) శారద మంచాలు సద్దుతూంటుంది. ముఖం తుడుచుకుంటూ వస్తాడు.)
శార : సంసారం ఏ తీరుగా ఉందో ఇప్పటికైనా తెలిసిందా ?
సుద : వాళ్ల గోల వదిలించంటే, నీ గోల ప్రారంభమైందీ ! కాఫీ తయారయిందా?
శార : పాలవాళ్లు మనమీద సమ్మె కట్టారు !
సుద : మరీమంచిది. మనకు డబ్బులు మిగిలినయ్.
శార : బయటకు వెళ్తూన్నారు కామాసు. మరి బియ్యం లేవు...అప్పిచ్చేవాళ్లుకూడ కన్పించడంలేదు.

సుద : (చిరాకుగా) నీగోల చచ్చేవరకూ వదలదనుకుంటా !
శార : ఎలావదుల్తుంది ! మీ కిది ఆజన్మాంతర శిక్ష !
సుద : పోనీలే. ఆలస్యమైనా, ఉన్నమాటన్నావు. పెళ్లి చేసుకోవడమే ఒక తప్పు. అందులోనూ, నీ వంటిదాన్ని చేసుకోవడం మహాతప్పు. (అంటూ డ్రెస్సు వేసుకుంటాడు.)
శార : అవును ! అదీ నిజమే ! మీలా, టింగురంగాగా తిరిగే ఆడదయితే బావుండేది. ముసలమ్మలా ఇంట్లో కూర్చునే నాబోటిది మీ కెట్లా నచ్చుతుంది... ముందు, ముందు ఇంకా అబ్బుతుంది వేదాంతం.
సుద : అబ్బుతుంది, అబ్బుతుంది దవడపళ్లూడడిగొతే.
శార : అదొక్కటే తక్కువైంది నా ఐశ్వర్యానికి.
[నేపథ్యంలో ఇరుగుపొరుగువారి మాటలు :- ఒకరు : పోతే ఇంటి ఆసామీయే పోతాడనిగాని, వీడి బ్రతుక్కు యాభైరూపాయిలద్దా ?
మరొకరు : వాడి అదృష్టం. కలిసివచ్చే ఆడదైంది.
ఒకరు : నన్ను సలహా అడిగితే, జెండా పీకెయ్యమంటాను.
మరొకరు : నీవు చెప్పక్కర్లేకుండానే, విసుగుపుట్టి, విసుగుపుట్టి అంతపనీ చేస్తుంది].
సుద : పెద్ద దేశోద్ధారకుల్లా, ఊళ్లో సంసారాల గొడవ వీళ్ళ కెందుకో...వళ్లు పోసుకోలురాయళ్ళు.
శార : నా నోరంటే మూయగలరు గాని, లోకంనోరు మూస్తారా ?
సుద : చాల్లే నోరు ముయ్. బయల్దేరావు ఆరిందావి.
శార : నేనెలా ఆరిందా నవుతాను, బయట వెలగబెట్టాన్న మీరు ఆరిందాలవుతారుగాని.
సుద : ఈ వాగుడంతా వింటూంటే, చుట్టుప్రక్కల వాళ్ళ పొతాలు బాగా అబ్బినట్టున్నయ్.
శార : అవి అబ్బకనేమో, నాకీ అఘోరింపు.
సుద : అఘోరించడానికి, ఏం వచ్చింది రోగం ?... పోనీ బయట గుడ్డవిప్పావు తిరక్కపోయావా ? సరదా తీరేదేమో.
శార : మీరు తిరుగున్నది చాల్లే? జనం చూడలేక చస్తున్నారు.
సుద : ఏం మాటకుమాట జవాబు చెబుతున్నావు. (అని ఫెడేలున లెంపకాయకొట్టి) నోరుమూసుకుని, పెట్టింది తిని పడుండు (అని వెళ్ళిపోతాడు).
[తెర దింపవలసిన పని వుండదు...రాత్రిసమయం... ఏమీ తోచక శారద అటూఇటూ పచార్లుచేస్తుంది.]

శార : తుమ్మితే ఊడే ముక్కులా ఉం దీసంసారం! ముందు చూస్తే నుయ్యి, వెనుక చూస్తే గొయ్యి. - ఆడదాని బ్రతు కెంత ఆసరాలేని బ్రతుకు. (శారద, శారద అన్న కేక విన్పిస్తుంది.) ... అప్పుల వాళ్ళకు చెప్పలేక నా నోరు పడిపోతోంది - చివరకు బ్రతుకు లెంపలు తినేవరకూ వచ్చింది. (అనుకుంటూ వెళ్ళి, శారద, సూర్యం ప్రవేశిస్తారు.)

శార : నే నెవరో అనుకున్నా. ఎప్పు డొచ్చావు సూర్యం?

సూర్యం : పొద్దొన్నొచ్చాను.

శార : మంచినీళ్లు పుచ్చుకొంటావా?

సూర్యం : మంచినీళ్ళ కేం భాగ్యంలే! ఏదో, కాసిని నీచేత్తో యియ్యి.

[శారద మంచినీళ్ళు తీసుకురావడానికి లోపలకు వెళ్ళి మంచినీళ్ళు తెస్తుంది. ఇల్లంతా పచార్లుచేసి చూస్తాడు. శారద మంచినీళ్లు యిస్తుంది.] ... ఎట్టా సంపాయించాడోగాని, మా మంచిల్లే సంపాయించాడు.

శార : దేనికీ లోటు లేదు! ఏదో పుణ్యమా అంటూ రోజులు వెళ్ళిపోతున్నయ్ ... అన్నట్టు, యింటి వద్దఅంతా బావున్నారా?

సూర్యం : ఆ! అంతా బాగుండారు.

శార : మా యింటి వద్దో! అమ్మ, నాన్న, మా పిల్లలూ.

సూర్యం : ఆ, బాగానే ఉండారు. ఆడపిల్లంతా నీ పోలికే. పెద్దెదిగితే మా గడుగ్గాయవుద్ది ... ఒక్కదానికీ ఏం తోస్తోంది? పోనీ ఒక్కర్నయినా ఉంచుకోలేకపోయావా?

శార : ఇక్కడ చేసేవా ళ్లెవరున్నారు? ... ఏదో పెద్ద పనుంటేగాని ఊరు కదలవు! అంత పెద్ద పనే ముందే!

సూర్యం : పెద్ద పనేముంది! మొన్న మా సరిహద్దుచేను నాలుగెకరాలు కొన్నా. అదివ్వాళ రిజిస్ట్రీ. సరే వచ్చేటప్పుడు, నిన్ను చూసిరమ్మని అమ్మా, నాన్నా మరీ మరీ చెబితేను, ఇట్టా వచ్చాను.

శార : అమ్మా, నాన్న చెప్పకపోతేమాత్రం రాకూడదా ఏం?

సూర్యం : అదేం కాదనుకో. అయినవాళ్ల మయిం తర్వాత రాకుండా ఎట్టా తప్పుద్దీ. ఎన్నిసార్లు విన్నా మరిసిపోతా. ఏమిటి మనవాడు చేసేపని?

శార : ఏదో చిన్న బ్యాంకిలో.

సూర్యం : ఏదో పెద్ద పనే అయివుంటుంది. లేకుంటే ఇంతిల్లు ఎట్టా సంపాయిస్తాడు?

శార : సూర్యం, నీవూ నేర్చుకున్నావు.

సూర్యం : నే నేం నేర్చుకున్నా!

శార : ఇంకోరిని వెక్కిరించడం.

సూర్యం : ఛా, నా కొకల్ల సంగతే పట్టదు... సరేగాని, ఏంటీ మరీ అట్టా ఉండావు?

శార : నాకేం మహారాణిలా ఉన్నాను-ప్రకృతివైద్యం చేస్తున్నాలే.

సూర్యం : ఆ వైద్యానికి ఏదో లంక కెల్తారేమో?

శార : చాతనైతే, ఇక్కడే చేసుకోవచ్చు.

సూర్యం : ఓయబ్బో, నీ వెంత తెలివైనదానివైనా, దాని సిగదగర ఆమాత్రం నాకూ తెల్సు. అందుకే కామాసు, ఊళ్లో తెగగుంపుసింపులుగా అనుకుంటున్నారు. మనోడి జీతమెంత?

శార : ఎంతలే! ఒక వంద...ఏమని గుంపుచింపులు పడుతున్నారు?

సూర్యం : అవన్నీ పోనిద్దూ. బాగా ఉంటే సూడలేక ఏడుస్తారు, సితికిపోతే చూసి నవ్వుతారు.

శార : నాబోటి ఆడదానికి లోకం పోకడ లేం తెలుస్తాయి? ... ఏమనుకుంటున్నారేం?

సూర్య : ఆల్లా, లేనిదేమీ అనుకోవడం లేదనుకో. పలానావారి అల్లుడు ఎగురనిగిపోయింవనీ, తాహతుకు మించిన స్నేహితులతో చెడుతిరుగుడు తిరుగుతున్నాడనీ, ఇంకేమేమో అనుకుంటూంటారు. ... పోనిద్దూ. మరి పొద్దోయింది. ఎల్తొస్తా (అంటూ రెండడుగులు వేస్తాడు).

శార : ఇపుడు వెళ్ళడమేమిటి? ఇవాళ ఉండు సూర్యం.

సూర్యం : ఉంటే నా కెట్టా జరుగుద్ది? ఇంటికాడ పెద్ద కామాటముండె (అంటూ మరి రెండడుగులు వేసి, వెనక్కు తిరిగి) ... నా మతి మండిపోను, కుర్రతనంలోనే ఇంత మతిమరుపైతే ఎట్టాగో! ఇంతకూ అసలు సంగతే మరిసిపోయా.

శార : (కంగారుగా) - ఏమిటది?

సూర్యం : (కూర్చుంటూ) ఏమీ లేదులే. కంగారడకు. నీ కింటికి రావాలనుందేమో మీ నాన్నడగమన్నాడు.

శార : రావాలనే ఉంది...కాని (సుదర్శనం ఇంటిలోనికి వస్తూ, ఇది విని ఆగిపోతాడు)

సూర్యం: కానీ లేదు, గీనీ లేదు. నువ్వు లేకపోతే కొంపేదో మునిగిపోయేట్టు! (శారద ఏమీ మాట్లాడదు.) - ఏం మాట్లాడవేం?

శార: అలాగేలే. ఎప్పుడు వెళ్దాం. ?

సూర్య: నీ వెప్పుడంటే అప్పుడే.

శార: సరే, రేపు వెళదాం. (సుదర్శనం, కొంచెం తూలుతూ వచ్చి కూర్చుంటాడు)

సుద: (కోపాన్ని తమాయించుకుని, వ్యంగ్యంగా) ఎవరది శారదా?

శార: కన్పించడంలేదా?

సుద: కన్పిస్తే నిన్నడగడం దేనికి?

శార: ఎదురుగా ఉన్న మనిషి కన్పించడంలేదని నేనెలా అనుకోను.

సుద: అంతవరకూ వచ్చిందన్నమాట వ్యవహారం?

శార: ఏముంది అంతవరకూ రావడానికి.

సుద: (శారద దగ్గరకువస్తూ) వళ్ళు దగ్గరుంచుకొనే మాట్లాడుతున్నావా?

శార: ఇంకా కళ్ళు అంత నెత్తిమీదకు రాలేదు.

సూర్యం: అదేమిటయ్యా సుదర్శనం? ఊరికినే కొట్ట బోతా వెందుకు?

సుద: నీ వెవడవోయ్, పానకంలో పుడకలా...... కొడితే, నీ వేమన్నా చేస్తావా?

శార: నీ కెందుకులే సూర్యం. మా అన్యోన్యత చూసి, కొంపతీసి నీవూ నేర్చుకు నేవు!

సుద: ఎవడవురా నీవు, ఫో నా యింట్లోనుండి ఫో (అని సూర్యంని గెంటివేస్తాడు.)

శార: మంచీ, చెడ్డా లేకుండా, యీ రోజున రభస ఏమిటి?

సుద: రభసకు కారణం, నీవు, నీవు. నీ కీరోజున చావు మూడే యీ పని తలపెట్టావు.

శార: నేనూ చావుకోసమే ఎదురుచూస్తున్నా.

సుద: సిగ్గూ, ఎగ్గూ వదిలివేసిన ఆడదానికి చావంటే మాత్రం భయం ఎలా ఉంటుంది?

శార: ప్రపంచంలో సిగ్గూ, అభిమానాలంటూ ఉంటే నాకే ఉన్నయ్. (అనేటప్పటికి సుదర్శనం లెంప కాయ కొడతాడు.) ... ఇంతేనా! మీ ఘనత!

సుద: (జేబులోనుండి డబ్బుతీసి, శారద ముఖాన కొట్టి) ఇదిగో, వెధవ డబ్బు, కాకితో కబురుచేస్తే వస్తుంది. (అంటూ కుర్చీలో కూర్చుంటాడు.)

శార: ఈ పౌరుషం, చేసుకున్న భార్యకు, కన్నపిల్లలకు తిండిపెట్టే విషయంపై చూపితే సంతోషించేదాన్ని ... అప్పులు తీరిస్తే సంతోషించేదాన్ని... అందని అందలా లెక్కాలని ప్రయత్నించకుండా ఉంటే సంతోషించేదాన్ని ... ఏం చేసినా ఆడది సహిస్తుందనేగా మీ యిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు.

సూర్యం: (కోపంగా) ఆపు! ఇక ఆపు.

సుద: చెప్పమంటూనా?...పాపం! ఎంత అమాయకు రాలవు!...ఎంత నంగనాచివి!...ఇంకా నా కళ్లు కప్పాలనుకుంటున్నావా? (అంటూ శారద కంఠాన్ని పుచ్చుకోబోతాడు)

శార. దూరంగా ఉండండి! నన్నుముట్టుకు నేందుకు మీకు తాహతు లేదు...ఏమిటీ మీ మాటలు?... అంత మహానేరం నేనేమీ చేయలేదు...ఇంట్లో ఆడదీ, పిల్లలూ ఎట్లా బ్రతుకుతున్నారో ఏనాడైనా ఆలోచించారా? ఇంట్లో ఈగల మోతను దాచిపెట్టడంవల్లనేగా, నా కీ దుర్గతి?

సుద: నీవేలాపన కట్టిపెట్టు. (అని శారద కంఠాన్ని పుచ్చుకుంటాడు.)

శార: వదలండి... (అని విదిలించుకు నేందుకు ప్రయత్నిస్తుంది)...మీకు గౌరవమిచ్చేదశదాటిపోయింది. ...వదలండి నేను చేసిన తప్పే...

సత్యం: (ఇంతలో సత్యం ప్రవేశించి, చూచి, నిర్ఘాంత పోయి)...సుదర్శనం(అని పిచ్చిగా రెండు, మూడు సార్లు కేకవేస్తాడు. సుదర్శనం సత్యాన్ని చూచి తెల్లబోతాడు. నెమ్మదిగా, కంఠంమీద చేతుల బిగువు సళ్లుకుంటుంది.) ...ఏమిట్రా, నీ కేమైనా మతి ఉందా?

సుద: మతి ఉండబట్టే.

సత్య: ఛీ! నోరు ముయ్యి. త్రాగుడు మైకం ఇంత వరకూ దారిచూపిందన్నమాట.

సుద: (శారదవంక చూసి) అదృష్టవంతురాలివి ... అడుగు బ్రదర్. నీ ఆదర్శమూర్తిని; ఏం చేసిందో.

శార: మీరే చెప్పండి. నేను చేసిన ఆ మహా పాప మేమిటో.

సుద: వెధవ, చేతకాని వెధవ. పారిపోయాడు.

సత్య: ఎవరు?

సుద: నీ ఆదర్శమూర్తి రంకు మగడు.

శార: అదా అసలు సంగతి! మహా పెద్ద నేరాన్ని పట్టుకున్నారు.

సత్య: ఎవరు శారదా?

శార : మా చిన్నమ్మమ్మ కొడుకు సూర్యం. నన్ను మా పుట్టింటికి రమ్మన్నారని చెప్పేందుకు వచ్చాడు. (సుదర్శనం కొంచెం ఆశ్చర్యపడతాడు)

సత్య : ఏం ! సుదర్శనం ! అన్ని పాడుబుద్ధులతో బాటు, శారదను చంపాలనే పాడుబుద్ధికూడ అబ్బిందన్నమాట ! ... మానవుడు బురదగుంటలో పడితే లేవడమంటూ......ఇంత నీచానికి తయారయ్యావని తెలిస్తే, నిన్ను గురించి పట్టించుకునేవాణ్ణే కాదు.

సుద : ఏం ఫర్వాలేదురా, బ్రదర్ ! ఇప్పుడైనా సమయం మించిపోలేదు.

సత్య : ఛీ ! పశువా. నీ గౌరవం కాపాడేందుకు, పస్తులతో ఉన్నా, వంటిమీద గుడ్డ లేకపోయినా, నావంటి ఆప్తునివద్దకూడ సంసారపుగుట్టు దాచింది, తెలివి తక్కువది శారద ! ఏం ? నీ కేమయినా పరువంటూ ఏడిస్తే, అది శారదవల్లగాని, నీ సూట్ల వలన, నీ స్నేహాలవలన, విలాస జీవితం వలన, క్లబ్బు జీవితం వలనా కాదని ఇప్పుడైనా తెల్సుకో. నిన్ను గురించి బాధపడేది ఎవరు ? ఒక్క శారదే. అట్టి శారద బ్రతుకునుగురించి నీవేమైనా పట్టించు కున్నావా ? నీ విలాస జీవితానికి తగలేసినదానిలో పదోవంతైనా శారద కిచ్చావా ? పై పెచ్చు, శారదను చంపడానికి తయారయ్యావు ?...

సుద : ఇక చాలు నీ మహోపన్యాసం.

సత్య : చాలించడానికి రాలేదు. నీ నీచత్వాన్ని బట్ట బయలు చేసి, మూసుకు పోయిన కండ్లను తెరిపిద్దా మని వచ్చాను...(డబ్బునుతీస్తూ) ఈ డబెక్కడిది? (సుదర్శనం కంగారు పడతాడు. మాట్లాడడు.) మాట్లాడవేం?...స్థితికిమించిన పనులు చేస్తే పాడు బుద్ధులు పుట్టక ఏమవుతాయి ? ... ఎంత పతన మయ్యావురా బ్రదర్...నీ కీ ప్రపంచాన్ని మూసే శాతే లేదేమో ?

సుద : అంత ఖర్మ నాకేం రాలేదు...బహుశా నీవు రాకపోతే వచ్చేదేమో.

(ఇంతలో సుదర్శనంగారు, సుదర్శనంగారన్న కేకలు విన్పిస్తవి. సూర్యం ప్రవేశం.)

సత్య : ఈ డబ్బు ఎక్కడిది ?...ఇప్పటికీ చెప్పవన్న మాట......

(మళ్ళీ పై కేకలు వినిపిస్తవి.) ఎవరది ?

సూర్యం : పోలీసులు !

సుద : అసలు చేసినదంటూ ఉంటేగా చెప్పేందుకు ?

శార : ఇంకా ఏం అఘాయిత్యం చేశారండి ? కొంప మీద కేం తెచ్చిపెట్టారు ?

సత్య : నీబోటి భ్రష్టులకు ఏబాధా ఉండదు...ఇప్ప టికీ చెప్పవా ?.........పత్తిత్తులా సరిపోతుందను కున్నావా ? ఈ డబ్బు ఎక్కడిది ?

సుద : నా కష్టార్జితం.

సత్య : కష్టార్జితమట కష్టార్జితం. చెప్పేందుకు సిగ్గు ఎట్లాలేదు ? నా కళ్లు మూయగలవు గాని, లోకం కళ్లు మూయగలవా ?

శార : ఏంచేశా రన్నయ్యా ?

సుద : (బాధగా) దాచక చెబితే మాత్రం, ఎవరు చేసేదేముంది ?...జరుగవలసిందేదో ఇదివరకే జరిగి పోయింది...ఎందుకు శారదా, అనవసరంగా యీ నీచుడికోసం బాధపడ్తావు ? ఈనాటితో నీకు శని విరగడైంది.

సత్య : నిజంగా నే.

శార : అట్లా అనకు అన్నయ్యా !

సుద : (ఎక్కువగా బాధపడ్తూ) నేను వెళ్తున్నా. మీ అందరకూ శెలవు. మీ ముఖాలు చూచే అర్హత నాకు లేదు ... ముఖ్యంగా, శారదా, నీ ముఖం చూచేఅర్హత నాకులేదు. నీ హృదయంలో నాకిచ్చిన స్థానాన్ని నిల్పుకోలేని భ్రష్టుణ్ణి. అంత కన్నా చెప్పగలిగిం దేమీ లేదు ... అరే బ్రదర్, నీవు మాయందు చూపిన ఆదరాభిమానములకు నా నమస్కృతులు...నెత్తిమీద కళ్లుంచుకుని ప్రవర్తిం చాను ... శిక్ష అనుభవిస్తాను.

శార : ఏమి టిదంతా. నాకంతా అయోమయంగా ఉంది ... నీవైనా చెప్పు అన్నయ్యా.

సత్యం : ఇంకెందుకూ దాపరికం ?

సుద : ఈ ప్రపంచంలో నాకు స్థానం లేదు ... నాకు బ్రతికేచోటూ కన్పించదు ... జీవితపు లోతుపాతు లను తెలిసికొనలేని అవివేకిని. నీవు క్షమించానంటే సంతోషంతో వెళ్ళిపోతా. శారదా నీవు నన్ను క్ష......

శార : ఏమిటండీ యీ పిచ్చిమాటలు ... ఏం చేశారో చెప్పండి ! చేతనైతే, అన్నయ్య మనకు సహాయం చేస్తాడు.

సత్యం : చేసిన తప్పును తెలుసుకుని, తిరిగి చేయకుండా ఉంటే, లోకం స్వీకరిస్తుంది, ఆదరిస్తుంది. లోకం ఎంత కర్కశంగా ఉంటుందో, అంత ఔదార్యం తోనూ ఉంటుంది.

సుద : మరి శెలవు ... నే చేసిన నేరము, నేరము చెప్ప ... (అని ముఖం దాచుకుంటాడు.)

(శారద దుఃఖిస్తూంటుంది.)

సత్య : దుఃఖించకు శారదా ... నీకు శ్రీ కృష్ణ జన్మ స్థానానికి వెళ్ళే అదృష్టమును చెరిపివేసిన ఈ స్నేహితుణ్ణి నిందించరా బ్రదర్ !

(శారద, సుదర్శనంలు ఆశ్చర్యపోతారు. శారద ఆనందబాష్పములతో ముఖం వికసిస్తుంది.)

శార : (శారద మాటాడాలని ప్రయత్నిస్తుంది. సంతోషంలో మాట పెగలదు.)

సత్య : శారదా, నీ భర్తను నీకు వప్పజెప్పగలిగాను. ...మన ప్రబుద్ధుడు బ్యాంకులో అపహరించిన సొమ్మును కట్టివేశాను. ...... కాని

సుద : (పట్టరాని సంతోషంతో) సత్యం ! (అని కౌగలించుకుంటాడు.)

శార : కాని ఏమిటన్నయ్యా ?

సత్య : కాని మన సుదర్శనం ఉద్యోగం నిలబెట్ట లేక పోయాను.

శార : పోతేపోయిందిలే. బ్రతికి ఉంటే బలుసాకు తింటాం. అన్నయ్యా, నీ పేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటాం. ... అన్నయ్యా... నాకు మాటలు రావడంలేదు.

సూర్యం : వెళ్ళవయ్యా పోలీసు. ఏదో జరిగిపోతుందని పోలీసును తీసుకువచ్చా !



"పలుకగవలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
నళుకక యటుగాకున్నం
బలుకగ యుండుటయె మేలు, బహుమానముగన్.

"చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు, గుంకుమ పైపై
గుప్పినక్రియ, విరిపొట్లము
విప్పినగతి, ఘుమ్మనన్ కవిత్వము సభలన్.

"చెవులకుఁ జవులై, చల్లఁగఁ,
గవులకుఁ దవులై, సమస్త కావ్యకళా బం
ధువులై రససింధువులై
యవురా ! యన గవిత లవని నలరఁగ వలదా !"

—రఘునాథరాయలు

# స్వీయచరిత్ర

శ్రీ అనిసెట్టి సుబ్బారావు

ఇది నా స్వీయచరిత్ర
ఇది ప్రతి వ్యక్తి చరిత్ర
ఈ నిర్జీవపు ఎడారి ఉదయమునై ఎదిగి
ఈ నెత్తురు ఏరులోన ముత్యమునై వెలిగి
ఈ నరాల కారడవిని జ్వాలగ చెలరేగి

జడతను ఛేదించి, నిండు
జవము నుచ్ఛ్వసించి, మహా
జగతి నిశ్వసించి
చలించాను, జనించాను, బ్రతుకారంభించాను
జగతి రాత్రి మూసిన పేటిక
జగతి పగలు విచిత్ర వాటిక
మరుపు తెరల శైశవ డోలనుంచి
విచిత్ర వస్తునిలయాన్ని, విశ్వాన్ని
వింతగా చూశాను, విస్తుపోయాను
ఆవేశించింది యౌవనం

పలురంగుల భ్రాంతి వసనాలు ధరించి
ప్రపంచాన్ని మోహించ చూశాను
ప్రచండావేశాల ఊయలపై
ప్రతిక్షణం స్వారి చేశాను
విశ్వాన్ని వెక్కిరించాను
వెర్రి గర్వంతో విర్రవీగాను
విపరీతమీ యౌవనం
వేకువ రాకముందే వెళిపోయింది
నిద్ర మేలుకున్నాను, నిజం తెలుసుకున్నాను
నన్ను నేనే వేడుకున్నాను
నాకు నేనే అభయమిచ్చుకున్నాను

లోకపు కీకారణ్యంలో
శోకపు జలపాతాలు దాటి
ఈర్ష్యా ద్వేషాల లోయలు గడిచి
వ్యసనాల విషసర్పాలు వధించి
నడుస్తున్నాను.
కష్టాల కౌగిలిలో క్రిక్కిరిసిపోతూ
సుఖాన్ని ఊహలో చుంబిస్తున్నాను
అగ్ని గుండంలాంటి కాలంలో నడుస్తూ
అమృత కాసారాలు కలగంటున్నాను
అనుభవాల నాస్వాదిస్తున్నాను.
ఆలోచనలతో ఆలోకిస్తున్నాను
మానవాళి కాంక్షించి సలిపే ఘోరరణం
మహోన్నత సత్య శిఖరారోహణం
ఈ సాధన నాశించి ప్రతిక్షణం
జీవిస్తుంది గర్వంగా ప్రతికణం
ఆశిస్తున్నాను.

కంటికి కన్పించని సత్యం మనస్సులో
గోచరిస్తుందని
మనస్సుకు స్ఫురించనిది స్వప్నంలో
సాక్షాత్కరిస్తుందని
స్వప్నాల కందని సత్యం మానవాంతరాత్మలో
మౌన సంగీతం ఆలపిస్తుందని

ఆలకిస్తున్నాను
అర్థం చేసుకుంటున్నాను
జర రుజ నిద్రలు జాగృతికి శత్రువులు
శైశవ వార్ధక్యాలు స్మృతి విస్మృతుల
ద్వారాలు

మనస్సుకు వయస్సు లేదు
తనువు ధాత్రిలో లీనమైనా
తపస్సుకు అంతరాయం రారాదు
అనుకుంటున్నాను.
విగ్రహంలా వెయ్యేళ్ళు బ్రతకడం కంటె
విద్యుత్తులా ఒక్కక్షణం వెలగడం మేలు.
మానవత్వ సూత్రాలు మననం
చెయ్యడంకంటె
మందహాసంలో మంచితనం పంచిపెడితే
చాలు.
ఆచరిస్తున్నాను.
నాలోని మృత్యువును బంధించి
మారణాయుధంలో చేర్చాను
నాలోని ప్రాణశక్తి విజృంభించి
ప్రచండ జీవనోద్వేగంగా మార్చాను
సంహరించాను
పురాణాల రాక్షసుల్ని
భూమిమీది క్రిముల్ని
బుద్ధిలో ముసిరే
దురాలోచనల్ని
నిదురించే శూన్య మహాసముద్రాలను
కదిలించే నావను నేనౌతాను
వీడని కలకాల వేదనకు విశ్వం విడిచే
కన్నీటి బొట్టు నే నౌతాను
జీవన మహా యాత్రాపథంలో
బెదిరిన గుండె బిగబట్టుకున్నాను
స్వర్గం నరకం చవిజూస్తున్నాను
సర్వం సాధనకై ధారపోస్తున్నాను
తప్పొప్పుల పట్టికలా తయారైన బ్రతుకును
ధర్మానుగుణంగా సరిదిద్దుకుంటాను
నడుస్తున్నాను
నడిదారిలో వాహనం ఈ దేహం కూలినా
కడవరకూ ప్రయాణం సాగిస్తాను
ప్రభంజనంలా పయనించే జనం నలుగడ
ప్రతిక్షణం ప్రతికణంలోను మనుగడ
ఇది నా స్వీయ చరిత్ర
ఇది ప్రతి ఆత్మ చరిత్ర.

---

"భావి సంగరముష్టిఁ బట్టుపడనీక
జగతిఁ గాపాడ సకల దేశముం
కవి మహాశయు లొక్కకట్టు గావలయు
ఇదియె నాస్వప్నంబు; ఇదియె నాయాశ.
కలయు నిక్కంబగు కాలంబు రాదె?"

— కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

# రసికుడు

## శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

మునసబు బావమరిది పెళ్ళికి రాజరత్నాన్ని పిలిపించారు. "వీరయ్య పెళ్ళికి గొప్పభోగంమేళం పెడుతున్నారుట" అని ఊరంతా పాక్కింది. నిలకడమీద అది భోగంమేళం కాదని తెలిసింది. రాజరత్నం భోగందే గాని, ఆ మనిషి గజ్జెకట్టి మేజువాణీలు చేయదనీ, అధ్యాత్మ రామాయణ కీర్తనలు అభినయిస్తూ పాడుతూందనీ తేలింది.

ఈ సంగతి వినగానే బ్రాహ్మణవీధి వాళ్ళకు చాలా కోపాలొచ్చినై. రావూ మరీ? వాళ్ళంతా డొక్కశుద్ధి గలవాళ్లు. "ఏం, బావా? అధ్యాత్మరామాయణం చెప్పించాలంటే ఆ వెల్లటూరాయన్ను పిలిస్తే పొయ్యేదిగా?" అన్నారు ఒకరిద్దరు మునసబుతో.

"అప్పుడు సానిమేళం పెట్టలేదేమని మీరే ఎత్తిపొడుస్తారుగా?" అన్నాడు మునసబు.

"అది సరేగాని, భోగంది అధ్యాత్మరామాయణం పాడటమేమిట్రా?" అని బ్రహ్మచార్లు ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.

"అది వస్తుంది, ఏదో పాడుతుంది, పోతుంది మధ్య మనకెందుకు?" అని ఒక బ్రహ్మచారి అన్నాడు.

ఆ మాట ఖరారే. ఎందుచేతనంటే ఈ రాజరత్నం అధ్యాత్మరామాయణం పాటలు ఖూనీచేస్తుంటే చూడటానికి బ్రాహ్మణ్యం వెళ్ళకూడదని ఊరంతా ప్రచారమైపోయింది.

మంచినీళ్ళ బావిదగ్గిరకూడా ఈ విషయం వచ్చింది.

"ఏజన్మానో పుణ్యంచేసుకు పుట్టింది. ఈ జన్మలో అధ్యాత్మరామాయణం అబ్బింది!" అన్న దొకావిడ.

"నీ దంతా చోద్యం! ఆ మనిషివస్తే వెళ్ళేవాళ్లంతా అధ్యాత్మం వినబోతా రనుకున్నావా ఏం? మనిషిని చూడబోతారు." అన్న దింకొకావిడ.

"మనిషి కూడా అందంగా వుంటుందట, పిన్నీ!" అన్న దొక కొత్తగా కాపరానికి వచ్చిన పిల్ల.

"ఎందుకు బాగుండదు, తల్లీ? వాళ్ళకు గంధర్వాంశ!" అన్న దొక నడివయస్సావిడ.

"మన బజార్లో ఎవరూ వెళ్ళరుట!"

"ఎవరు వెళ్ళినా, వెళ్ళకపోయినా సూరయ్యకు తప్పదుగా!

కొత్తగా కాపరానికి వచ్చిన పిల్ల కిలకిల్లాడబోయి, అత్తగారు బావికేసి వస్తూండటం చూసి బిందె ఎత్తుకున్నది. ఆమె బావిదాటి రోడ్డెక్కబోతూ ముందుగా మాలమాదిగ లున్నారేమో అని చూసి, తరవాత చెట్టుకింద గాని, వీధిమొదల గాని సూరయ్య వున్నాడేమో అని చూసింది. ఎందుకంటే సాధారణంగా ఉంటాడు, సూరయ్య తనకేసి చూడనవసరంలేదు. తనకు కనిపిస్తే చాలు ఒళ్ళంతా జల్లుమన్నట్టయ్యేది. ఆ క్షణానికి అది అసహ్యంగా తోచినా తరవాత ఏదో బాగున్నట్టే వుండేది.

సూరయ్య సంగతి ఊళ్లో అందరికీ తెలుసు. ఆయన నలభై చాయలవాడు. బ్రాహ్మణీకం ఏనాడో వంటగలిపాడు. క్రాపింగు పెట్టాడు, బెంగాలీ ధోవతులు వాలుగోచీపెట్టి కట్టేవాడు, స్లిపర్లు తొడిగేవాడు. కోటు వేసుకునేవాడు, సిగరెట్టు కాల్చేవాడు. నెలకు ఇరవైరోజులు బస్తీలవెంట తిరిగేవాడు, ఏడాదికి అధమం ఒకసారైనా పట్నం వెళ్లి వచ్చేవాడు. చిన్నతనంలో తండ్రికి ఎదురు తిరిగి సంస్కృతం మానేసి ఇంగ్లీషు చదువుకు వెళ్ళాడు. కాలేజీలో రెండో ఏడు చదువుతుండగా పెళ్ళాం కాపరానికి వచ్చింది. వెంటనే చదువు మానాడు. మరుసటి ఏడే కూతురు పుట్టింది. తరవాత పిల్లలు లేరు. ఆ కూతు రిప్పుడు పిల్లల తల్లి కూడా అయింది. రెండేళ్ళక్రితం భార్యా పోయింది. మళ్ళీ పెళ్ళాడ మన్నారు. కాని, సూరయ్య పెళ్ళాడలేదు. వెధవ అప్పగారు కాచిపోస్తుంది – గ్రామంలో సూరయ్య ఉన్నప్పుడు.

సూరయ్యది పెద్ద ఆస్తి. డబ్బు మంచినీళ్ళలాగా ఖర్చుచేసి సగంఆస్తి తగలేశాడు. ఆయనకు గ్రామంతో బహు కొద్దిపాటి సంబంధం. అందుచేత గ్రామస్థులు ఆయనను సాధించలేక పోయారు.

రెండేళ్ళక్రితం గాంధీ మహాత్ముడి సహాయ నిరాకరణోద్యమం ఈ గ్రామానికి కూడా వచ్చింది. ఈ ఉద్యమంలో ఆసక్తి పుట్టిన కొద్దిమంది యువకులు

ఇక్కడ కూడా బయలుదేరారు. సూరయ్య వారితోనూ కలిసినవాడు కాలేదు.

ఒక్క విషయం మాత్రం అందరూ ఆమోదించారు. అదేమిటంటే, సూరయ్య రసికుడు. దేశంలో పేరుపడ్డ నాటకాలన్నీ చూశాడు. ఏనాడో బొంబాయి వెళ్ళి బాలీవాలా థియేటర్ వాళ్ళ నాటకాలు చూశాడు. పాటకచ్చేరీలకు హాజరయేవాడు. "ఏం, సూరయ్యా? ఎప్పుడూ ఇంటిపట్టున ఉండవేం?" అని ఎవరన్నా అడిగితే, "ఈ గ్రామంలో ఏముంది? ఒక నాటకమా, ఒక పాటకచేరీయా?" అనేవాడు. తమకులేని ఆనందం అనేకవిధాలుగా సూరయ్య పొందుతున్నాడని ఊళ్ళో అందరికీ తెలుసు. "అటువంటి ఆనందం లేకపోతేనేం గనక?" అని కొందరు అనుకున్నా, మరికొందరు సూరయ్యను చూసి అసూయపడేవారు.

## 2

రాజరత్నం వచ్చిందన్నారు. ఆలయం అవతల సత్రంలో దిగిందన్నారు. సూరయ్య వెళ్లి రాజరత్నాన్ని చూసి పలకరించి వచ్చాడన్నారు. బ్రహ్మచార్లకు వెన్నుపూసలు జలదరించాయి. కాని తీరా విచారిస్తే రాజరత్నం పెద్ద అందగత్తె కాదనీ, ఆటే చిన్నదికూడా కాదనీ తెలిసింది. "తెల్ల తోలు! అంతకన్నా విశేషం ఏమీ లేదు. బక్కపలచని మనిషి!" అన్నారు చూచినవాళ్లు.

"మరీ అందగత్తె అయితే చూడటం తప్పేమోగాని, సామాన్యం మనిషైతే మనం చూడవచ్చునే!" అన్నాడొక బ్రహ్మచారి – అది వ్యంగ్యమో, అమాయికత్వమో తెలియరాకుండా.

ఏమైనా ఆ సాయంకాలం గుడి మంటపంలో కుర్రకారువాళ్లు చాలామంది చేరారు. వాళ్ళ చూపులు సత్రం వేపే ఉన్నై. ఇదంతా వృధా శ్రమ. ఎందుకంటే దీపాలు పెట్టేవేళ రాజరత్నం ఆలయానికి వచ్చింది. వెంట ఒక ముసలాడున్నాడు. ముసలాడికి ముందుపళ్ళు లేవు.

ఈసారి బ్రహ్మచార్లు రాజరత్నాన్ని బాగానే చూశారు. పాతికేళ్ళ మనిషి. చూడటానికి ఇంచుమించు సంసార స్త్రీలాగే ఉంది.

"భోగందని తెలుస్తూనే ఉంది. ఎంత దాచినా, దాం దుంపతెగా, అది దాగి చావదు!" అన్నాడొక బ్రహ్మచారి. మిగిలినవాళ్లు అవునని ఒప్పుకున్నారు.



కాని భోగం మనిషి లక్షణాలు ఆ మనిషిలో ఎక్కడ ఉన్నదీ ఎవరికీ స్పష్టంగా తెలీలేదు.

మెరకవీధివాళ్లుకూడా రాజరత్నాన్ని చూసి పెదవులు విరిచారు. "ఏభ్భే! నిరుడు వెంకమ్మగారి రోసెయ్య పెళ్లికి వచ్చిన భోగంవాళ్లముందు ఇది బలాదూర్!" అన్నారొకరు. అంతో ఇంతో ఖర్చు చేయటానికి సిద్ధపడినవాళ్లకు ఆశాభంగం అయినట్టయింది. కొంతమందిమటుకు ఏ నిర్ణయానికీ రాదలచలేదు.

మర్నాడే రాజరత్నం అధ్యాత్మం. మునసబూ, సూరయ్యా, ముందుపళ్లులేని ముసలాడూ కలిసి పెద్ద చర్చచేసి నాలుగురోజుల్లో ఏమేం పాడాలో నిర్ణయించటానికి ప్రయత్నించారు. "అమ్మాయి రెండు నెల్లు చెప్పమన్నా చెబుతుంది" అన్నాడు ముసలాడు.

"తన యిష్టం వచ్చినవి, తనకు వచ్చినవి, పాడమను" అన్నాడు సూరయ్య. ఇది మంచి నిర్ణయమేనని మొదటి రోజే రుజువైపోయింది. ఎందుకంటె రాజరత్నం అచ్చగా అధ్యాత్మ రామాయణం పాటలే గాక సందర్భానుసారంగా తరంగాలూ, అష్టపదులూ, కృతులూ, కృష్ణ కర్ణామృతంలో శ్లోకాలూ, భాగవతంలో పద్యాలూ, పారిజాతాపహరణంలో పద్యాలూ ఆఖరుకు వరూధినీ ప్రవరాఖ్యుల ఘట్టంలో పద్యాలూకూడా పాడింది.

రాజరత్నం సరుకున్న మనిషి అనటానికి ఏమీ సందేహంలేదు. "అసలా మనిషికి అధ్యాత్మం నోటపట్టినప్పటిమాటగద!" అన్నవాళ్లు చాలా పొరపాటు పడ్డారు. ఆ సంగతి తెలుసుకోవటానికైనా వాళ్లు వచ్చి వినలేదు. రుజువుకాని అబద్ధాలు నిజంకన్న బలమైనవి.

రాజరత్నం సరుకు ఏపాటి ఉన్నదో తెలుసుకోగలవాళ్లెవరూ అధ్యాత్మం వినటానికి రానేలేదు. వచ్చినవాళ్లు బొత్తిగా పామరులు. రాజరత్నానికి గల ప్రతిభ కొంచెమే అనుకున్నా, అది బూడిదపోసిన పన్నీరయింది.

పన్నీరంతా బూడిదలోనే పడిందనటం భావ్యం కాదు; కొంత సూరయ్యమీదకూడా పడింది. కాని అందువల్ల సూరయ్యకు కలిగినది ఆనందమని చెప్పటానికి లేదు. ఆయన బాధపడ్డాడు.

నాలుగో రోజు మునసబుగారు సూరయ్య ఎదటే రాజరత్నానికి ఇవ్వటానికి మాట్లాడుకున్నది కాస్తా తాంబూలంలో పెట్టి ఇచ్చేశాడు. ముసలాడూ,

మృదంగం వాయించినవాడూ, రాజరత్నం సత్రానికి తిరిగి వచ్చినప్పుడు సూరయ్యకూడా వెంట వచ్చాడు.

ఏదో ముగిసినట్టూ, దేనికో స్వస్తి చెప్పినట్టూ, ఎవరినో దహనంచేసి వచ్చినట్టూ సూరయ్యకు భావన కలిగింది. చిత్ర మేమిటంటే, ఈ ముగింపు తన జీవితంలో కాక రాజరత్నం జీవితంలో నన్నట్టు సూరయ్యకు తోచింది. ఇకముందు రాజరత్నానికి కష్టాలే తప్ప సుఖ మనేది ఉండదని సూరయ్య గుండె ఆరాట పడు తున్నట్టు కనిపించింది. ఆ భావం ఆయన నోటివెంట విచిత్రమైన ప్రశ్నగా బయటికి వచ్చింది:

"ఇక ఏమిటి ?" అన్నాడాయన రాజరత్నంతో.

ఆమెకు ఆ ప్రశ్నయొక్క అంతరార్థం అర్థమయి నట్టులేదు. అవిడ నవ్వుతూ, "మేం వచ్చిన పని అయి పోయింది. సెలవిప్పించండి. మీరు చాలా సహాయం చేశారు. మీ ఋణం తీరదు" అన్న దామె నమ స్కారం చేస్తూ.

మగవాళ్లు తమ వస్తువులకోసం విసుక్కుంటూ వెతుక్కుంటున్నారు.

"నేను అట్లా అవతలికి వెళ్ళగానే యీ రాజరత్నం కూడా విసుక్కుంటూ తన వస్తువులకోసం వెతు క్కుంటుంది. వాళ్ళమీదా వీళ్ళమీదా ఎగురుతుంది. అధ్యాత్మం లేదు! విద్వత్తూ లేదు!...వేషం విప్పేసు కున్నట్టే" అనుకున్నాడు సూరయ్య.

ఆయనకు భోగంవాళ్లతో పరిచయం ఉంది. వాళ్ల జీవితాలు ఎంత నికృష్టంగా ఉంటాయో ఆయన ఎరుగును. ఈ రాజరత్నంకూడా అట్లా జీవించటం అన్యాయం, ఘోరం! కాని, తాను చేయగలిగింది ఏముంది? ఈతరానివాడు ఒడ్డున ఉండి నీళ్ళలో మునిగిపోతున్న మనిషిని చూసినట్టు సూరయ్య రాజ రత్నంకేసి చూడసాగాడు ... ఆ మగవాళ్ళను పంపేసి రాజరత్నాన్ని తన యింటికి తీసుకుపోయి, ఊళ్ళో వాళ్లతో, "ఇదుగో, నేను చేసుకున్న మనిషి!" అని చూపితే ఎంతబాగుండు ననుకున్నాడు.

ఇప్పటికీ సూరయ్య నమ్మకం ఆ బాగు రాజ రత్నానికేగాని తనకు కాదని! రాజరత్నాన్ని ఎట్లా గైనా ఉద్ధరించటానికే సూరయ్య మనసు తటతటా కొట్టుకుంటున్నది! ఆమెకు తన ఉద్ధరింపు అవసరం లేదేమోనని ఆయనకు తట్టలేదు.

"కొద్దిరోజుల్లో నేను గుంటూరు రావలసిన పని ఉంది. వీలుంటే అట్లా మీ యింటికేసి వస్తాను. నా దగ్గిర మీ ఎడ్రసుంది!" అన్నాడు సూరయ్య.

"తప్పక రండి!" అన్నది రాజరత్నం.

# 3

రాజరత్నం వెళ్ళిపోయాక సూరయ్యకు గ్రామం ఎంత కళాహీనంగా కనబడిందో వివరించటం కష్టం. సత్రమూ, గుడీ, మునసబుగారిల్లూ, యింటిముందు పందిరివేసిన చోటూ శాపోదకం చల్లినట్టుగా ఉన్నాయి. ముసలాడి ఫిడేలూ, మృదంగం ముక్తా యింపులూ, రాజరత్నం పాడిన పాటల పల్లవులూ, అభినయమూ తలలో సందడి చేస్తున్నాయి.

సూరయ్య యువకుడు కాడు, ఆడవాళ్ళ మొహం ఎరగనివాడు కాడు. అయినా ఆయన నవయువకుడి తొలి విరహబాధలన్నీ అనుభవించాడు. "దీని బాబు ల్లాంటి అందగత్తెల్ని చూశాను ... కాని, దీనిలో ఏదో విలవైనది ఉంది – దాన్ని ఎట్లాగైనా ఉద్ధరించాలి! ఎట్లా ?" అని ఆయన తనను తాను చాలాసార్లు ప్రశ్నించుకున్నాడు.

వారం రోజుల లోపలే అయిదువందలు చేతబట్టు కుని గుంటూరు వెళ్ళాడు. ఉదయం తొమ్మిదిగంట లప్పుడు రాజరత్నం యింటికి వెళ్ళాడు. ముసలాడు వసారాలో కూచుని చుట్టకాలుస్తున్నాడు. దూరంగా ఊసి, "రండి" అన్నాడు, గొంతు సవరించుకుంటూ. తరవాత గొంతెత్తి, "రాజమ్మా ?" అని పిలిచి, జవాబు కోసం ఆగకుండానే, "లోపలికి వెళ్లండి" అన్నాడు.

ఎటువంటి అవతారంలో రాజరత్నం ప్రత్యక్ష మవుతుందో అని సూరయ్య భయపడ్డాడుగాని ఆమె మామూలు అవతారంలోనే ప్రత్యక్ష మయింది. తనను చూసి నమస్కారం చేసింది, కూచోవటానికి కుర్చీ చూపింది.

సూరయ్య తాను తెలుసుకోదలచిన విషయాలన్నీ ఒక్కొక్కటే అడిగాడు. రాజరత్నానికి జరుగుబాటు ఎట్లా అవుతున్నది? ఎవరన్నా పోషకు లున్నారా? అధ్యాత్మరామాయణం చెప్పే అవకాశాలు తరుచు వస్తాయా? ఎవరికన్నా అధ్యాత్మం నేర్పి డబ్బు సంపాదించరాదా? నాటకాలలో వేషాలు వెయ్యటం గురించి రాజరత్నం ఉద్దేశ మేమిటి?

రాజరత్నానికి జరుగుబాటుకు లోటులేదని తెలి సింది. ఆమె సొంత ఇంటో వుంటున్నది. ఇదిగాక ఇంకా రెండిళ్లున్నై. అద్దెలమీద యాభై రూపాయల దాకా వస్తుంది. ముసలాడు ఫిడేలు పాఠాలు నేర్పి సంపాదిస్తాడు. రాజరత్నాన్ని కొంతకాలం ఒక పాటగాడు ఉంచుకున్నాడు. ఆయనే కొంత పాట

అభివృద్ధి చేశాడు. ఆయన వెళ్ళిపోయాక ఆమెకు ఎవరూ లేరు.

"జరిగిపోయిన రోజులే మంచివి. తెలివిగల కుర్రాడు దొరికితే పెంచుకుందామని ఉంది. నేను పెద్దదాన్నయాక నా భారం వాడే మోస్తాడు. అయి తేళ్ళ కిందటకూడా అందమైన ఆడపిల్లను పెంచు కుందామని ఉండేది - నాలాంటిది కాకుండా!" అన్నది రాజరత్నం.

"మరి ఉద్దేశం మార్చేసుకున్నావేం?" అన్నాడు సూరయ్య.

"ఇంక ఆడపిల్లలు సంపాదించే దేమిటి? మేం తినే దేమిటి? నాకు పెళ్ళి కాకపొయెనే అని కొంతకాలం విచారించా. జరిగిన పెళ్ళిళ్ళు చూస్తే ఆ భ్రమ వది లింది. మీ రేమన్నా చెప్పండి, మా కులంవాళ్లు మడులూ, మాన్యాలూ సంపాదించేరోజులు పోయినై!" అన్నది రాజరత్నం.

"మడులూ మాన్యాలూ సంగతి దేవు డెరుగు. మంచితెలివితేటలుగలపిల్లనుగాచూసి పెంచుకుని దానికి నీవిద్య నేర్పు. నీతో పోనివ్వకు."

రాజరత్నం నవ్వింది.

"ఏం నవ్వుతున్నావు?"

''ఎవడిక్కావాలండీ ఈ అధ్యాత్మరామాయణం?''

''నాబోటివా డుండడా?''

''నాలుగు డబ్బులు సంపాదించటానికి ఇవేవీ అక్క ర్లేదు. గీత బాగుండాలి. అంతే!...అందానికి నాకు అప్పో చెల్లెలో అవుతుంది—ఇద్దరు జమీందార్లను పట్టింది!''

''నీకూ్కడా జమీందార్లు దొరక్కబోయిరే అని విచారిస్తున్నావా?'' అన్నాడు సూరయ్య ఆశ్చర్యంగా.

''మాటవరసకి చెప్పా!''

''ఒక్క కీర్తన పాడతావా ఏమిటి? నేను మళ్ళా వెళ్ళాలి."

"ఇప్పుడా?"

"ఏం?"

"ఒక్కమనిషి వింటే పాట ఏం రక్తికడుతుంది?"

"మా వూళ్ళో నువు పాడినప్పుడు నే నొక్కణ్ణే వినలేదని నువు నమ్మకంగా చెప్పగలవా?''

''అందరూ విన్నారన్న భ్రమ ఉంటుందిగద?''

''అయినా డబ్బుతీసుకు పాడేదానివి ఊరికే పాడ మంటే పాడతావా? ఇంద!'' అంటూ సూరయ్య జేబులోంచి తీసి డబ్బు ఆమె చేతి కిచ్చాడు.

రాజరత్నం కాస్సేపు నిర్ఘాంతపోయినట్టే కనిపిం చింది. తరవాత డబ్బు తీసుకుని పక్కనే బల్లమీద పెట్టింది. ఆమె తననుగురించి ఘనంగా భావించి ఉంటుందనుకున్నాడు సూరయ్య.

తరవాత రాజరత్నం తంబురా తీసుకుని, "వినవే పల్లవ మృదుచరణా" అన్న పాట పాడింది. పాటలో లోపం ఏమిటో సూరయ్యకు తెలియలేదు గాని, ఆ పాట వాళ్ళ ఊళ్ళో ఉన్నంత రక్తిగా లేదు.

రాజరత్నం పాట ముగించి తంబురా పెట్టేస్తూ, "ఇట్లా పాడితే ఏం బాగుంటుంది?" అన్నది.

"బాగానే ఉంది... ఎప్పుడూ బాగానే ఉంటుంది" అంటూ సూరయ్య దగ్గిరికి వచ్చి రాజరత్నాన్ని చెంప మీద ముద్దుపెట్టుకున్నాడు.

## 4

అదిమొదలు సూరయ్య రాజరత్నాన్ని ఉంచు కున్నాడు. మరుసటి ఏడు రాజరత్నానికి ఆడపిల్ల పుట్టింది.

''ఫరవాలేదు. మీ కుతురు నాకన్న చక్కనిదే!'' అన్నది రాజరత్నం సూరయ్యతో.

''దాన్ని వృత్తిలో దింపనని ప్రమాణం చెయ్యి!'' అన్నాడు సూరయ్య.

వయస్సు మళ్లుతున్నకొద్దీ సూరయ్యకు డబ్బుచింత జాస్తి కాసాగింది. 1927 నుంచీ ఆయన నాటకాల కాంట్రాక్టులు ప్రారంభించాడు. లాభం వచ్చినప్పుడు డబ్బు ఏమయిపోయేదో, నష్టంవచ్చినప్పుడు ఆ బొక్క పూడటమంటూ ఉండేదికాదు.

సూరయ్యను అల్లుడు వ్యాపారాలలో దింపాడు. ఇద్దరూచేరి బియ్యంమర అద్దెకు తీసుకున్నారు. నష్టం వచ్చింది. బాకీదార్లకు సూరయ్య ప్రోనోట్లు రాశాడు. ఆయేటికాయేడు సూరయ్య అప్పు పాపం పెరిగినట్టు పెరుగుతున్నది. పొలం తెగనమ్మి తీరుద్దామనుకుంటూనే తాత్సారం చేశాడు.

ఆయన గుంటూరుకేసి నెలల పర్యంతం పోవటం లేదు. రాజరత్నానికి పట్టుమని పదిరూపాయ లిచ్చి ఎంతకాలమయిందో...

ఉప్పు సత్యాగ్రహానికి వాళ్ల ఊరు ఉద్రూత లూగింది. ఒక్కఊపున పధ్నాలుగురు కుర్రాళ్లు జైలుకు సిద్ధపడ్డారు. వారివెంట సూరయ్య పదిహేనువాడుగా తయారయాడు. జైలునుంచి తిరిగి వచ్చాక ఊళ్లో

సూరయ్య పలుకుబడి హెచ్చింది. జైలులో డబ్బున్న వారి స్నేహం లభించింది.

ఆయనకూ రాజరత్నానికీ మధ్య తెగిపోయినట్టయింది. రెండు మూడుసార్లు గుంటూరు వెళ్ళి కూడా రాజరత్నాన్నీ, మాణిక్యాన్నీ చూడకుండానే తిరిగి వచ్చాడు. "ఏదీ? వ్యవధి లేకపోయింది... ఈసారి!" అని మనస్సును సమాధానపరుచుకున్నాడు.

మరి రెండేళ్ళకు మళ్ళీ రాజకీయ నిస్తబ్దత ఏర్పడింది. జైళ్ళకు పోయిన వాళ్లే జైళ్ళను మరిచిపోయారు. సూరయ్య పని పెట్టుకుని నెలకు ఒకటి రెండుసార్లు రాజరత్నాన్ని చూడసాగాడు. వెళ్లినప్పుడూ పదీ, పరకా మాణిక్యం చేతికే ఇచ్చేవాడు.

ఉన్నట్టుండి ధరలు పడిపోయినై. సూరయ్యకు కంగారు పుట్టింది. ఈ ధరల్లో తన బాకీలు తీర్చటానికి తన ఆస్తి చాలదు! "మళ్లీ ధరలులేవకపోవు! కంగారు అనవసరం!" అనుకున్నాడు.

ఇది అబద్ధంగా పరిణమించింది. "దివాలా అనిపించుకోవటం ఇష్టం లేదు. వచ్చినంత తీసుకుపొండి" అని సూరయ్య అప్పులవాళ్ళకు కబురు చేశాడు.

ఆస్తి పోయాక నాలుగేళ్లపాటు ఆయన రాజరత్నం మొహం చూడలేదు.

తిరిగి 1937 లో కాంగ్రెసు ఎన్నికలకు నిలబడ్డప్పుడు సూరయ్య జీవితంలో చైతన్యం ఏర్పడింది. చేతిలో డబ్బు ఆడింది. సూరయ్యను కాండిడేటుగా నిలబెడదామా అన్నదాక వచ్చింది. కాని అది సాధ్యం కాలేదు. ఎన్నికల అడావుడిలో సూరయ్య చేతిలో బాగా డబ్బు ఆడింది.

"నరసింహారావుతో మాట్లాడి రావాలి. గుంటూరు వెళ్లివస్తావా ఏం?" అని సూరయ్యను అడిగారు. సూరయ్యకు చప్పున మాణిక్యం మొహం జ్ఞాపకం వచ్చింది. మాణిక్యంమీద మమకారం తన హృదయంలో చాలా రోజులుగా అణుచుకుని ఉంది. గుంటూరు వెళ్లినప్పుడు రాజరత్నం ఇంటికి వెళ్లాడు.

మాణిక్యం పాట నేర్చుకుంటున్నది - అధ్యాత్మ రామాయణం పాట. రాజరత్నం నేర్పుతున్నది. ఎవరో కొత్తవాడు ఫిడేలు వాయిస్తున్నాడు. (ముసలాడు కింద పడి పోయాడు.)

"ఏమిటి? పిల్లకు అధ్యాత్మం నేర్పుతున్నావా?" అని అడిగాడు సూరయ్య.

"అవును, ఏం?" అన్నది రాజరత్నం.

"ఈ చెత్త ఎందుకు నేర్పుతున్నావు? ఇది అధ్యాత్మం చెప్పుకు బతుకుతుందనా?" అన్నాడు సూరయ్య ఆశ్చర్యంగా.

"ఎందుకు బతకరాదూ? దాని గొంతు నా గొంతు కన్న బాగుంటుంది. సంగీతంకూడా నేర్చుకుంటూనే వుంది. కావాలంటే విసండి."

సూరయ్య మండిపడ్డాడు. "నేను వినక్కర్లేదు, అది పాడా అక్కర్లేదు! ఈ ఆలోచన కట్టిపెట్టు!"

"ఇది నా ఆలోచన కాదు, మీ ఆలోచనే!" అన్నది రాజరత్నం.

"ఇంకా నయం!—నా కూతురు—"

"నాదే పొరపాటు లెండి" అన్నది రాజరత్నం, సూరయ్యకు అడ్డువస్తూ. "మీరు అధ్యాత్మం నేర్పమన్నది నేను పెంచుకునే పిల్లకుగాని, మీ పిల్లకు కాదు!"

రాజరత్నం ఏమంటున్నదీ అర్థం కానట్టుగా సూరయ్య ఆమెకేసి వింతగా చూశాడు.

---

"చాకివాఁడు కోక చీకాకుపడఁ జేసి
మయిలఁబుచ్చి మంచి మడుపుఁ జేయు,
బుద్ధి చెప్పువాఁడు గుద్దిన నేమయా?
విశ్వదాభిరామ వినుర వేమ!"

# విచికిత్స

శ్రీ బాదరాజు రాధాకృష్ణ

కోటి కోటి నిలువులలో
తున డాగిన ఆవేదన,
ఈ అగాధ సాగర సం
గీతములో ధ్వనించునా ?

నిశ్శబ్దపు లోతులలో
నిరామయపు గుండియలో
వేదనాగ్ని రగిలి రగిలి
పయిపయికే ఎగిరి ఎగిరి
విలయతాండవారభటికి
రూపరేఖ లిస్తుందా ?

నిత్యపరిభ్రమణ మహా
నిర్వేదంలో పుడమికి
గుండియ చెరువైపోతే,

మారణహోమం కోరే
హంతక సంతతిని చూచి
ప్రకృతిమాత విషాదాశ్రు
బిందువులను వర్షిస్తే,

కోటి కోటి నిలువులు నిం
డినవా.........?
ఏమంత వింత !

పరమలోభి వార్ధుషికులు
జలధి మనఃపేటికలో
ధనరాసులు భద్రపరచి,
కల్లోలోర్మి కవాట
ములను తెరచి చూస్తుంటే,

అనుక్షణ ప్రతారణకు
సాగరహృదయాంతరాళ
మింతలింతలయిపోతే,
శకల శకల మొక రత్నం
దాచిన దొక హృదయభాగ
మవుతుందా......?
చెప్పలేను !

గర్భవీచికలు దాచిన
మహారత్న సందోహం
చిత్ర చిత్ర వర్ణాలను
ప్రకృతిలోన చిత్రిస్తే,

చిత్రవర్ణ కిమ్మీరిత
జలజంతు ప్రస్థానం
సజ్జీకృత ధనువువోలె
వలయాకృత మైపోతే,

విశ్వ విశ్వాంతరాళ
వీణావాదన చతురత
ప్రకృతి గాయనీ గీతుల
సాగర పరిదేవనగా
ఇంద్రధనుస్తంత్రుల మూ
ర్ఛనలో వినిపిస్తుందా ?

# చైనాలో కాళిదాస రచనలు

చిన్ కే - మూ

మే 26 వ తేదీన పెకింగ్‌లో ప్రపంచ ప్రఖ్యాత రచయితలైన కాళిదాస, హైనే, డాస్టవిస్కీల జయంతి జరిగింది. పెకింగ్ విశ్వ విద్యాలయం ప్రాచ్యభాషాశాఖాధ్యాపకులు చిన్-కేమూ చైనాలో కాళిదాస రచనలను గురించి ఈ క్రింది విశేషాలను తెలియ జేశారు :

వందలాది సంవత్సరాల క్రితమే చైనా ప్రజలకు కాళిదాస రచనలు పరిచయ మయ్యాయి. సుమారు 13 వ శతాబ్దంలో టిబెట్ భాషలో వెలువడిన టాంజుర్ అనే బౌద్ధపాఠ్యగ్రంథ సంపుటిలో "మేఘదూత" వుంది. బహుశా విదేశ భాషలలోకి అనువదించబడిన కాళిదాసరచనలలో ఇదే మొదటిదై వుండవచ్చు. తర్వాత ఇది మంగోలియా భాషలోకికూడ అనువదించబడింది.

చైనా బౌద్ధ కవి రెవరెండ్ మంజ్షూ, కాళిదాస రచనలను చైనా భాషలోకి అనువదించిన ఆధునికులలో మొదటివాడు. "చైనా, విదేశ, సాహిత్యాలు" అనే తన గ్రంథానికి పీఠికలో కాళిదాసుని గురించీ, శాకుంతలం గురించీ ప్రస్తావించాడు. శాకుంతలం నాటకాన్ని ప్రశంసిస్తూ గెటే వ్రాసిన పద్యాన్నికూడ ఆయన చైనాభాషలోకి పద్యరూపంలో అనువదించాడు. శాకుంతలంకూడా ఆయన అనువదించాడట. కాని అది దురదృష్టవశాత్తు పోయింది.

తర్వాత శాకుంతలం నాటకానికి మూడు అనువాదాలు ప్రచురింపబడ్డాయి. ఇవన్నీ ఫ్రెంచి అనువాదంనుండి చైనా భాషలోకి అనువదింపబడ్డాయి. మేఘదూత, ఋతుసంహారంకూడా ఇలాగే ఫ్రెంచి భాషనుండి అనువదింపబడ్డాయి. చైనా ప్రాచీన నాటక పద్ధతిలో, శాకుంతలం నాటకానికి ఒక అనుసరణకూడా వెలువడింది. ఈ అనువాదాలద్వారా కాళిదాసు ప్రతిభను చైనా ప్రజలు తెలుసుకోగల్గారు. కాళిదాస మహాకవికీ, అతని శాకుంతలానికీ చైనా సాహిత్య బృందాలలో బహుళాదరణ లభించింది.

ప్రస్తుతం, కాళిదాస జయంతి సందర్భంలో-చీషీన్-లిన్ శాకుంతలాన్ని తిన్నగా సంస్కృతంనుండి ఆధునిక చైనాభాషలోకి అనువదించారు. ఈ అనువాదంలో మూలంలోని శైలిని సన్నిహితంగా అనుకరించుతూ వచ్చారు. జర్మన్ పండితుడు పిష్కేల్ పరిశోధించి ప్రకటించిన బెంగాలీ గ్రంథాన్ననుసరించి ఇది అనువదింపబడింది. నేను (చిన్ కే-మూ) మేఘదూతను సంస్కృతంనుండి ఆధునిక చైనా భాషలో పద్యాల్లోకి అనువదించాను. నా అనువాదం మల్లినాథ సూరి వ్యాఖ్యపై ఆధారపడింది. 115 శ్లోకాలను అనువదించాను. ఈ రెండు అనువాదాలను "పీపుల్స్ లిటరేచర్ పబ్లిషింగ్ హౌస్" త్వరలో ప్రచురించబోతున్నది. ప్రొఫెసర్ వూషియావో-లింగ్ ఋతుసంహారంలో కొన్ని శ్లోకాలను అనువదించాడు. అవి "పెకింగ్ లిటరేచర్"లో ప్రకటింపబడ్డాయి. కాళిదాసుని ఇతర రచనలనుకూడా మేము అనువదించాలని అనుకొంటున్నాం.

శాకుంతలం అనువాదం, దానిపై వ్యాఖ్యను పండితులే గాక ప్రజానీకంకూడా హర్షించారు. చైనా పండితులకు యీ నాటకంలో ప్రత్యేక అభిరుచి వుంది. చైనా ప్రాచీన నాటకాల (classical dramas)లో యీ నాటకంలోని కథావస్తువులాంటివి ఉన్నవి. కథానిర్వహణ (ట్రీట్‌మెంట్)లోకూడా పోలికలున్నాయి. ఉదాహరణకు నాంది, విశ్రాంతి ఒకేరకంగా ఉన్నాయి. విదూషక పాత్రలకూ, చైనా రాజదర్బారులలోని వినోదకులకు పోలిక వుంది.

చైనాలోని మొట్టమొదటి నాటకాలలో ఈ వినోదకులకు ప్రముఖపాత్ర వుండేది. సంస్కృత నాటకం, చైనా ప్రాచీన నాటకం - ఈ రెండూ పరస్పరం ప్రసరించిన ప్రభావాన్ని గురించి జాడా తీయాలని చైనా పండితులు ప్రయత్నించసాగారు. ఈ విషయంలో గమనించ తగిన ఫలితాలింకా లభించలేదు. బహుశా చైనా, భారతదేశనాటకాలు ఒకే పరిస్థితులలో తలయెత్తాయనీ, ఒకే పంథాను నడిచాయనీ, కాని వేర్వేరుగా అభివృద్ధి చెందాయనీ మనం అంచనా వేయవచ్చు...

...ఈ సంవత్సరం జరిగిన కాళిదాస జయంత్యుత్సవం, భారతదేశ ప్రాచీన సాహిత్యాన్ని, సమకాలీన సాహిత్యాన్ని మరింత చైనా భాషలోకి అనువదించడానికి దారి తీస్తుంది. ఇంతేగాక భారత, చైనా దేశాల ప్రజల మైత్రిని ఇది మరింత గట్టిపరుస్తుంది.

సభ అల్పాహారంతో ప్రారంభమైంది. అనంతరం 70 గులాబీ గుత్తులతో కట్టిన పూలమాలను నార్ల వెంకటేశ్వరరావుగారు ధర్మారావుగారి మెడలో వేశారు. హర్షధ్వానాలుమారుమ్రోగాయి. తాపీ మోహన్‌రావు, చాణక్య కాశ్మీరు శాలువాను సమర్పించారు. శ్రీ బి. ఎ. సుబ్బారావు, బి. ఏ. రామారావు, వి. రామచంద్రరావు, వరలక్ష్మమ్మ, లక్ష్మీరాజ్యం, తిలక్, కాట్రగడ్డ శ్రీనివాసరావు, వాసిరెడ్డి నారాయణరావు, ప్రసాద్‌గార్లు పూలదండలువేసి కానుకలు సమర్పించారు.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ఇలా అన్నారు:

"తాపీ ధర్మారావుగారు బహుముఖప్రజ్ఞ కలవారు. కవిగా, పండితుడుగా, విమర్శకుడుగా, పత్రికా సంపాదకుడుగా ఆయన చేసిన, చేస్తున్న అపారసేవను ఆంధ్రదేశం మరవలేదు.

'ఈ దండ కట్టించినవారు దీనిని 70 సంవత్సరాలకు 70 గుత్తులతో కట్టించటం బాగా వుంది. కాని దానితోపాటు మరి 30 మొగ్గలుకూడా వుంటే బాగుండేది.

"నాకు నాయుడుగారితో పరిచయం 1936 వ సంవత్సరంలో. అప్పుడు నేను కాకినాడలో చదువుకుంటున్నా. "విజయ విలాసం"గూర్చి ఆయన అప్పుడు ఉపన్యాసాలు అక్కడ యిస్తున్నారు. ఇది ఎలావుందో చూచిపోదామని వెళ్ళాను. అక్కడనుండి కదలలేకపోయాను. మూడురోజులు అలాగే ఉత్సాహంతో విన్నాను.

" 'జనవాణి' సంపాదకులుగా నాయుడుగారు వున్నప్పుడు నేను న్యూస్ ఎడిటరుగా వుండేవాడిని. ఆయన ఎడిటర్, నేను న్యూస్ ఎడిటర్. వయసు మా యిద్దరికి 22 సంవత్సరాల వ్యత్యాసం. కాని పాండిత్యంలో నాకంటె 22 రెట్లు ఎక్కువ ఆయన. జర్నలిజంలో ఆయనదగ్గర నేను, నా సహాధ్యాయులు అనేకం నేర్చుకున్నాం. ఆయన చక్కగా సంపాదకీయాలు వ్రాసేవారు. పత్రికలో ప్రతిచోటా ఆయన కనిపించేటట్లు అన్నీ వ్రాసినా అలసట ఎరుగరు. అన్నిటిని అవలీలగా చక్కగా చేసేవారు.

"వీరు తెలుగు జర్నలిజానికి పెద్దసేవ చేశారు. దినపత్రికలలో వ్యావహారికభాషను 1936 లో తొలిసారిగా ప్రవేశపెట్టిన గౌరవం వీరిదే. అంతకు ఏడాది క్రితంవరకు నాయుడుగారు గడ్డు గ్రాంధికవాదులు. అనేక సంవత్సరాలు గ్రాంధికమే వ్రాశారు. తరువాత కొత్తపాళీపెట్టి వ్యావహారిక భాషలో అనేక వ్యాసాలు వ్రాశారు. అప్పుడు భాషవిషయంలో దినపత్రికలు మడికట్టుకొని కూర్చుండేవి. 1936 లో వాటికి వ్యావహారికభాష ఒరవడిపెట్టింది వీరే. సామాన్య ప్రజలకు అందుబాటులోవుండే భాషలో వ్రాయకపోతే అవి పత్రికలు అనిపించుకోవు. అందువలన తెలుగు జర్నలిజానికి మహోపకారం చేశారని అంటున్నా.

"మేము ఆయనదగ్గర పనిచేసినప్పుడు పరిపూర్ణ స్వేచ్ఛ యిచ్చేవారు. ఏదైనా తప్పుచేస్తే మరునాడు మనస్సును నొప్పించకుండా చెప్పేవారు. ఆయన అప్పుడు పరిపూర్ణ స్వేచ్ఛ యివ్వటంవల్లనే మేము యింత అభివృద్ధి అయ్యామని చెప్పుతున్నా.

"నాయుడుగారు వ్రాసిన అనేక వ్యాసాలు, గ్రంథాలు ముద్రించటం అవసరంవుందని అనేక సార్లు చెప్పాను. 'ఇప్పుడేమి తొందరలే' అని ఆయన ఆలస్యంచేసివుండవచ్చు.కానిముద్రించడంఅత్యవసరం."

## గిడుగువారి ముఖ్యశిష్యులు

శ్రీ గిడుగు సీతాపతిగారు ఇలా ప్రసంగించారు:

"ఆయనతో నాకు పరిచయం సుమారు 50 సంవత్సరాలుగా ఉంది- నాకంటే మూడేండ్లు చిన్న. ఆనాటినుండి మా స్నేహం, ఆదరం, అనురాగాలతో పెరుగుతూ వచ్చింది. ఆయన నన్ను ఎందుకు ఆదరించేవారంటే గురువుగారైన గిడుగు రామమూర్తిగారి కొడుకునని. కాని నాకు ఆయనమీద ప్రేమ ఎందుకంటే మా నాన్నగారి శిష్యులలో అందరికంటే తెలివి గలవారు గనుక. ఈయన నాయనగారు గొప్ప డాక్టరు. ఈయనకూడ డాక్టరు కావలసిందే. కాని ఈయన శరీరానికి కాకుండా శబ్దాలకు డాక్టరు అయ్యారు. వారి కుటుంబంలో అమరకోశం బాల్యంనుండి నేర్పేవారు. అందువలన ఈయన బాల్యంనుండి భాషాసేవ చేస్తుండేవారు. మా నాన్నగారిని వ్యావహారిక భాషపై ఎదిరించేవారు. ఎదిరించినా గురువుగారిమీద అమిత భక్తి. గురువుగారు ఎందుకు ఇలా చెప్పారా అని ఆలోచించేవారు. కొన్నాళ్ళకు గురువుగారికి వ్యావహారిక భాషను అంగీకరిస్తూ ఉత్తరం వ్రాశారు. అప్పుడు మా నాన్నగారి సంతోషానికి అంతులేదు. అప్పటినుండి వ్యావహారిక భాషనుగూర్చి ఉపన్యాసాలు యిస్తూవుండేవారు. మా నాన్నగారు కొత్తపాళీ వ్యాసాలను చూసి ఎంతో మెచ్చుకునేవారు. "నా ముఖ్యశిష్యుడు ఈ ఉద్యమాన్ని చేపట్టాడ"ని సంతోషం వెలిబుచ్చేవారు. అప్పటినుండి వ్యావహారికభాషా



ధర్మారావుగారికి కాశ్మీర్ శాలువా బహూకరణ

ఉద్యమం సాగుతూనే ఉంది. ఇప్పుడు మద్రాసు యూనివర్సిటీవారు వ్యవహారిక భాషను ప్రవేశపెట్టారు. కాని ఇది జరగవలసింది ఆంధ్ర యూనివర్సిటీలో. వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి నాయుడుగారూ, నార్లవారూ సిండికేట్ సభ్యులు. ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో కూడ వ్యవహారిక భాషను ప్రవేశపెట్టేవరకు ఆయన విశ్రమించరని ఆశిస్తున్నా. దానికిగాను చిరాయువులుగా వుండాలని భగవంతుని కోరుతున్నాన"ని నినదించారు.

## తెలుగువారి తెలుగు రాయగల కొద్దిమందిలో ఒకరు

శేషులపల్లి కృష్ణశాస్త్రిగారు ఇలా మాట్లాడారు:

"పూజ్యులు, మిత్రులు అయిన నాయుడుగారి 70 వ జన్మదినోత్సవం జరుపుతుంటే ముందు సంతోషించేవారిలో నేను ఒకడిని. "వేగుచుక్క" గ్రంథమాల స్థాపననుండీ ఆయనతో నాకు సంబంధం వుంది. కాకినాడలో ఒకచోట మేమిరువురం ఘర్షణకూడ పడ్డట్టుగుర్తు. ఆయనతో అనేక ఉపన్యాసాలు యిప్పించి ఆయన యెడల భక్తి ప్రపత్తులు చూపుతున్నాను. తెలుగువారి తెలుగు - తెలుగు చక్కగా వ్రాసే యిద్దరు ముగ్గురులో మీరు ఒకరు".

## ప్రముఖ సాహిత్య విమర్శకులు

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఇలా అన్నారు:

"నాయుడుగారికి, నాకు అంతకుముందు పరిచయం లేకపోయినా వారి "వేగుచుక్క" గ్రంథమాల పుస్తకాలను ఎప్పుడూ చదువుతూ వుండేవాణ్ణి. వారు ఎన్నో రచనలు చేశారు. దక్షిణ కళింగదేశ ఆధునిక రచయితలలో మొట్టమొదట చెప్పదగినవారు నాయుడుగారే. ఈయన పద్యాలు చక్కగా వ్రాసేవారు. మన మనస్సులను ఆకర్షించే శక్తి ఆయనకువుంది. వయస్సు వచ్చినా ఆ గుణం పెరుగుతోంది. ఆయన ఎప్పుడూ నవ్వుతూ వుంటారు. ఆ నవ్వే ఆయన యౌవ్వనాన్ని నిలుపుతోంది. ఆయన చక్కటి విమర్శకులు. కవి హృదయాన్ని చక్కగా గ్రహించి వెల్లడిచేయగలవారు. ఆ విమర్శలు యింతవరకు ముద్రణ కాకపోవడం మన దురదృష్టం. సినిమా రంగంలోకి వెళ్ళకుండా సాహిత్యరంగంలోనే వుంటే యింకా ఎక్కువ సే

మయ్యగలిగేవారేమోనని అనుకుంటా. ఆయన పేర సంతోషశక్తి నింపుకుంటే మరో 25 సంవత్సరాలు జీవించాలని ఆశిస్తున్నా."

## వచన రచనలో విశిష్టత

నిడదవోలు వెంకట్రావుగారు యిలా ప్రసంగించారు:

"నాయుడుగారితో సంబంధం యిప్పటిది కాదు. ఒక్క గిడుగు సీతాపతిగారిని తప్పిస్తే నా యన్నంత పరిచయం మరొకరికి లేదు. ఆయనకు మా కుటుంబంతోనే సంబంధం వుండేది. 1916-17 లో మా పెదనాన్న టెక్కలిలో మాష్టరు. నాకు అవి వచ్చేవి కావు. అప్పుడే డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు కూడా మాష్టరుగా వుండేవారు. 1925 లో ఆయన విజయనగరం తిరిగివచ్చారు. ఆ కాలంలో ఆయన చదువని గ్రంథమంటూ వుండేదికాదు. వారి "ఉదయకాలం" రచనను కొక్కొండ వెంకటరత్నంగారు ఎంతో మెచ్చుకున్నారు. నాయుడుగారికి సాహిత్యంలో విశిష్టస్థానం వుంది. తెలుగు వచన రచనలో ఒక విశిష్టతను సంపాదించుకున్నారు. నేను వ్రాస్తున్నటువంటి "ఆంధ్రదేశ వాఙ్మయం"లో ఆయన విశిష్టతను నిరూపించబోతున్నా. ఆయన విమర్శనలు ఎంతో అగ్రశ్రేణిలో వున్నాయి. నేను వ్రాసిన దాన్నిగూర్చి ఆయన మంచిఅంటే నాకు అంతే చాలు. మిగతావాళ్ళు ఎన్ని అన్నా లెక్కించను" అని అన్నారు.

## సినిమా స్క్రిప్ట్ రచనకు ఒరవడి దిద్దిన ఆచార్యుడు

సముద్రాల రాఘవాచారిగారు ఇలా అన్నారు:

"ఇది మనకు సంతోష సమయం. సముద్రాలలోనే నాకు వీరితో పరిచయం కలిగింది. కలుసుకున్న క్షణం నుంచి గౌరవ పూజ్యభావాలు పెరుగుతూ వచ్చాయి. ఆయన నాకంటే చాల పెద్దవాడైనప్పటికి ఒకొక్కప్పుడు నేనే ఆయనకంటే ముసలివాడినని అనిపించేది. ఏ కొద్ది కాలంవున్నా సాహిత్య చర్చలు చేస్తూ వుండే



సన్మాన సభకు విచ్చేసిన పెద్దలు
(కుడినుంచి) దేవులపల్లి కృష్ణశాస్త్రి, నరసరాజు, గోవిందరాజుల సుబ్బారావు, కాటూరి వెంకటేశ్వరరావు, నార్ల వెంకటేశ్వరరావు మున్నగువారు.

వాళ్ళం. నేను 'ప్రజామిత్ర'లో పనిచేసేటప్పుడు "తాత"గారు దేవాలయాలపై బూతు బొమ్మలు అనే వ్యాసావళి రాశారు. తరువాత ఇనపకచ్చడాలు, కొత్త పాళీ వ్యాసాలు వ్రాశారు.

"వాటి ప్రూఫులుదిద్దే అవకాశం నాకు దక్కింది.

"తెలుగు సినిమా రంగంలో కథా గమనాన్నీ, సంభాషణలనూ జోడించి స్క్రిప్టరాసే పద్ధతిని మొదట ప్రవేశపెట్టింది వీరే. ఆ ఒరవడినే మేమంతా అనుసరిస్తున్నాము. సినిమా రంగంలోకి రాకుండా వుంటే సాహిత్యసేవ ఎక్కువ చేసేవారేమో అని కొందరు అంటారు. కాని దీని ద్వారాకూడా సాహిత్య సేవ చేయవచ్చు. ఆరోజు తాతాజీలాంటి మార్గదర్శి సినిమారంగంలో ప్రవేశించకపోతే మేము ఏమైపోయే వాళ్ళమో! ఆయన వ్రాసిన సినిమా మాటలు - పాటలలో అనేక రత్నాలు వున్నాయి. వాటిని మనం వెలికితీయవచ్చు. ఇదికూడ సాహితీ రంగానికి సేవచేసి నట్లేనని తెల్పుతున్నా. ఆయన గ్రంథాలన్నీ అచిర కాలంలో ముద్రింపబడుతాయని నేను ఆశిస్తున్నా. తద్వారా ఆయన అనుభవాన్ని మనకు అందించాలని కోరుతున్నా."

డాక్టర్ గోవిందరాజులు సుబ్బారావుగారు ఇలా అన్నారు:

"సినిమాలలో డైలాగులు వ్రాయటం తేలికకాదు. మాలపిల్ల డైలాగున్ను ఈయన వ్రాయటంవల్లనే అది అప్పుడు అంత జయప్రదమయింది. నేను దానిలో బాగా నటించానంటే అది నా నోట వీరు పలికించిన మాటలవల్లనే. ఆయన మనస్సు ప్రశాంత మైంది. భాషాసేవ ఇంకా చేస్తారని దీవిస్తున్నా."

## కవి హృదయాన్ని విప్పిచెప్పగల విశిష్ట వ్యాఖ్యాత

విద్వాన్ విశ్వంగారు ఇట్లా ప్రసంగించారు:

"జర్నలిస్టుకు అన్నిరంగాలతోనూ పరిచయం ఉండాలి.

"అదిలేకపోతే పత్రికా ప్రపంచంలో మెలగటం కష్టం. ఆ విశిష్టగుణం ధర్మారావుగారికి ఉన్నది. విజయవిలాసం ప్రబంధానికి వీరి వ్యాఖ్యానం చాల గొప్పది. ఉదాహరణకు అచ్చెరువుపాటు అనే శబ్దంపై ఆయనచేసిన విమర్శన మెచ్చదగింది. ఆయన చేసిన విమర్శ చూచిన తరువాత ఆ పద్యం అర్థం తెలిసింది. పద్యం చదివి ఆనందించడం తేలిక. దాని అంతరాంత రాలనూ, లోతుపాతులనూ ఇతరులకు చెప్పి వారిని ఆనందింపచేయడం బహుకష్టం. అది ఈయన చేయ గలడు. వ్యాఖ్యాతలకు కవులు, పండితుల స్థాయిలో గౌరవంవుంది. ఇప్పుడు వ్యాఖ్యాతలు తక్కువ అయి పోతున్నారు. విమర్శన అంటే నానార్థాలు చెప్పటంకాదు. కవి హృదయాన్ని చెప్పాలి. దానికి నిశితమైనదృష్టి అవసరం. అది నాయుడుగారికి ఒక్కరికే వుంది. వారి ఆత్మకథఅయిన "రాళ్లు రప్పలు" కూడ సమగ్రంగా వ్రాయాలని కోరుతున్నా. ఇటువంటి వ్యక్తులు ఆత్మకథ వ్రాయడంవల్ల ఎక్కువ సేవ చేయగలరు. వారి వ్యాఖ్యానాలు పరిపూర్తిచేసి ఆంధ్ర ప్రజలకు అందించాలని కోరుతున్నా.

"నేను 'నా హృదయం' అనే కావ్యాన్ని వ్రాశాను. ఆయనకు దానిని అంకితం యిస్తున్నా."

## శ్రీ రేలంగి వాగ్దానం

హాస్యనటుడు రేలంగి వెంకట్రామయ్యగారు మాట్లాడుతూ యిలా అన్నారు:

"తాతాజీ నన్ను శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో నా పేర స్కాలర్‌షిప్ ఇవ్వమని అడిగారు. ఈ సందర్భంలో దానికిగాను యూనివర్సిటీకి రూ. 15 వేలు యిస్తానని ఆయనకు వాగ్దానం చేస్తున్నా."

## యువలోకానికి సన్నిహితులు

శ్రీమతి ఆదిలక్ష్మిగారు మాట్లాడుతూ, విద్యార్థులకు, యువకులకు గుండెకు హత్తుకొనేలా చెప్పగల దక్షత నాయుడుగారికి వున్నదన్నారు. "అందుచేతనే వర్తమాన యువలోకానికి వారు అత్యంత సన్నిహితు" లన్నారు.

శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు మాట్లాడుతూ "పండితుడైనవాడు కవిగాడు. పండితులు పత్రికా రచయితలు కారు. కాని వీరిలో అన్నీ మూర్తీభవించి వున్నాయి" అని అన్నారు.

"భాషాసేవాసమితి తరఫునసన్మానం చేయాలనిఅనుకుంటున్నాము. దానికి మేము నాయుడుగారిపై 'పరిశోధన' ప్రత్యేక సంచిక వేయబోతున్నాం. దానికి మీరంతా సహాయం చేయాలని కోరుతున్నాం" అని చెప్పారు.



సన్మానోత్సవానికి కృతజ్ఞత తెలియజేస్తున్న
శ్రీ తాపీ ధర్మారావుగారు

## అతివాదులలో అతివాది 

శ్రీ అనిసెట్టిగారు మాట్లాడుతూ యిలాన్నారు:

"యువకుల ఉత్సాహం, పెద్దల విజ్ఞానం ఆయనలో వున్నాయి. ఆయన అతివాదులలో అతివాది. అన్ని రంగాలలో కృషిచేసి కృతార్థులైనారు. ఈ ఉత్సవం యిలా ఏర్పాటు చేసినందులకు మోహన్‌రావు, చాణుక్యలను అభినందిస్తున్నాను. ఆంధ్రదేశంలో కవులందరూ, పెద్దలందరూ కలిసి మద్రాసులో వీరికి ఒక అఖండ సన్మానం చేయాలనీ, అది మన ధర్మమనీ కూడా నేను అంటున్నాను.

"తాతాజీకి సన్మానం జరపడంతోపాటు ఆయన రచనలు ముద్రించాలనీ, ప్రతి లైబ్రరీలో వుండా"లని నేను కోరుతున్నాను.

'పరిశోధన' పత్రికా సంపాదకులు శ్రీ టి. రామచంద్ర మాట్లాడుతూ,

"పాత కొత్తలకు మేలు కలయిక తాతాజీ" అని అన్నారు.

శ్రీ వార్ల చిరంజీవిగారు మాట్లాడుతూ,

"భీష్మాచార్యులకు భారతంలో వున్న పాత్ర యిప్పుడు తాతాజీకి సాహిత్యరంగంలో వుంది. తాతాజీ బలమైన స్నేహ హస్తం ప్రజలపక్షాన వుంది. ప్రజలు ఆయనతో ఉన్నా"రని అన్నారు.

తాతినేని ప్రకాశరావు, కొసరాజు రాఘవయ్య గార్లు కూడా ప్రసంగించారు.

## ధర్మారావుగారి ప్రసంగం

తనను సన్మానిస్తూ మాట్లాడినవారికి జవాబిస్తూ ధర్మారావుగారు మాట్లాడబోయేప్పటికి ఆయనకు మాట పెగలలేదు. ఒక్క నిమిషం అలాగే నిలబడి తమాయించుకుని యిలా మాట్లాడారు:

"కళ్ళవెంట నీళ్ళురాక 'నిరక్షురోదనం' అనే అనేక పద్యాలు రాశాను. కాని ఈరోజు మీరు నాకళ్ల వెంట నీరు తెప్పించారు. తెలుగు సాహిత్యం నాకు బ్రతుకుతెరువు చూపలేకపోయింది. మరేదన్నా చేద్దామని కొన్ని ప్రయత్నాలు చేశాను. తిరిగి భాషా సేవకే రావలసి వచ్చింది. ఇది ఒక జబ్బు అనే అనుకుంటూ. ఈరోజు ప్రశంసా వాక్యాలు గమనించదగ్గవని నేను అనుకుంటూ. చెప్పిన మనుష్యులబట్టి దానికి విలువ వుంది. మల్లంపల్లి, గిడుగు, దేవులపల్లి మొదలగువారు ఉద్దండులు. ఆయా విషయాలు బాగా తెలిసిన వారు పలికే ప్రశంసావాక్యాల కెంతో విలువ వుంటుంది.

"అయితే సినిమాకు ఎందుకు వచ్చారు అని అడిగారు. మాకు చిన్న రొట్టెముక్క వుంది. దానికి వెన్నలేదు. వెన్న సంపాదించుకుందామని దీనిలో దిగాను. సినిమాలోకూడ సాహిత్యసేవ చేయవచ్చు. సరుకువున్న వ్యక్తి ఎక్కడున్నా సాహిత్యసేవ చేయగలడు.

"గ్రంధ ముద్రణలనుగూర్చి చాలామంది చెప్పారు. నా వ్యాసాలు మొదలైనవి ఎక్కడెక్కడ వున్నాయో నాకు తెలియడంలేదు. తెలుసుకోవడంకూడ కష్టమే. దొరకిన వాటిని మీ అందరి సహాయంతో ప్రకటించగలననే అనుకుంటున్నా" అని అన్నారు.

అధ్యక్షులు మాట్లాడుతూ, "వచ్చే సన్మానసభలో నాయుడుగారి తైలవర్ణ చిత్రాన్ని గీస్తానని సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ చేమకూరి సత్యనారాయణగారు తెలియజేశారు. నేను జర్నలిస్టుగా ధర్మారావుగారికి ఎంతో ఋణపడి వున్నానని తెలియజేస్తున్నాన"ని అన్నారు.

శ్రీ తాపీ మోహన్‌రావు మాట్లాడుతూ యువకులలో జిజ్ఞాసను రేకెత్తించేందుకు ధర్మారావుగారు ఎలా కృషిచేస్తారో తన అనుభవంనుండి ఉదహరించారు. తమ ఆహ్వానాన్ని స్వీకరించి ఈ ఉత్సవంలో పాల్గొన్నవారికీ, అధ్యక్షత వహించిన నార్లవారికీ కృతజ్ఞతాభివందనలు సమర్పించారు. వందన సమర్పణతో ఉత్సవం ముగిసింది.

# యువ రచయితలకు సన్మానాలు

## శ్రీ అవసరాల

కవీ, కథకుడూ, విమర్శకుడూ, పరిశోధకుడూ, నాటక రచయితా అయిన శ్రీ అవసరాల సూర్యారావుగారికి కవి సన్మానం విజయనగరం మినర్వా హాలులో మే 18వ తేదీన జరిగింది. సన్మానసభకు డాక్టర్ బి. వి. సంజీవరావుగారు అధ్యక్షత వహించారు.

శ్రీయుతులు సంజీవరావు, రోణంకి అప్పలస్వామి, శ్రీమత్తిరుమల నరసింహాచార్యులు, విద్వాన్ తుమరాడ సత్యనారాయణగార్లు అవసరాల రచనా ప్రాశస్త్యాన్ని ప్రశంసించారు.

సన్మానసంఘం తరఫున శ్రీ నిష్ఠల వెంకటరమణమూర్తి సన్మానపత్రాన్ని సమర్పించారు. సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ అంట్యాకుల పైడిరాజుగారు సన్మానపత్రాన్ని ముచ్చటగా తయారుచేశారు. శ్రీ కేతినీడి భాస్కరరావుగారు తాము రచించిన వర్ణచిత్రం "సుషుప్తి"ని బహూకరించారు. సన్మానసంఘంవారు ఒక శాలువను, మూడువందల రూపాయలను సమర్పించి సత్కరించారు.

తమకు జరిగిన సన్మానానికి శ్రీ అవసరాల కృతజ్ఞత తెలియజేశారు.

సభానంతరం శ్రీ అవసరాల రచించిన "పంజరం" నాటకాన్ని శ్రీ నటరాజ కళాసమితి (శ్రీకాకుళం) వారు చక్కగా ప్రదర్శించారు.

♦ ♦ ♦

## శ్రీ రెంటాల

కవీ, నాటకకర్తా అయిన యువరచయిత శ్రీ రెంటాల గోపాలకృష్ణగారికి విజయవాడలోని విజయా టాకీస్‌లో ఆగస్టు 19న ఆంధ్రా ఆర్ట్ థియేటర్‌వారు సన్మానం జరిపారు. శ్రీ గోపాలకృష్ణగారు రచించిన "ఇనస్పెక్టర్ జనరల్" నాటక ప్రదర్శన సందర్భంలో ఈ సన్మానం జరిగింది. ఆగస్టు 25వ తేదీన ఆంధ్ర ఆర్ట్ థియేటర్‌వారిదే సందర్భంలో తేనీటివిందు జరిపారు.

♦ ♦ ♦

## శ్రీ రమణారెడ్డి

కవీ, చరిత్రోపన్యాసకులూ, అభ్యుదయ పత్రికా సంపాదకవర్గ సభ్యులూ అయిన శ్రీ కె. వి. రమణారెడ్డిగారు ఒంగోలును విడిచి కావలి కాలేజీలో అధ్యాపకులుగా నియమితులైన సందర్భంలో వారికి సన్మానం జరిగింది.

ఆగస్టు 6వ తేదీన హిందీ ప్రేమీమండలి, అభ్యుదయ రచయితల సంఘం, ఒంగోలులోని "సాహిత్య సదన్"లో శ్రీ రమణారెడ్డిగారికి వీడ్కోలు సంగారు.

సభకు మున్సిపల్ చైర్మన్ శ్రీ సీతారామయ్య నాయుడుగారు, హైస్కూలు ప్రధానోపాధ్యాయులు డి. రాఘవరావుగారు, బెంచి మేజిస్ట్రేటు శ్రీ నున్నా పున్నారావుగారు, శ్రీ చెర్వు సుబ్రహ్మణ్యంగారు, శ్రీ పి. వి. రాఘవయ్యగారు (పార్లమెంటు సభ్యులు) శ్రీ వి. యస్. శర్మగారు (సి. యస్. ఆర్. కళాశాల ప్రధానాంధ్రోపన్యాసకులు) శ్రీ డి. కామేశ్వరరావుగారు (సాహిత్యసదన్ ప్రిన్సిపాల్) శ్రీ మోజెస్‌గారు, మరికొందరు సాహిత్యాభిమానులు, పురప్రముఖులు విచ్చేశారు.

శ్రీయుతులు కె. వెంకటేశ్వరశాస్త్రి, దీక్షిత్, వి. రామమూర్తి, ప్రసాద్, శ్రీకాంత్, జాన్‌వెస్లీ, రంగకవి, రెడ్డెయ్య, ఆచార్య శేషు, భూషణబాబు, సరస్వతీదేవి, మొదలైన అభ్యుదయ రచయితలు సభకు వచ్చారు. విద్వాన్ శ్రీ దయానంద్‌గారు సభకు రాజాల వందున సందేశం పంపారు.

సన్మానసభ సందర్భంలో అభ్యుదయ రచయితల కావ్యగోష్ఠి జరిగింది. శ్రీ వి. యస్. శర్మగారు ప్రారంభోపన్యాసం గావించారు. శ్రీ రంగకవిగారు "దీక్ష" కావ్యం నుండి, శ్రీ జాన్ వెస్లీగారు "ఉమర్ ఖయామ్" నుండి, శ్రీ వెంకటేశ్వర శాస్త్రిగారు "ప్రబంధకుక్కుటేశ్వరం" నుండి, శ్రీమతి సరస్వతీ దేవిగారు 'వెంకటేశ్వర' శతకంనుండి కవితాగానం చేశారు. శ్రీ రెడ్డెయ్యగారు 'యువకవి' అనే గీతాలు చదివారు. శ్రీ రామమూర్తిగారు కొన్ని పద్యాలు చదివారు.

తర్వాత అల్పాహారవిందు జరిగింది.

శ్రీ రంగయ్యగారి పాఠశాలలో హిందీ ప్రేమీ మండలివారు సన్మానసభ జరిపారు. శ్రీ రాఘవరావు గారు అధ్యక్షత వహించారు.

అధ్యక్షులు శ్రీ రమణారెడ్డిగారి సాహిత్యకృషిని, అధ్యాపకులుగా వారు చేసిన సేవను ప్రశంసించారు.

తర్వాత అభ్యుదయ రచయితల సంఘం తరఫున శ్రీరంగకవిగారు "రత్న కిరీటం" అనే పంచరత్నాలను సమర్పించారు. శ్రీ దయానంద్ గారి రచనను శ్రీ రెడ్డెయ్యగారు చదివారు. హిందీప్రేమీమండలి తరఫున శ్రీ సీతారామయ్యనాయుడుగారు సన్మానపత్రాన్ని రమణారెడ్డిగారికి సమర్పించారు. శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారికృతజ్ఞతావచనాలతో సన్మానసభముగిసింది.

◆ ◆ ◆

## శ్రీ దాశరధి, శ్రీ నారాయణరెడ్డి

మే 29 వ తేదీన చెన్నపురి ఆంధ్రమహాసభ హాల్‌లో తెలంగాణా యువకవులు శ్రీ దాశరధి, సి. నారాయణరెడ్డిగార్లకు సన్మానం జరిగింది.

ఆంధ్ర ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించారు. మద్రాసులో వివిధ సాహిత్య సంఘాలు, ఆంధ్ర సంస్థలు సన్మానపత్రాలు సమర్పించాయి.

శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, విద్వాన్ విశ్వం, గణపతిశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, బి యస్. రెడ్డి, అల్లూరి సత్యనారాయణ మొదలైనవారు సన్మానసభకు విచ్చేశారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు దాశరధి, నారాయణరెడ్డిగార్ల కవితాశక్తిని ప్రస్తుతించారు. అఖిలాంధ్ర సాహిత్యపరిషత్ స్థాపించవలసిన అవసరం వుందన్నారు. అల్లూరి సత్యనారాయణగారు మాట్లాడుతూ "వీరు తెలంగాణాకవులు మాత్రమేగాదు. మహాదాంధ్ర కవులు" అని అన్నారు.

తొలుత ప్రసంగించిన అధ్యక్షులు, కవిత్వం ప్రజలకు సన్నిహితంగా వుండాలన్నారు. హైదరాబాద్ రాజధానియేగాక విజ్ఞానకేంద్రం కాగలదు అని అన్నారు.

శ్రీ దాశరధిగారు తెలంగాణా రచయితల తరఫున అభివందనాలు తెలుపుతూ ఇలా అన్నారు :

"కవులకు ఎపుడూ ఎల్లలు లేవు. ఇది తెలంగాణా, ఇది రాయలసీమ అని విభేదాలు లేవు. అంతా ఒక్కటే. తుపాకికంటె, డబ్బుకంటె, ఎక్కువ శక్తి శబ్దంలో వుంది. ఆ శబ్దశక్తిని ఆరాధించి మానవత్వాన్ని రక్షించాలి. మన సాహిత్యం దేనికీ వెనుకబడదు."

శ్రీ నారాయణరెడ్డిగారు తమ రచన 'నాగార్జున సాగరం'నుండి కావ్యగానం చేశారు.

◆ ◆ ◆

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

అనేక కావ్యాలు, విమర్శనాగ్రంథాలు వ్రాసి సరస్వతీ పుత్ర బిరుదాంకితులైన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి కడప శ్రీ రామకృష్ణ మిషన్ హైస్కూల్ ఆవరణలో 2-9-'56 న సన్మానసభ జరిగింది. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారీ సభకు అధ్యక్షత వహించారు. ఆహ్వానసంఘంవారు శ్రీ నారాయణాచార్యులుగారికి 1325 రూపాయలను సమర్పించగల్గుతున్నామని తెలియజేశారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ ఆర్. రంగనాథంగారు తామీ ధనాన్ని ఏ కొద్దిమంది ధనికులవద్దనో గాక, జిల్లాలో అనేకమంది సామాన్యులనుండికూడా విరాళాలద్వారా ప్రోగుచేశామని చెప్పారు. తర్వాత శ్రీ పుట్టపర్తిగారి జీవిత విశేషాలను తెలిపారు.

భారతదేశంలోని అనేక కవి, పండిత, సాహితీప్రముఖులనుండి వచ్చిన సందేశాలను చదివారు. సందేశాలను పంపినవారిలో సర్వేపల్లి రాధాకృష్ణగారొకరు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ సందేశంలో పుట్టపర్తివారి కవితలోని మధుర శబ్దసౌష్టవాన్ని ప్రశంసించారు. విజయనగర సామ్రాజ్యచరిత్రలో చేసిన పరిశోధనను కొనియాడారు.

కడపజిల్లా ఉపాధ్యాయసంఘం కవిగారికి ఒక అభినందన పత్రాన్ని సమర్పించింది.

శివభారత గ్రంథకర్తలు శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో పుట్టపర్తివారిని ప్రశంసిస్తూ ఇలా అన్నారు:

"వీరి 'పెనుగొండలక్ష్మి' విన్నప్పుడే వీరికిగల ఉజ్వల భవిష్యత్తును గుర్తించాను. భాష, పాండిత్యం, మానసిక సంస్కారంవల్ల ప్రజాక్షేమాన్ని, ప్రజావాంఛను ప్రతిబింబించే పద్యంగాలేక గేయంగా బయటికివస్తే అదే సార్థకమైనది. వీరి రచనలలో సంస్కారం, మాధుర్యం, ఔచిత్యం, శత్రువులుగూడ మెచ్చుకోక

తప్పదు. ఆ విధంగా మెచ్చుకోలేక పోతే, వారిని రసజ్ఞులని చెప్పలేము. పుట్టపర్తి రచనలలోని గొప్పతనాన్ని గూర్చి చెప్పబూనితే విమర్శకుణ్ణి మాత్రమే అవుతాను. రసజ్ఞత వెనుకబడుతుంది. దాడిమీ ఫల మాధుర్యాన్ని అందించే ప్రయత్నంలో విమర్శకుడు తన చేతి ఉప్పు, కారములతో కలిపి ఆ మాధుర్యాన్ని కొంచె పరుస్తాడు."

అధ్యక్షులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు కవిగారితో తమకు పరిచయాన్ని వివరించి ఇలా అన్నారు:



శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారికి
అనంత కృష్ణశర్మగారు సన్మాన సంఘంవారు సమర్పించిన నిధిని ఇస్తున్న దృశ్యం

"నారాయణాచార్యుల కావ్యాలగురించి ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. వారికి నా పట్ల పితృ భక్తి వున్నది. ఆ భక్తితో నన్ను దూరంగా వుంచినారు. ఒక విధంగా బహిష్కారము. వారి పుస్తకాలు కొన్ని మాత్రమే దొరికినాయి. వారి 'పెనుగొండ లక్ష్మి' యెప్పుడో చదివినదైనా అందులో ఒక చరణము నాకింకా జ్ఞాపకముంది." "ఉలితో రాలకు చక్కిలింత లిడి" అన్నది. ఈ అపూర్వ భావము మొదటిసారి విన్నప్పుడే యీతడెంతో పైకి రాగలడని అన్నాను. వారి శివతాండవం చదువగా విన్నప్పుడు తుంగభద్రా ప్రవాహంలో కొట్టుకు పోతున్నట్లు తోచింది. నిజంగా అది ఒక ప్రవాహమే. తరువాత దానిని చదువగా యెక్కువ ఆనందించితిని. తరువాత మేఘదూతము చదివితిని. నా దృష్టిలో శివతాండవము కంటె యిది గొప్పరచన. ఈ మేఘ దూతమునకు, కాళిదాసు మేఘ సందేశమునకు కొన్ని పోలికలున్నవి. కాళిదాసుకు మేఘమే మహా అందమైనది. దానిలో ఇంద్రధనస్సు ఉంటే మరీ అందం. విక్రమోర్వశీయంలో మేఘాన్ని విమానంవలె ఉన్నట్లు వర్ణించినాడు. మేఘంపై అభిమానంతోనే కాళిదాసు దాన్ని దూతగ స్వీకరించి నాడు. మేఘం కాళిదాసులో కల్గించిన అనుభూతులనే పుట్టపర్తిలో గూడ కల్గించింది. అందువల్లనే తాను గూడ మేఘాన్ని దూతగా స్వీకరించినాడు. కొన్ని కాళిదాసు భావాలే గాక కాళిదాసు పదాలుగూడా మేఘదూతములో కనిపిస్తాయి. దీనిని ఎవరైనా చౌర్యమంటే అనేక ప్రాచీన కవులను చోరులనవలసి వచ్చును. కాళిదాసును గూడ చోరుడనవలసి వచ్చును. రథనేమి శబ్దమును వర్ణిస్తూ వాల్మీకి ప్రయోగించిన 'స్నిగ్ధ గంభీర నిర్ఘోషం' అనే సమాసం కాళిదాసు రఘువంశంలో కన్పిస్తుంది. దాని అర్థం కాళిదాసు

చోరుడని కాదు. వాల్మీకి ప్రయోగంలోని సారస్యాన్ని చక్కగా గ్రహించినాడని అర్థం. ఎటువంటి ధ్వని స్నిగ్ధంగా, గంభీరంగా వుంటుందో వాల్మీకివలెనే కాళిదాసు కూడ గ్రహించినాడని అర్థం. అదేవిధంగా నారాయణాచార్లు కాళిదాసును సమగ్రంగా అర్థం చేసుకొని అనుభవించినారు. అందుకనే మేఘదూతములో కాళిదాసు భావాలు, పదాలు వుండటం జరిగింది.

"ఈ సదస్సు మరొక కారణంవల్ల కూడ నాకు సంతోషం కల్గించింది. బిరుదుల సంరంభం లేకపోవడం నాకు చాల ప్రీతికరంగా వుంది.

"క్షామ ప్రాంతమైన ఈ జిల్లాలో రు. 1325 లు ఏమీ చిన్న మొత్తం గాదు. దీన్ని సేకరించటం గొప్ప విషయమే. అందుకు ఎంతో సంతోషిస్తున్నాను. నాకు ఈ అవకాశం కల్గించిన మీ అందరికీ ధన్యవాదాలు."

తరువాత అధ్యక్షులు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్లుగారికి ఫలపుష్ప చందన తాంబూలాదులతో సహా రు. 1325 లు సమర్పించి ఆశీర్వదించారు.

శ్రీ పుట్టపర్తి సన్మానానికి ఉచితరీతిని కృతజ్ఞత తెలియజేస్తూ ఇలా అన్నారు:

"ఈనాటి కవిని ఎన్నో తీవ్రసమస్యలు ఎదుర్కొంటున్నాయి. 30, 40 సంవత్సరాల నాటికీ, ఈనాటికీ ఎంతో తేడా ఉంది. ప్రజల అభిరుచులు మారినవి. రాజుల చరిత్రలు ప్రజలకు రుచించవు. దేశం నలుమూలలా పెద్ద భావవిప్లవం సాగుతోంది. నీతిసూత్రాలు మారడమూ, నీతిశాస్త్రప్రవాదులనే శంకించడమూ జరుగుతూవుంది. జనతలో కలిగే మార్పులను గుర్తించకుండా, ప్రజలలో కలుగుచున్న ఆవేశాలకు సంబంధంలేకుండా నేను వుండగలనా? సమకాలిక చరిత్రలతో సంబంధంలేకుండా ఏదో ఒక కావ్యం వ్రాయగలనా? ఈ భావవిప్లవాన్ని కొంతైనా ఆకళించుకోకుండా నేను కవిని గాగలనా? ఈ సమస్యలు నా మనస్సును బాధిస్తున్నవి. జాతీయత అనే భావము గూడ తన విలువలను కోల్పోతూవుంది. ఒకనాడు భారతంలోని "ఆంధ్రావని మోదమున్ బొరయ" అనేది గొప్ప భావం. ఈనాడు అది చాలదు......... నాలో మార్పులు వస్తున్నాయి. ఒక ఆవేదన, ఒక క్షోభ నా మనస్సును తలచుతూ వున్నాయి. నా జాతికి ఎట్టి కావ్యం వ్రాయాలి? ఎట్టి సాహిత్యం ఈనాటి ప్రజలకు మార్గదర్శకం? అనే తపనలో మహాకావ్య ప్రయత్నం చేయలేక పోతున్నాను. త్వరలో చిత్తశాంతికల్గితే మీ ఆశీర్వాదబలంతో ఒక గొప్ప కావ్యాన్ని వ్రాయగలనని ఆశిస్తున్నాను."

పిమ్మట అధ్యక్షులు సభను ముగిస్తూ "పుట్టపర్తి నారాయణాచార్యులు ప్రజలలో వచ్చిన మార్పులను గురించి, భావవిప్లవాన్ని గురించి చెప్పినారు. ఇంతకు ముందు కాలంలోకూడా మార్పులు వచ్చినవి. ఈ మార్పులు రావడం మామూలే. ఈనాటి విప్లవంకంటె నిన్నటి విప్లవం గొప్పది. మొన్నటి విప్లవం అంతకంటె గొప్పది అని నా అభిప్రాయం. క్షణికానందాన్ని యిచ్చేది కావ్యం అనిపించుకోదు. కాబట్టి చిరస్థాయిగా వుండేటట్టు పద్యాల సంఖ్యవల్లగాక గుణంవల్ల గొప్పదైన ఒక కావ్యాన్ని వ్రాస్తారనీ, తన మానసికావేదనే ఒక మహాకావ్యానికి దారితీయగలదనీ నమ్ముచున్నాను."

---

"నాగలిపట్టి నడుమువంచి పనిచేసేవాడికంటె, తనకు సమాజం ఎక్కువ సుఖాలూ, తీరికా కల్పించిందికదా అని, కవిగానీ, చిత్రకారుడుగానీ సంతృప్తి పడరుసరికదా, సంపాద్యంలోనూ రైతుకంటె తమదేపైచేయి కావలెనంటారు. స్టూడియోలో తాను పని జేసింది పొలములో రైతుపడేపాటుకంటె చాలగంట లెక్కవైనట్లు, చాల కష్టమైనట్లు, పనిచేయకుండా కులుకుదామనే నవీన పిశాచికి కళాకారులు పూజారులవుతున్నారు.

— బెర్నార్డ్ షా

# ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం

## కార్య నిర్వాహక వర్గ సమితి తీర్మానాలు

ఆంధ్ర అభ్యుదయ రచయితలసంఘ కార్యవర్గమూ, అభ్యుదయ సంపాదకవర్గమూ, అభ్యుదయ రచయితల సంఘ కార్యనిర్వాహక సమితీ, విజయవాడ సంఘ కార్యాలయంలో ఆగస్టు 24, 25, 26 వ తేదీలలో సమావేశమయ్యాయి. సమావేశాలకు శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు అధ్యక్షత వహించారు. ఈ క్రింది తీర్మానాలు ఆమోదింపబడినాయి.

### సంతాపం

1) ప్రఖ్యాత పండితుడు, సాహిత్య పరిశోధకుడు శ్రీ అడిదము రామారావుగారి మరణానికి ఈ సమావేశం తమ సంతాపాన్ని వెలిబుచ్చుతున్నది.

2) "అభినవ తిక్కన", "సాహిత్య స్థాపక" బిరుదాంకితులై ప్రఖ్యాత సంస్కృతాంధ్ర పండితులైన శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి మరణానికి ఈ సమావేశం తమ సంతాపాన్ని వెలిబుచ్చుతున్నది.

3) అఖిలభారత అభ్యుదయ రచయితలసంఘ సంస్థాపకులలో ఒకరైన మహమ్మదుజ్జాఫర్ మరణానికి ఈ సమావేశం తమ ప్రగాఢ సంతాపాన్ని వెలిబుచ్చుతున్నది.

4) ప్రముఖ సోవియట్ రచయిత అలెగ్జాండర్ ఫెడయెవ్ మరణానికి ఈ సమావేశం తమ సంతాపాన్ని ప్రకటించుతోంది.

### ఆర్థిక నివేదిక

5) 1955-'56 సంవత్సరంలో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, అభ్యుదయ పత్రికలకు సంబంధించిన జమా-ఖర్చులను గురించి కార్యదర్శి నివేదికను ఈ సమావేశం ఆమోదించింది.

### ఆసియా రచయితల మహాసభ

6) డిసెంబరునెలలో ఢిల్లీలో జరుగనున్న ఆసియా రచయితల మహాసభను అభినందిస్తూ, అభ్యుదయ రచయితలు అందులో విరివిగా పాల్గొనాలని, సన్నాహక సంఘంలో సాధ్యమైనంతమంది సభ్యులుగా చేరాలని ఈ సమావేశం కోరుచున్నది.

### తాపీ ధర్మారావుగారికి సన్మానం

7) అభ్యుదయ ఉద్యమ స్థాపకులలో ప్రధానులై అభ్యుదయ సాహిత్యాభివృద్ధికి నిరంతర కృషిచేస్తున్న శ్రీ తాపీ ధర్మారావుగారిని సన్మానించవలెనని ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం నిర్ణయించుతోంది. ఈ సన్మానసభను విస్తృత ప్రాతిపదికమీద జరపవలెనని విశాలాంధ్రలోని ప్రముఖులందరినీ ఈ సభకు ఆహ్వానించవలయుననీ నిర్ణయించడమయినది.

ఈ సన్మానసభ ఏర్పాట్లను నిర్వహించవలసిందిగా మద్రాసుశాఖను కోరడమైనది.

### అనువాదాలు

8) తెలుగు కథానికలను, కవితను, ఏకాంక నాటికలను కొన్నిటిని ఇంగ్లీషు, హిందీ భాషలలోకి అనువదింపజేయుటకు, ఆధునికాంధ్ర సాహిత్య సంక్షిప్త చరిత్రను కరపత్రంగా ఇంగ్లీషులో ప్రచురించుటకు నిర్ణయించడమైనది.

### పత్రిక

9) అభ్యుదయ పత్రిక ఆర్థిక పరిస్థితులను ఈ సమావేశంలో చర్చించడమైనది. సంఘ నిర్మాణాభివృద్ధి దృష్ట్యా అభ్యుదయను సాధ్యమైనంత త్వరలో మాసపత్రికగా నడపడానికి నిర్ణయించడమైనది. కార్యవర్గ సభ్యులూ, రచయితలూ మాసపత్రిక నిధికి సహాయపడవలసిందిగా కోరడమైనది.

సంఘ నిర్మాణానికి సంబంధించిన మరికొన్ని తీర్మానాలుకూడా చేయబడినాయి.

# తెలంగాణా రచయితల సంఘం

## ద్వితీయ వార్షికోత్సవాలు

తెలంగాణా రచయితల సంఘ ద్వితీయ వార్షికోత్సవాలు, సెప్టెంబర్ 15, 16, 17 తేదీలలో హైదరాబాద్‌లో ఎగ్జిబిషన్ గ్రౌండ్స్ హాలులో జరిగాయి. శ్రీ కాళోజీ నారాయణరావుగారు అధ్యక్షత వహించారు. ఆంధ్ర ప్రభుత్వ ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రారంభోపన్యాసం గావించారు. హైద్రాబాద్ ప్రభుత్వ ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు సందేశమిచ్చారు. హిందీ, కన్నడ, మరాఠీ, ఉర్దూ సాహిత్యవేత్తలు సందేశాలిచ్చారు. ఆహ్వానసంఘాధ్యక్షులు శతావధాని శ్రీ యస్.సి.యస్. వేంకటాచార్యులుగారు స్వాగతోపన్యాసం ఇచ్చారు. ప్రధాన కార్యదర్శి సి. నారాయణరెడ్డిగారు నివేదిక సమర్పించారు.

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి, డాక్టర్ బి. రామరాజుగారికి సన్మానాలు జరిగాయి.

సంస్కృత సాహిత్యగోష్ఠి, కథా సాహిత్యగోష్ఠి, సాహిత్య గోష్ఠి, కవి, పండిత సన్మానం, కవి సమ్మేళనం జరిగాయి.

శ్రీ పల్లా దుర్గయ్యగారి 'గంగిరెద్దు' కావ్యావిష్కరణం శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కావించారు. కథానికా గోష్ఠిని శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రారంభించారు. ప్రముఖ సాహితీవేత్తలు, విద్వాంసులు, పండితులు ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు.

అభ్యుదయ రచయితల సంఘం తరఫున తుమ్మల వెంకటరామయ్యగారు, మద్రాసు తెనుగు రచయితల సంఘం తరఫున "శ్రీ వాత్సవ" గారు సభలలో సందేశాలనిచ్చారు.

సెప్టెంబర్ 17న తెలంగాణా రచయితల సంఘ సర్వసభ్య సమావేశం జరిగింది. అందులో

ఆంధ్రప్రదేశ్ అవతరణపట్ల హర్షం ప్రకటిస్తూ ఒక తీర్మానాన్ని, మహబూబ్‌నగర్ రైలు ప్రమాద బాధితులపట్ల సానుభూతి తెలుపుతూ ఒక తీర్మానాన్ని ఆమోదించారు.

ఆంధ్రప్రదేశ్‌కు వర్తించునట్లుగా తెలంగాణా రచయితల సంఘ నియమావళిని సవరించాలని తీర్మానించారు.

ఉపాధ్యక్షులు శ్రీ దాశరథిగారు అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు నిర్మాణంపై ఈ క్రింది తీర్మానం ప్రవేశపెట్టగా, చర్చల అనంతరం ఆమోదించబడింది.

"ఆంధ్రావని ఏకమై, మహాంధ్ర స్వరూపం ఏర్పడి ఆంధ్ర ప్రదేశం అవతరించు శుభముహూర్తం సమీపించుచున్నది. ఏ జాతి ఉన్నతికి గాని పురోగమనమునకు గాని ఆ జాతి సాహిత్యం మార్గదర్శకము. అట్టి సాహితీ సంపత్తిలో తెలుగుదేశం ఎప్పుడూ వెనుకంజ వేయలేదు. పూర్వ, మధ్య, ఆధునిక యుగాలలో వాగనుశాసనుడు మొదలు వర్తమాన కాలంవరకు తెలుగు రచనావ్యాసంగం నవ్యరీతులలో నడుస్తూనే ఉన్నది. ఆంధ్రులు సామ్రాజ్యములు ఏలిన కాలంలో ఆంధ్ర భాషామతల్లిని మహారాజులు పోషించినారు. ఒకనాడు తెలుగుతేట కర్ణాట కస్తూరితో కలిసి 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న బిరుదాన్ని పొందినది.

"రోజులు మారినవి. ఆ రాజులు యీనాడు లేరు. ప్రజలే భాషాపోషకులు. ఇన్నాళ్లుగా మూడు చెరగులైన ముక్కోటి తెలుగుల సమిష్టి సాహిత్య కృషికి పొలిమేర లాటంకమైనవి. ఈనాడు తెలుగుదేశం ఒక మేరదైనది. ఇట్టి తరుణంలో తెలుగు సాహిత్యసంపద యింటనేగాక, బైటకూడా ప్రచారం చేయవలసిన అవసర మేర్పడినది. అట్టి అవసరాన్ని గుర్తించియే ఆంధ్ర సాహిత్యాభిమానులు కొందరు అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు సంస్థాపనచేయ ప్రయత్నాన్ని ప్రారంభించినారు. అలాటి ప్రయత్నాన్ని ప్రజాభిప్రాయ మాశీర్వదించింది. పత్రికలు బలపరిచినవి. తెలంగాణా రచయితల సంఘ వేదికపై యీ రెండు మూడు దినాలు ఆ ప్రయత్నానికి మరికొంత బలం చిక్కింది. ఆంధ్ర, హైదరాబాదు ముఖ్య మంత్రులు ఆ ప్రయత్నాన్ని కొనసాగించమని ఉద్ఘాటించారు. తెలంగాణా రచయితల సంఘ కార్యవర్గం యీవరకే యీ ఆశయాన్ని ఆహ్వానించింది. అట్టి సంస్థను రూపొందించడంలో వివిధ సాహితీ సంస్థల, ప్రసిద్ధరచయితల, ప్రాంతీయ ప్రభుత్వముల, విశ్వవిద్యాలయముల ప్రాతినిధ్యం ఉండవలెనని యీ సర్వసభ్యసమావేశం అభిప్రాయపడుతున్నది. ఈ విషయంలో తగు ప్రయత్నాలు చేయడానికి సంఘాధ్యక్షులకు సర్వాధికారాలు యిస్తున్నది."

తీర్మానాన్ని సంఘ కార్యదర్శి శ్రీ సి. నారాయణరెడ్డిగారు బలపరిచారు.



# పుస్తక పరిచయం

## పునర్జన్మ

రచన:

శ్రీ బెల్లంకొండ రామదాసు

ప్రచురణ:

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

వెల: రూపాయి పావలా.

అవినీతికి, అమానుషత్వానికి బలియైపోయి, చీకటి కూపంలో జీవించే ఒక అనాథ యువతికి మూర్తి అనే ఒక డాక్టరు రక్షణ ఇచ్చాడు. ఆ అమ్మాయి దీనావస్థకు జాలి తలచి, ఆ సానుభూతి ప్రేమగా మారి పెండ్లి చేసుకుంటాడు. ఇంటికి తీసుకొచ్చి కాపురం పెట్టాడు. జబ్బుతో వున్న అతని తండ్రి, చెల్లెలూ ఆమె సౌశీల్యాన్ని అర్థం చేసుకుని ఆదరించారు. శ్యామల జీవితం సుఖంగా గడిచిపోతోంది. కాని శ్యామల గతజీవితంలో చేసిన పాపాలు ఆమెను విడిచిపెట్టలేదు. పూర్వం ఆమెతో సంబంధం పెట్టుకుని, పోషించలేక వదిలిపెట్టిన కుమార్ తిరిగి ఆమె దగ్గరికి వస్తాడు. మూర్తిని విడిచిపెట్టి తనతో రమ్మని కోరాడు. ఆమె నిరాకరించడంవల్ల పగబూని ఆమె గత జీవితాన్ని మూర్తికి ఏకరువు పెడతాడు. మూర్తిలో కల్లోలం చెలరేగుతుంది. ఆమెను విడిచిపెట్టి తనే వెళ్ళి వేరే బంగళాలో నివాసం ప్రారంభిస్తాడు. శ్యామల ఎంత వేడుకున్నా ప్రయోజనం లేకపోతే, ఆమె దిక్కులేని పరిస్థితికి దిగజారి పోతూవుంటే తండ్రి వచ్చి మూర్తికి జ్ఞానబోధ చేసి భార్యాభర్తలను కలుపుతాడు. తన జీవితాన్ని నాశనం చేయడానికి పూనుకున్న కుమార్ శ్యామలను బలవంతంగా నిర్బంధించ పూనితే ఆమె అతన్ని తుపాకితో కాల్చుతుంది. అతను పరితపించి భార్యాభర్తల శ్రేయస్సు కోసం బలిగావడమే తన అదృష్టంగా భావిస్తాడు. ఇదీ కథ.

ఈ ఇతివృత్తాన్ని సంస్కార దృష్టిగల అధునాతన రచయితలు మాత్రమే స్వీకరిస్తారని వేరే చెప్ప నక్కర లేదు. అంతేగాదు. ఇతర రచయితలు వ్రాసిన విధంగా గాక, ఈ నాటకంలో రచయిత తన అసాధారణ ప్రతిభను, విశిష్టమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాడు. శ్యామలను జాలితలచి పెండ్లిచేసుకున్న మూర్తి, భార్య రహస్యగాథ తెలియగానే మూర్ఖుడై పోయి, శ్యామల పట్ల క్రూరంగా ప్రవర్తించి మళ్ళీ వీధుల్లోకి తరమ లేదు. తనే ఆమెను విడిచివెళ్ళి ఏకాంతవేదన ననుభవిస్తూ కాలంగడిపాడు. మూర్తి తండ్రి ఆచార పరాయణుడే అయినా ఆమెను వెళ్లగొట్టమని కొడుకును ప్రోత్సహించలేదు. ఆమె పతనానికి ఆమె బాధ్యత ఎంతవరకున్నదో గ్రహించి, అనుభవాన్ని వినియోగించి కొడుకును సన్మార్గంలో పెట్టాడు. శ్యామల చీటికీ మాటికీ బావురుమని ఏడ్చే అనాథ కాదు. తన మీద కోపంగావున్న భర్తను ధైర్యంగా ఎదురునిలబడి, మందలించి, ప్రార్థించి, బోధించి తన కాపురాన్ని నిలబెట్టుకో గలిగిన వ్యక్తిత్వం గల స్త్రీ. ఆఖరికి కుమార్ గూడా నిస్సహాయుడై ఈమెను విడిచిపెట్టినట్లే రచయిత చిత్రించాడు కాని "విలన్"గా సృష్టించలేదు.

అదే రచనలోని నవ్యత, విశిష్టత.

నాటకంలో ప్రతిపాత్ర సజీవంగా, ఆవేశ ప్రధానంగా మాట్లాడుతుంది. ప్రతి సంభాషణలోను, సన్నివేశంలోను రచయితకున్న నిశిత దృష్టి, భావనాశక్తి ద్యోతకమవుతాయి.

సనాతనులకు ఆవేదన, సంస్కర్తలకు ఆచరణ దీక్ష పురికొల్పగల ఈ నాటకం పఠించడానికి, ప్రదర్శించడానికి గూడా అత్యుత్తమంగా పనికివస్తుంది.

— అనిసెట్టి

★

## సరితాదేవి డైరీ

సరితాదేవి డైరీలో రెండు డైరీలున్నవి: ఒకటి - సరితాదేవి డైరీ; రెండవది ఆవిడ కూతురు, సరోజ, డైరీ.

సరితాదేవి, పట్టణంలో, పెరిగి పెళ్ళీడుకొచ్చిన ఒక చదువుకున్న పిల్లతల్లి. ఈరోజుల్లో ఆడపిల్లల పెళ్లిళ్లంటే మాటలుకాదు. కుటుంబంలో మిగతా సభ్యుల మాటెలా వున్నా యీ విషయంలో తల్లి బాధ్యత యింతింతకాదు.

రచయిత కుటుంబరావుగారు యీ విషయాన్ని, అలాంటి తల్లుల్లో ఒకరైన సరితాదేవిగారి డైరీ రూపంలో మనకందరికీ 'తెలివిడి' చేశారు.

డైరీ రచనలో మూడు ముఖ్యలక్షణాలుండాలని భావించారు కుటుంబరావుగారు. కథనం ఉత్తమ పురుషలో సాగడం, అది స్వగతాన్ని పోలివుండడం, కథనంచేసే పాత్రకు అప్పటివరకూ జరిగిన విషయాలు తప్ప ముందు జరగబోయేవీ యితరుల మనస్సుల్లో వుండేవీ తెలియక పోవడం.

ఈ మూడు అంశాలనూ చాల సంతృప్తికరంగా పాటించారు రచయిత. అంతేకాదు. సరితాదేవి మనస్తత్వంతోపాటు, ఆ మనస్తత్వం సాయంతో ఆవిడ యితరుల్నెంత 'చక్కగా' అర్థంచేసుకోగలదో గూడా కథాగమనానికి వీలుకలిగించుతూ చిత్రించారుగూడాను.

ఈ డైరీకి సరోజడైరీని గూడ కలపడంతో ఒకే కాలంలో బ్రదుకుతూన్న రెండు తరాలవారి మనస్తత్వాలలోవుండే భేదమూ, మార్పుగూడ ప్రస్ఫుటంగా వ్యక్తమైనై.

షుమారు నూటఏభది పేజీలున్న యీ డైరీలు, ఒక చిన్న కథని చదివినట్లు చదివించి వేస్తాయి. అంత సరళంగా, సూటిగా, వేగంగా, నర్మహాస్యంతో, సున్నిత భావాలతో, సహజ సంఘటనలతో నడుస్తుంది కుటుంబరావుగారి కలం.

పుస్తకవస్తువుకి తగిన శ్రద్ధతీసికొన్నారు ఆర్యశ్రీ ప్రచురణాలయంవారు యీ గ్రంథ ప్రచురణలో.

వెల ఒక రూపాయి.

—పిచ్చేశ్వరరావు.



# ఓనమాలు

రచయిత: శ్రీ మహీధర రామమోహన్‌రావు

అవంతీ ప్రచురణ

వెల: రెండుంబావలా

1947 లో తెలంగాణాలోని సామాజిక, రాజకీయ పరిస్థితుల్ని చిత్రించే చక్కని నవల ఓనమాలు.

ఒకవైపున జాగీర్దారుల, భూస్వాముల, పటేల్ పట్వారీ మొదలైన గ్రామోద్యోగుల నిరంకుశ శృంఖ[illegible] బద్దలుకొట్టుకోడానికి సమాజంలోని పీడిత [illegible] సమీకృతమౌతున్నారు. మరొకప్రక్క రాజకీయంగా సంస్థానాధీశులను, విదేశీయులను వైదొలగి పొందని భారతావని అంతటా ప్రజ్వరిల్లిన స్వాతంత్ర్య సమరాగ్ని జ్వాలలు హైద్రాబాద్‌నుకూడా అలముకొన్నాయి. ఈ పరిస్థితులలో భూస్వామ్య, మతోన్మాదశక్తులు రజాకార్లను సృష్టించి, పైశాచిక విలయ తాండవం సాగించుతున్నాయి.

ఆనాటి పరిస్థితులలో తమభూమికోసం, భుక్తికోసమే గాక, నిరంకుశ నిజాం పాలనకు స్వస్తిచెప్పేటందుకు తెలంగాణా జాతీయోద్యమంలో పాల్గొన్న రైతుల, వ్యవసాయకూలీలను ఈనవల వాస్తవంగా చిత్రించడమే గాక, ఒకవైపు జాతీయోద్యమం తమచిక్కుల్ని విడగొట్టుతుందనే ఆశ, మరొకప్రక్క పేదసాదలు తమకాళ్ల క్రింద నలిగిఉండాలనే స్వార్థంతో సతమతమయ్యే భూస్వామ్య వ్యక్తులనుకూడ అతిసహజంగా చిత్రీకరించింది.

రాజకీయ వాతావరణంతో కూడుకొని సమకాలిక ప్రతిబింబాలైన నవలలు తెలుగులోలేని లోటును ఈ నవల తీర్చుతుంది.

— తుమ్మల



# సింహ సేనాపతి

నేటికి 25 వందల సంవత్సరాలక్రితం ఆర్యావర్తంలోవున్న సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితుల్ని చిత్రించేటందుకై మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ వ్రాసిన ఈ నవలకు నవలగాగాక చారిత్రకంగా చాల ప్రాముఖ్యతవుంది.

ఈ కథా కాలంనాటికి—

సట్లెజ్ నదికి పశ్చిమాన గణతంత్రముల పాలన సాగుతూంది.

గంగానదీ మైదానంలో ఇంచుమించు అంతటా రాజరికపాలనలు ఏర్పడ్డాయి.

ఒక్క వైశాలిలో మాత్రం గణపాలన ఆఖరు ఘడియల్లోవుంది. బయటినుంచి మగధాధీశుడు బింబిసారుడో, కోసలరాజు ప్రసేనజిత్తో దాడిచేసే ప్రమాదం ఒకవైపున వుండనేవుంది. రెండోవైపున ఆంతరిక ఆర్థికవ్యవస్థా, సామాజిక స్థితీకూడా గణతంత్ర పాలన నడవని పరిస్థితిని తెచ్చిపెడుతున్నాయి.

గణతంత్ర పాలనలో గణానికి చెందని వారికి సానంలేదు. ఆర్థికమైన అంతరువులు స్వల్పంగా వుండ

వచ్చు. కాని యజమానులూ, బానిసలూ అనే వ్యవస్థకు అవకాశంలేదు.

వైశాలిలో గణపాలనేవుంది. కాని గణానికి సంబంధించని పైజనం స్వతంత్రులూ, బానిసలూ కూడా గణజనంకన్న అత్యధిక సంఖ్యలో వున్నారు.

గణ పరిపాలన వున్నచోట స్త్రీలకున్న వున్నత స్థానం రాజరికాలలో లేదు. సాంఘిక వ్యవస్థలో ఆమ్రపాలి వంటి అకులీనవేశ్యల ప్రవేశం గణసమాజంలోని స్త్రీలను నిష్క్రియలనుగా తయారుచేస్తాందో, సమాజంలోని సగంమంది సమాజ రక్షణకు నడుము కట్టగల వారుగా గాక సమాజంలో రక్షించబడవలసిన వారుగా తయారవుతున్నారో రాహుల్‌జీ వివరించారు.

రెండో వైపున గణ వ్యవస్థ ఆంతరిక నిర్మాణ పద్ధతిలోనే బయటి దండయాత్రలను తట్టుకోలేని స్థితి ఏలా ఏర్పడిందో సున్నితంగా చిత్రించారు.

సప్తసింధులో అనేక గణతంత్రాలున్నాయి. వాని మీదికి పరాయిరాజు దండెత్తే ప్రమాదంవుంది. ఆ స్థితిని తట్టుకోవాలంటే గణతంత్రాలన్నీ తమహక్కుల్ని కొంత తగ్గించుకొని ఒక నూతన సామాజిక సంస్థను ఏ ఫెడరేషన్‌వంటి దానినో సృష్టించుకోవాలి. ఆ విధంగాచేస్తే నిలబడతాయి. కాని తాము రక్షించుకోదలచిన గణతంత్ర విధానం మిగలడంలేదు. అలా ఐక్యం గాదలచుకోకపోతే పరాజయం, పరాధీనతా తప్పదు. అప్పుడూ గణతంత్ర విధానం మిగలదు.

చరిత్ర గణతంత్ర విధానానికి చరమగీతాల్ని లిఖిస్తూంది.

ఈ సంధియుగపు చరిత్రను రాహుల్జీ తమ యీ పుస్తకంలో వివరించారు.

రాహుల్జీ పుస్తకం ఏ భాషకయినా అలంకారమే. కాని, తెలుగు రచన ఇంతకన్న చాలా బాగుంటే సంతృప్తి కలిగేది.

తెలుగు అజంతభాష. కాని, హిందీ పరిపాటినీ, పిలుపుపద్ధతుల్నీ తెలుగు చేసినప్పుడు కూడా ఎందుకు మార్చకూడదో అర్థంకాదు. సింహ్ ! మనోరథ్, కపిల్ అని హలంతాలుగానేపేర్లు పయోగించడం, పిలుపులుపయోగించడం పుస్తకంలో చాల ఎబ్బెట్టుగానే వుంది. ఆఖరు ప్రకరణం వరకు వచ్చేసరికి సరిదిద్దుకోవడం సంతోషకరం.

తెలుగు భాషలో ఉత్తమరచనలు - స్వతంత్రాలేగానీ, అనువాదాలేగానీ - రావడానికి సర్వాత్మనా కృషిచేయవలసిన సమయం వచ్చింది. ఏదో ఒకటి గుడ్డిబావ సామెతగా సంతృప్తిపడేదశ దాటింది. ఈ దశలో రచయితలూ, ప్రకాశకులూ ఉత్తమ రచనలకోసం ప్రయత్న పూర్వకంగా కృషిచేయకపోతే తెలుగు భాషకి అపకారం జరుగుతుంది.

—రామమోహన్.

అనువాదకులు : శ్రీ గద్దె లింగయ్య

మేలుప్రతి వెల : రు 3—8—0

ప్రచురణ : విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ—2.

★

# గబన్

సుప్రసిద్ధ హిందీ నవలాకారుడు శ్రీ ప్రేమచంద్ నవల కిది తెనుగు అనువాదం. గబన్ అంటే ఆభరణం. మూడువందల పేజీల పుస్తకం అనువదించి పేరుకోసం తెలుగువాళ్ళని శబ్దకోశం వెతుక్కోమనడం బాగు లేదు.

భర్తను ఆభరణాలకోసం పీడిస్తే ఆమెను కాదనలేక, తీసుకురాగల శక్తి లేక అప్పులపాలయిన ఒక యువకుని కథ ఇది. నిజం చెప్పాలంటే ఆభరణాల వాంఛ తెచ్చే ఆపదల్ని రచయిత చిత్రించడానికి ప్రారంభించినా త్వరలోనే ఆయన కలం ఆ పరిధుల్ని అతిక్రమించింది. మనోనిబ్బరం, తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పగల ధైర్యం లేనివాడు ఎంత పతనం పొందుతాడో, అటువంటి వ్యక్తి సమాజానికి ఎంత అపకారి అవుతాడో శ్రీ ప్రేమచంద్ చక్కగా వివరించారు.

శ్రీ ఆలూరి భుజంగరావుగారి అనువాదం సాఫీగా సాగింది.

— రామమోహన్.

వెల : 3_0_0

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 2

★

## ప్రేమచంద్ కథలు

శ్రీ ప్రేమచంద్ వ్రాసిన అసంఖ్యాకములయిన కథలలో పదమూడింటిని ఏరి శ్రీ చావలి రామచంద్ర రావుగారు దీనిలో అనువదించారు.

కథలూ, అనువాదమూకూడ బాగున్నాయి.

— రామమోహన్.

వెల: రెండు రూపాయలు.

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ—2.

★

గజదొంగ

## నికోలా

ఇవాన్ ఓల్బ్రాఖ్ట్ అనే జెక్ దేశపు రచయిత వ్రాసిన నవల కిది ఆంధ్రానువాదం.

తూర్పుస్లోవేకియా – దీనినే రుథేనియా అంటారు. వెర్ఖోవినా అనేది మరోపేరు – కుచెందిన ఒక జానపద వీరుని గాథ ఇది. పెరికలపూడి స్వామి మంత్రశక్తితో తుపాకీగుళ్ళ నాపెయ్యగలడనే విశ్వాసంతో 1948 లో పాల్వంచకోయలు నిజాం మిలిటరీని ఎదుర్కొన్నారు. అలాంటి పిచ్చి విశ్వాసాలు అమాయిక ప్రతీకార వాంఛలనుంచి పుట్టుకొస్తాయి. ఈ నవలలోని నికోలాకుకూడా అలాంటి కథే తగిలించి వుంది. అతని చేతిలో ఒక పచ్చ మండ వుండేదనీ, దాని మహిమ వలన తుపాకీ గుళ్ళు తగిలేవి కావనీ ప్రజల విశ్వాసం. మిత్రుల ద్రోహానికి గురియై మరణించిన ఈ యోధుడు సాంఘిక పీడనను, ఆర్థిక రాజకీయ బాధలను ఏకాకిగా ఎదిరించి ప్రజాభిమానం చూరగొన్నాడు.

రచయితలు నామవాచకాల్ని కూడా ఒకే పద్ధతిలో వ్రాయలేదు. నికోలావురు కోలోచావా, కొలొకావా అని రెండువిధాలా వ్రాశారు. స్లోవేకియాను కొన్ని చోట్ల రుథేనియా, కొన్నిచోట్ల వెర్ఖోవినా అని వాడేరు.

"కొత్త 'పిచ్చి'వాడు పొద్దెరగడు" లాంటి తప్పు రూపంలో ప్రయోగాలున్నాయి. ఇల్లాంటి అప్రయోగాలు చాలా వున్నాయి. అందుచే అనువాదం ఆశించినంతగా బాగుండలేదు.

— రామమోహన్.

అనువాదకులు:
శ్రీ పిచ్చేశ్వరరావు, రెంటాలగార్లు
ప్రచురణ
నవోదయ పబ్లికేషన్స్, గుడివాడ.
వెల: రెండురూపాయలన్నర

★

## ప్రతాపరుద్రీయం

శ్రీ పొన్నలూరి రాధాకృష్ణమూర్తిగారు ఈ నవలలో కాకతీయరాజ్య పతనానికి తోడ్పడిన సాంఘిక, రాజకీయ, మత పరిస్థితుల్ని చిత్రించడానికి ప్రయత్నించారు.

కాని, 14వ శతాబ్దపు పరిస్థితులకు బదులు 20వ శతాబ్దపు ఘటనలూ, భావాలే అడుగడుగునా అడ్డం వచ్చి నవలయొక్క వుద్దేశాలకి విఘాతం కల్గించుతూంది.

— రామమోహన్.

వెల: రు. 2—0—0 లు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ—2.

# స్వీకారం

## ప్రభ

(అశ్వఘోషుని జీవితగాథ–నాటకం)

రచయిత: శ్రీ మాడభూషి వెంకటాచార్య

వెల: రు. 2—0—0

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ–2

* * *

## నీలంరాజు (విజయనవమి)

రచయిత: శ్రీ యస్. అబ్దుల్ రహిమాన్

వెల: రూపాయి

ప్రతులకు:

అరుణ ప్రింటర్స్, అనంతపురం.

* * *

## ఆహార్యం (మేకప్)

రచన: శ్రీ కుమార్

వెల: ఆరణాలు

ప్రచురణ:

ఆంధ్ర థియేటర్స్ ఫెడరేషన్, రాజమండ్రి

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2

* * *

## విజయనగర సామ్రాజ్యము (నవల)

రచయిత: శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య

వెల: రు 3–4–0

ప్రతులకు:

స్వరాజ్యప్రెస్, హనుమాన్ పేట,

విజయవాడ–2

[illegible]

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ–2

* * *

## పెన్నేటిపాట

రచన: విద్వాన్ విశ్వం

ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం

వెల: రూపాయిన్నర

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2

## జైత్రయాత్ర

(చీనా ప్రజా విప్లవ రూపకం)

రచయిత: హ్యూకో

అనువాదం: శ్రీ శ్రీనివాస చక్రవర్తి

పాటలు: శ్రీ కృష్ణమూర్తి

వెల: రూపాయిన్నర

సాహిణీ ప్రచురణ

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2

* * *

## పాలవెల్లి

రచయిత: శ్రీ పల్లా దుర్గయ్య

ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం

వెల: రూపాయిపావలా

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2

* * *

## వివాహవిధి

రచయిత:

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి

వెల: పావలా

## సూతపురాణము

ప్రథమ, ద్వితీయాశ్వాసాలు

ఒక్కొక్కటి రూపాయిపావలా

ప్రతులకు:

సూతాశ్రమ గ్రంథమాల, హనుమాన్ పేట

విజయవాడ – 2

* * *

## సారస్వత వ్యాసముక్తావళి

రచయిత: శ్రీ బూర్గుల రామకృష్ణరావు

వెల: రూపాయిపావలా

ప్రచురణ:

ఆంధ్ర సారస్వతపరిషత్తు, బొగ్గులకుంట,

హైదరాబాదు

ప్రతులకు:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ 2